# THE CALL OF THE WILD

by

JACK LONDON

Published by
·The Macmillan Company,
New York.

*Translated by :*
K. KUTUMBA RAO



First Edition, May 1 9 5 9.
5000 Copies, PRICE: RS. 1.75

PUBLISHED UNDER THE AUSPICES OF THE
SOUTHERN LANGUAGES BOOK TRUST.



PUBLISHERS:
DESI KAVITA MANDALI,
Buckinghampet, VIJAYAWADA-2.

# పీఠిక

ప్రజాసామాన్యానికి ఆకర్షకంగా, విశేషోప యోగకరంగా ఉండి పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తక సంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింప చేసింది. ప్రచురణల వలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింప జేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల, మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహా నాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒకశాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయం కోసం మహా పురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వారెన్ని పాట్లు పడినది ముందుతరాల వారికి తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వ శాస్త్రం, మతం, విజ్ఞాన శాస్త్రం, సాహిత్యం —ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు, కథానికలు,

ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలు కూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్ప శాస్త్రం, పురావస్తు పరిశోధనలు, నిరతాద్భుతావహము లైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షింపగలవు. ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింప చేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంస నీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడి నప్పుడు, విద్యాపరంపరలో ఎక్కువ మందిని వివిధ విష యాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులనుగా ఆకర్షించి, జ్ఞాన పిపాసను తృప్తిపరచ టానికి యోగ్యమైన గ్రంథాలను కూడా వారికి అందచేసినట్లు అవుతుంది.

ఈ దక్షిణ భాషాపుస్తక సంస్థ ఆశయాలు శీఘ్ర గతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు
7-10-1958

ఇట్లు,
డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్.
వైస్‌ఛాన్సలర్
మద్రాసు విశ్వవిద్యాలయం

క్లాన్ డైక్ బంగారానికి నిలయం కావడంతో అక్కడికి అనేక అవసర పదార్థాలను సరఫరా చెయ్యవలసి వచ్చింది. కెనడా ప్రభుత్వం తంతి తపాలా ఏర్పాట్లను కూడా చేసింది.

ఈ ఉత్తరాలను మోసుకుని వెళ్ళడానికి కుక్కలబండ్లు ఎంతో అవసరం. అందుచేత కుక్కల వ్యాపారం ముమ్మరంగా పెరిగింది. కొందరు కుక్కలను దొంగిలించి అమ్మడానికి కూడా తలపడ్డారు. ఇలా దొంగతనంగా అమ్మబడిన ఒకకుక్క ఈ కథలో ముఖ్యపాత్ర.

జాక్‌లండన్ కథలు చెప్పడంలో సిద్ధహస్తుడు. అతను చెప్పిన అద్భుతమైన అనేక కథల్లో ఇది ఒకటి. కొన్ని కోట్లమంది పాఠకులు ఈ కథని మూలంలో చదివి ఆనందించారు.

ఇప్పుడు మన పాఠకులకు కూడా ఈ కథని అందించడానికి ఈ అనువాదాన్ని ప్రకటిస్తున్నాం.

మద్రాసు
14–10–'58

ఎం. పి. ధోరన్
తమిళ విజ్ఞాన సర్వస్వము ప్రధాన సంపాదకులు.

# పరిచయం

జాక్ లండన్ రొమాంటిక్ స్వభావం గలవాడు. ఈ గుణం అతని జీవితంలోనూ, రచనలలోనూ, కూడా కనిపిస్తుంది. ఆయనకు శక్తివంతమైన, ఉద్వేగపూరితమైన జీవితంపై అత్యంత ప్రీతి అయిన కారణంచేతనే ఆయన అసాధారణంగా జీవించాడు. స్వాప్నిక జగత్తును స్ఫురింపజేసే సాంఘిక సిద్ధాంతాలు అవలంబించాడు, కీర్తినీ, కాంచనాన్నీ కాంక్షించాడు. ఆయన తన రచనలలో తీసుకున్న ఇతివృత్తాలూ, రచనావిధానము కూడా ఈ మనస్తత్వాన్నే ప్రతిబింబిస్తాయి.

1876 జనవరి 12 న జాక్‌లండన్ శాన్‌ఫ్రాంసిస్కో నగరంలో జన్మించాడు. ఆయన తలిదండ్రులు పడమటి అమెరికాలోని మధ్య ప్రాంతంనుంచి వచ్చారు. జాక్‌లండన్ తండ్రి అమెరికను అంతర్యుద్ధంలో పోరాడినవాడు. ఆ యుద్ధంలో ఆయనకు తగిలిన గాయాలు ఆయన జీవితంలో పూర్తిగా మాననేలేదు. అందుచేత తనతండ్రి అందరిలాగా తిరుగుతూ ఉండటం కొడుకు ఎరగడు. తాను పుట్టినప్పుడు తలిదండ్రులు జాన్ గ్రిఫిత్ లండన్ అని పేరుపెట్టారు గాని, కుర్రవాడు తనపేరును జాక్ అని మార్చుకున్నాడు. జాక్ అనేపేరు రొమాంటిక్‌గా ఉంటుందని అతనికి తోచింది. అతని బాధ పడలేక అతని ఉపాధ్యాయులు ఈ పేరు మార్పును ఆమోదించారు. తరువాత అతను రచనలు సాగించిన కొత్తలో "అట్లాంటిక్ మంత్లీ" అనే పత్రికయొక్క సంపాదకుడు అతనిచేత పాత పేరు ఉపయోగింప జేద్దామని ప్రయత్నించాడు గాని, ఆ ప్రయత్నం విఫలమయింది. చిన్నతనంలో తానుపడ్డ కష్టాలను గురించి జాక్‌లండన్ తరువాత అతిశయించి చెబితే చెప్పిఉండవచ్చు. కాని అతను తిండికి మాడలేదు. "వ్యాకరణ పాఠశాల" (గ్రామర్ స్కూల్)లో అతను చదువుకోటానికి దారిద్ర్యం అడ్డురాలేదు. అతని తలిదండ్రులు కొంత

కాలం కూరలు పండించీ, ఇతరపనులు చేసీ జీవయాత్ర సాగించారు. కాలక్రమాన ఆర్థికబాధలు ఎక్కువై, వారు తనకున్నది కాస్తా అమ్ముకుని ఓక్లాండ్‌కు మారారు.

పేదఇంట పెరిగినప్పటికీ జాక్‌లండన్‌కు పుస్తకాలు చదివే సావకాశమూ, పగటికలలు కనే సావకాశమూ చిక్కింది. అతను ఎనిమిదేళ్ళవాడై ఉన్నది లగాయతు అతనికి పుస్తకాలలోని సంఘటనలు జీవితంలోని సంఘటనలంత వాస్తవంగానూ ఉండేవి. అతను పసివాడై ఉండగా అతనికొక పుస్తకం దొరికింది. ఒక ఇటాలియన్ కుర్రవాడు గొప్పసంగీత విద్వాంసుడు కావటం ఎంతో ఆకర్షవంతంగా ఆ పుస్తకంలో రచించబడింది. ఆ పుస్తకంలో చివరపేజీలు కొన్ని లేకపోవటం చేత చివరకు కథ ఎలా ముగిసిందో తెలియలేదు. అయినా జాక్ తన అక్కచేత ఆ పుస్తకం చదివించుకున్నాడు; తరవాత తానే స్వయంగా దాన్ని పదే పదే చదువుకున్నాడు. మిగిలిన అన్ని ప్రభావాలకన్నా కూడా ఈ పుస్తకం ప్రభావం అధికంగా తన జీవితాన్ని రూపొందించిందని అతను తరువాతి జీవితంలో అంటూ ఉండేవాడు. త్వరలోనే అతనికి మరొక పుస్తకం చిక్కింది. ఈ పుస్తకంలో ఆఫ్రికా సంచారం గురించి, అక్కడి అనుభవాలను గురించీ ఉన్నది. ఇదికూడా అతన్ని బలంగా ఆకర్షించింది. అయితే ఇంతకన్న కూడా అతని హృదయాన్ని చూరగొన్న పుస్తకం, ఇర్వింగ్ రచించిన "అల్‌హాంబ్రా". ఇందులోని "రొమాంటిక్ గ్లామర్" అద్భుతమైనది. ఇవిగాక జాక్ అరువు తెచ్చుకున్న చౌకబారు నవలలూ, పత్రికలోని కథలూ చదివాడు. జాన్‌లండన్ (జాక్ తండ్రి) తన యావదాస్తీ అమ్ముకుని ఓక్లాండ్ వెళ్ళాక జాక్‌కు ఉచితపుస్తక భాండారాలు (Free public libraries) దొరికాయి. అప్పుడతనికి పదేళ్ళు. ఆ వయసులోనే అతను స్మోలెట్, విల్కీ, కాలిన్స్ మొదలైనవారి రచనలూ, సముద్రయానాలకూ, దేశాన్వేషణకూ సంబం

ధించిన రచనలూ, విరివిగా చదివాడు. మరి ఒకటి రెండు సంవత్సరా
లలో రుడ్యార్డ్ కిప్లింగ్ రచనలు వచ్చాయి. ఈ రచనలపట్ల జాక్‌లో
రేకెత్తిన ఉత్సాహం అతని జీవితాంతంవరకూ ఉంది.

అయితే జాక్ పుస్తకాలు చదవటంతప్ప ఇంకేమీ చేయలేదనుకో
రాదు. అతను ఓక్లాండ్‌లో రోజూ పొద్దునా సాయంకాలమూ ఏదోఒక
పనిచేస్తూండేవాడు. శనివారాలప్పుడు చిల్లరపనులు చేసేవాడు. అతన్ని
సముద్రం మొదటినుంచీ ఆకర్షించింది. చదువు పూర్తికాగానే అతను
ఈ సరదా తీర్చుకున్నాడు. అతను వెంటనే సముద్రం మీదికి
ప్రయాణమై పోకపోయినప్పటికీ, పన్నెండుగడుగుల నిడివిగల తెప్పఒకటి
వేసుకుని శాన్‌ఫ్రాన్సిస్కో అఖాతంలో తిరుగుతూ చాలాకాలం గడప
సాగాడు. ఇలా తిరిగే రోజులలోనే అతనికి పన్నెండో ఏట
ఇద్దరువ్యక్తులు పరిచయమయారు. వారిలో ఒకడు నల్లమందు చాటుగా
చేరవేసేవాడు (Opiums - smugler), రెండవవాడు తిమింగిలాలను
వేటాడేవాడు. ఈ ఇద్దరూ అతని బుద్ధికి అపూర్వవ్యక్తులుగా తోచారు.
నల్లమందును చాటుగా రవాణా చేసేవాడి పడవలోకి వెళ్ళి జాక్ తన
కొత్తమిత్రులతో కలిసి తాగేవాడు. కాని ఇది ఎంతోకాలం సాగలేదు.
అతను పనిలో ప్రవేశించవలసి వచ్చింది. అతను అనేక మాసాలపాటు
రోజుకు అనేక గంటలచొప్పున ఒక ఫాక్టరీలో పనిచేయవలసి వచ్చింది.
పనివస్తున్నకొద్దీ అతనిమనస్సు యంత్రాలపైన తిరగబడసాగింది. ఈ
పనిలో మనసుకు ఉల్లాసం కలిగించే "రొమాన్స్" లేదు, సాధించేఘనత
లేదు, కొత్తవింత అనుభవాలకు అవకాశంలేదు. జాక్‌కు ఫాక్టరీలం
టేనూ, ఫాక్టరీలతో కూడిన ఆర్థికవిధానమంటేనూ రోతపుట్టింది. అతను
ఫాక్టరీపని మానేస్తూనే ముత్యపుచిప్పల దొంగతనాలకు ఉపక్రమించాడు.
శాన్ ఫ్రాన్సిస్కో అఖాతంలో ముత్యపుచిప్పల మడులున్నాయి. వాటిని
తస్కరించటానికిగాను అతను ఒక చిన్నపడవ కొన్నాడు. ఇందుకు

మూడువందల డాలర్లు కావలసివస్తే తనను పెంచిన నీగ్రోదాదివద్ద అప్పుతీసుకున్నాడు. తానుకొన్న పడవకు ఆర్భాటంగా "రాజిక్ డాజిల్" (తొలకరి మెరుపు) అని పేరుపెట్టాడు. అతనికి అప్పటికి పదిహారేళ్ళే అయినా తన పడవను తానే నడుపుకునేవాడు, ఎవరైనా ఎదిరిస్తే ఒక దెబ్బకు రెండు దెబ్బలు ఇచ్చుకునే శక్తికూడా అతనికి వుండేది. రేవులో వుండే పానశాలకు వచ్చే చిల్లర నావికులూ, ఆ ప్రాంతాల నేరాలుచేసి జీవయాత్రగడపే అనుమానాస్పదులూ అతనిమిత్రులు. వారి పేర్లుకూడా వారి వృత్తులకూ స్వభావాలకూ తగ్గట్టే వుండేవి.

జాక్‌కు అకస్మాత్తుగా దొంగజీవితం మొహం మొత్తింది. అతను దొంగతనాలు మాని దొంగలను పట్టుకునే ఉద్యోగంలో ప్రవేశించాడు. తాను అదివరకు చేసిన నేరాలే చేసేవారిని పట్టుకోవటం ఇప్పుడతని పని. ఇందులో అంతరాత్మ ప్రమేయం ఏమీలేదు; రెండురకాల అనుభవాలూ సంపాదించటం అతనికి "సరదా" అనిపించింది. ఇప్పుడతను మరింత విశృంఖలంగా జీవించసాగాడు. తాగుడు జాస్తిఅయి అతని దృఢమైన శరీరం ఎందుకూ పనికిరాకుండా పోయేలాగ కనబడింది. ఇది అతనికి ఏమాత్రమూ నచ్చలేదు. అందుచేత తన పదిహేడో పుట్టినరోజునాడు అతను కొత్త ఉద్యోగంలో ప్రవేశించాడు. * "సీల్" అనే జంతువులను వేటాడటానికి వెళ్ళే ఒక నౌకలో ఇతను జపానుకూ, బెరింగ్ సముద్రానికి బయలుదేరాడు.

ఈ ప్రయాణం జాక్‌కు మంచిచేసింది. రేవులలో దిగినప్పుడు తాగుడూ తందనాలూ సాగినా, సముద్రంమీద బండచాకిరీ ఉండేది. అతను తిరిగి ఓక్లాండుకు తిరిగి వచ్చాక అతని ఆప్తులు అతన్ని ఒక స్థిరమైన ఉద్యోగం చేసుకోమని సలహా ఇచ్చారు. అతను నారమిల్లులో

---

* కొన్ని తీరాలలో ఈ జంతువులు మందలు మందలుగా ఉంటాయి. వీటిని చర్మాలకోసమూ, కొవ్వుకోసమూ వేటాడతారు.

ఉద్యోగం సంపాదించాడు. కాని ఈ ఉద్యోగంపైన అతనికి అసహ్యం పుట్టింది. తరవాత రోడ్డు ఇంజనులో బొగ్గువేసే పనిచేశాడు; అదీ అతనికి నచ్చలేదు. ఇది జరిగినది 1894 లో. ఈ సంవత్సరంలో చరిత్రప్రసిద్ధమైన కార్మికులయాత్రలు సాగాయి. చార్లెటి. నెలీ నాయకత్వంక్రింద నిరుద్యోగు లైన కార్మికులు వాషింగ్టన్ నగరానికి యాత్రచేశారు. ఓహాయోలో జరి గిన "ప్రదర్శనల" ఫలితంగా ఇలాటియాత్రలు ఇంకా అనేక నగరాలలో కూడా సాగాయి. కెలీకింద యాత్రకు బయలుదేరిన "నిరుద్యోగులసేన" లో ఆరువందలమంది ఉన్నారు. వీరు శాన్‌ఫ్రాన్సిస్కోనుంచి బయలు దేరారు. ఆ నగరపు మేయరు వారి బాధ్యతనుంచి విముక్తి పొందటానికి గాను వారికి దారిఖర్చులు తానే ఇచ్చుకున్నాడు. ఓక్లాండ్‌లో కూడా నిరు ద్యోగుల సంఖ్య హెచ్చిపోతున్నది, అందుచేత వారిని వదిలించుకొన టానికి గాను శాక్రమెంటో వెళ్ళటానికి అయే ఖర్చులు నగరమే భరిం చింది. కెలీ "సేన" ఓక్లాండ్ వచ్చినప్పుడు జాక్ అందులో చేరలేక పోయాడు. అతను వెనకగా బయలుదేరి టిక్కెట్టు లేకుండా రైళ్ళలో దాక్కొని ప్రయాణంచేసి వెళ్ళి ఒమాహాలో వారిని కలుసుకున్నాడు. దేశా టన చేసే బిచ్చగాళ్ళ యుక్తులన్నీ జాక్‌కు అతి సులువుగా అలవడ్డాయి. మెత్తని మనస్సుగల ఇల్లాళ్ళను మభ్యపెట్టి తిండి సంపాదించటానికి గాను కరుణపూరితమైన కథలు అల్లటం అతనికి చాలా సరదాగా ఉండేది. అతను ఒమాహా చేరేసరికి యాత్రికుల సేన చాలా విజయవంతమైన స్థితిలో ఉన్నది. కాని వారు అయోవా రాష్ట్రంమీదుగా వెళుతూండగా వాషింగ్టన్‌లోని ప్రదర్శనలు విఫలమైనట్టు వార్త వచ్చింది. ఆ తరవాత "సైనికుల"లో అరాజకం ప్రవేశించింది. ఈ అరాజకాన్ని ప్రకోపింప జేయటానికి జాక్ కూడా యథాశక్తి తోడ్పడ్డాడు. క్రమంగా "జనరల్" కెలీ పలుకుబడి క్షీణించింది. ఉద్యమంపట్ల జాక్‌కు ఉండిన గౌరవం పూర్తిగా తుడిచిపెట్టుకు పోయింది. నిజానికి అతన్ని ఆకర్షించింది, ఈ

ఉద్యమం వెనక ఉంపిన రాజకీయాలు కావు. ఉద్యమంలో ఉండిన ఉద్రేకపూరిత అనుభవం మాత్రమే. ఇలాటి అనుభవాలకోసం తాను ఒంటరిగా అన్వేషించటం మంచిదని తోచి హానిబాల్ నగరంలో అతను "సేన"కు స్వస్తిచెప్పి తనదారిన తాను బయలుదేరాడు. మరి రెండు మాసాల అనంతరం కెలీ "సేన" చాలా భాగం క్షీణించి వాషింగ్టన్ చేరింది.

జాక్ లండన్ ఒక ఏడాది గాలితిరుగుడు తిరిగి, ద్రిమ్మరి నేరానికి గాను మూడునెలలు ఖైదులో గడిపి ఓక్లాండుకు తిరిగి వచ్చాడు. తనకు విధించబడిన ఈ ఖైదు చాలా అక్రమ మని అతనికి తోచింది. అతని సాంఘిక విశ్వాసాలకు అది దోహదం చేసిందికూడా. అయితే ఇందువల్ల ఒక మేలుకూడా జరిగింది; తన ప్రస్తుత జీవిత విధానంతో తాను ఏ గమ్యాన్నీ చేరుకోలేనని అతను గ్రహించాడు. ఇంటికి వస్తూనే అతను తన సోదరి వద్ద అప్పుచేసి ఓక్లాండ్ హైస్కూలులో చదువుకోసాగాడు. కాలేజీ చదువుకూడా చదవాలని అతని ఉద్దేశం.

కాలేజి చదువు ద్వారా అతను ఆశించినది విద్యకాదు, సంస్కృతి కూడా కాదు. తన అనుభవాల ఆధారంపై అతను రచించిన "మార్టిన్ ఈడెన్" అనే నవలలో కథానాయకుడు తన లక్ష్యం "సంస్కృతి కాదు, ఉద్యోగం" అంటాడు. జాక్ లండన్ లక్ష్యంకూడా అదే. అతను రచనలు చేసి పుష్కలంగా సంపాదించుదా మనుకున్నాడు. ఇందుకు ప్రేరణ ఏమంటే, ఒకటి రెండేళ్ళ క్రితం అతను ఒక పత్రికలో తుఫాను వర్ణన ప్రచురించి ఒక బహుమానం పొందాడు. రచయితగా కీర్తీ ధనమూ సంపాదించటంతో పోలిస్తే తాను పూర్వం చేసిన ముత్యపు చిప్పల దొంగతనాలూ, సముద్రయానాలూ, గాలితిరుగుళ్లూ చాలా చప్పగా కనిపించాయి. మంచంలో కదలలేని స్థితిలో ఉన్న తన తండ్రిని బంగారపు తూగుటుయ్యాలలో తూపవచ్చు, తన సోదరికి బంగారు తొడుగు

తొడగవచ్చు. ఇలాటి కలల ప్రోత్సాహంతో అతను స్కూలు చదువులో అహోరాత్రాలు కృషి చేశాడు. రెండేళ్ళ అపారమైన కృషిచేసి అతను కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. అక్కడ అతనికి నిరుత్సాహం ఎదురయింది. అక్కడి బోధనాపద్ధతులు అతనికి నచ్చలేదు. అతనికి ప్రధానంగా కావలసింది రచన చెయ్యటానికి సులువు మార్గాలు నేర్చుకోవటం. అయితే ఏ గురువూ అతనిపట్ల ఈ విషయంలో శ్రద్ధ కనబరచలేదు. అదీగాక అతను తెచ్చుకున్న డబ్బు అయిపోయింది. అందుచేత అతను కాలేజీ చదువు ప్రారంభించిన ఏడాదికల్లా ఒక చాకలి షాపులో ఒళ్ళు విరుచుకుని పని చేయవలసి వచ్చింది.

ఈ లోపల అతను శరపరంపరగా వ్యాసాలూ, కథలూ, పద్యాలూ రాసేస్తున్నాడు. ఇతివృత్తాలు అతని స్వంత అనుభవాలే. వీటిని దేశంలోగల అనేక పత్రికలకు పంపాడు, కాని ప్రయోజనం లేకపోయింది. ఒకటి రెండు స్థానిక పత్రికలూ, అతను చదివిన హైస్కూలు తాలూకు పత్రికా కొద్ది రచనలను ఆమోదించాయి, అంతే. అతను డబ్బుకోసం చాకిపనిలో హూనం కావటం ఆరంభించాక రచనలు చేయటానికి సత్తువ మిగలకుండా పోయింది.

ఇంతలో క్లాండైక్ ప్రాంతంలో బంగారం కనిపెట్టబడింది. జాక్ బంగారం కోసం ఉత్తరానికి బయలుదేరాడు. అతని బావగారు అతనికి సహాయం చెయ్యటమేగాక వెంట బయలుదేరాడుకూడా. అయితే ఆయన జాక్ కంటె చాల పెద్దవాడు. చిల్కూట్ కనుమ వచ్చేసరికి ఆయన భయపడి వెనక్కు తిరిగాడు. ఆ యేడు ఆ కనుమగుండా ముందుకు వెళ్ళిన కొద్దిమందిలో జాక్ ఒకడు. కాని అతని బలమూ, సాహసమూ ఉపకరించలేదు, బంగారం దొరకకపోగా అతను జబ్బుపడి అమెరికాకు తిరిగి వచ్చాడు. దారిపొడుగునా తనకు కలిగిన అనుభవాలను అతను

పు స్తకంలో రాసుకున్నాడు. దాని నిండా కథారచనకు పనికివచ్చే బంగారు కణికలున్నాయి.

ఇల్లుచేరి అతను ఒక టైప్ రైటర్ అరువుకు తెచ్చుకుని రాత్రిం బగళ్ళు రచనలు చేయసాగాడు. ఒకవంక కడుపునిండా తిండి లేక పోయినా, అతను దేశద్రిమ్మరుల కథలూ, సముద్రపు కథలూ, క్లాండైక్ కథలూ, వ్యాసాలూ, హాస్యరచనలూ, పద్యాలూ డజన్లకు డజన్లు రచిం చాడు. ఉత్తరంనుంచి తిరిగి వచ్చిన అయిదుమాసాలకు "ఓవర్లాండ్ మంత్లీ" అనే ప్రసిద్ధ పత్రికలో అతని కథ ఒకటి పడింది. శాన్ ఫ్రాన్సిస్కో నుంచి వెలువడే ఈ పత్రికే ముప్పై సంవత్సరాల క్రితం బ్రెట్‌హార్టు (మరొక ప్రసిద్ధ రచయిత) ను లోకానికి పరిచయం చేసింది. ఈ పత్రిక ప్రచురించిన జాక్ లండన్ కథపేరు "టు ది మాన్ ఆన్ ట్రేల్" (To The Man on Trail) మరుసటి నెలలో "ది వైట్ సైలెన్స్" The white silens) అన్న మరొక కథ ప్రచురించబడింది. ఇది జాక్‌లండన్ రచించిన ఉత్తమ కథలలో ఒకటి. అయితే ఈ కథలకు జాక్‌లండన్ సంపాదించిన పారితోషికం అయి దేసి డాలర్లుమాత్రమే. కల్పనాసాహిత్యం సృష్టించేవారు బంగారంలో మునిగితేలుతారనుకుని కలలుగన్న జాక్‌లండన్‌కు ఈ కొద్ది పారితో షికం నిరాశకలిగించింది. అయినా అతను రచన మానలేదు. త్వరలోనే "ఓవర్లాండ్" పత్రిక జాక్‌లండన్ పారితోషికాన్ని ఏడున్నర డాలర్లకు పెంచింది. అయితే అతనికి ఇంతకన్న గిట్టుబాటు బేరాలుకూడా తగి లాయి. కథల పోటీలునడిపి బహుమతులిచ్చే "బ్లాక్‌కాట్" (' The Black cat" ) అనే పత్రికా, "ది యూత్స్ కంపానియన్" ("The youths companion") అనే పత్రికా అతనికి ఇంకా ఎక్కువ ఇచ్చాయి. "ఓవ ర్లాండ్" పత్రికలో అతని కథ పడిన ఏడాదికల్లా "అట్లాంటిక్ మంత్లీ" పత్రికలో అతని కథ "ఒడిసీ అఫ్ ది నార్తు" (An Odyssy of the

North) అచ్చయింది. ఇది అతనికి ప్రతిష్ఠ చేకూర్చింది. మరి కొద్ది కాలానికి డబ్బుకూడా వచ్చిపడింది — "మాక్ క్లూర్స్" పత్రిక అతనికి మాటకు రెండు సెంట్లు ♦ చొప్పున పారితోషికం ఇచ్చింది. క్లాండైక్ నుంచి తిరిగి వచ్చిన రెండేళ్ళకు జాక్ లండన్ రచయితగా కొంత విజయం సాధించాడు. అతని రచనలు సులువుగా అమ్ముడవుతున్నాయి. 1900 లో "సన్ ఆఫ్ ది వుల్ఫ్" (The Son of the Wolf) అనే పేరుతో అతని కథల సంపుటి ఒకటి పుస్తకరూపంలో వచ్చింది. ఇదే విధంగా 1901 లోనూ, 1902 లోనూ కూడా అతని కథలు సంపుటాలుగా వెలువడ్డాయి. 1902 లో అతని పేరుతో మరి రెండు పుస్తకాలు కూడా ప్రచురణ అయాయి. ఒకటి పిల్లలకు పనికివచ్చే రచన, రెండవది "డాటర్ ఆఫ్ ది స్నోజ్" (A Daughter of the Snows) అనే నవల. ఈ ప్రచురణలు అంతగా విజయవంతం కాలేదనుకునేటందుకు ఆధారమేమంటే ఒక పుస్తకం వేసిన వారు మరొక పుస్తకం వేయలేదు.

జాక్ లండన్ ఎంతోకాలంగా కాంక్షించిన కీర్తి అతనికి 1903 లో లభించింది. అది లభించటానికి కారణం ఈ నవల (The Call of the Wild (ప్రకృతి పిలుపు) — ప్రచురణ కావటమే. లోగడ అతను చేసిన రచనలపట్ల నిర్లక్ష్యం చూపిన విమర్శకులు ఈ రచనను చాలా మెచ్చుకున్నారు. అది అపారమైన ప్రజాదరణ సంపాదించి అత్యుత్తమంగా అమ్ముడయింది. ఇంతకన్నకూడా జాక్ లండన్‌కు సంతోషం కలిగించిన విషయమేమంటే మేధావి వర్గాలలో ఈ రచనకు ఆదరణ లభించింది.

"The Call of the Wild" ప్రచురితమైన మరుసటి ఏడు జాక్ లండన్ కాలిఫోర్నియా విశ్వవిద్యాలయంలో సోషలిజం గురించి ఉపన్యసిస్తూ, అనాటి విశ్వవిద్యాలయాలు విద్యార్థులకు పాత సాహిత్యం

♦ ఒక సెంటు మన అర్ధణాకు ఇంచుమించుగా ఉంటుంది.

మాత్రమే బోధించి, వర్తమాన జీవితాన్నీ మనోభావాలనూ చిత్రించే ఆధునిక సాహిత్యాన్ని ఉపేక్షిస్తున్నాయని విమర్శించాడట. దానిపై ప్రొఫెసర్ చార్ల్స్‌మిల్స్ గేలీ అనే ఆయన, "మిష్టర్ లండన్, మీరు రచించిన 'కాల్ ఆఫ్ ది వైల్డ్' అనే పుస్తకాన్ని మేము ఉపయోగిస్తున్నామని మీకు తెలియదులాగుంది!" అన్నాడట. అందరూ నవ్వారు, వారితో బాటు జాక్‌లండన్‌కూడా నవ్వాడు. ఈ సంఘటనను అతనే బయట పెట్టాడు.

"కాల్ ఆఫ్ ది వైల్డ్" (ప్రకృతి పిలుపు) విజయం పొందటానికి చాలా ముందుగానే జాక్‌లండన్ రచనను ఒక వృత్తిగా అభ్యసించసాగాడు. 1900 మార్చి 1 న అతను క్లాడ్స్‌లీ జాన్స్‌కు ఈ విధంగా రాశాడు.

"నేను డబ్బుకోసం రచన చేస్తున్నాను. కీర్తి వచ్చిందా, మరింత డబ్బువస్తుంది. డబ్బు ఎక్కువ వస్తే నా జీవితం పెరగటమన్న మాట. ఈ డబ్బుచేసే మార్గం నాకు చాలా అసహ్యం. రచన చెయ్యటానికి పూనుకున్నప్పుడల్లా నాకు చీదరవేస్తుంది. ఇంతకన్న ఏ ప్రాంతంలో సంచారం చెయ్యమన్నా నాకిష్టమే. అందుచేత ఈ ధనార్జన నాకు ఒక వ్యసనంగా పట్టుకునే అవకాశంలేదు. డబ్బు ఖర్చుచెయ్యటం మాటా, చెప్పకు, ఆ జబ్బు నన్నెప్పటికీ వదలదు."

అదే వ్యక్తికి 1902 లో జాక్‌లండన్ ఇలా రాశాడు:

"బళ్ళకొద్దీ చెత్తరాసేస్తున్నాను! అయిదు నోళ్ళూ, పదికాళ్ళూ ఆడాలి. ఊపిరి సలపటంలేదు. నాకు అప్పులనుంచి బయట పడగలుగుతానా అనిపిస్తోంది."

ఇది రాసిననాటికి జాక్‌లండన్‌కు భార్యా, ఒక ఆడపిల్లా ఉన్నారు. వీరుగాక తనతల్లినీ ఒక మేనల్లుణ్ణీ అతను పోషిస్తున్నాడు.

అతని ఇల్లు రహదారి బంగళాలాగా ఉన్నప్పటికీ అతను నియమం ప్రకారం రచనచేసేవాడు; రోజుకు వెయ్యికొయిలు నాలుగువేల మాటల దాకా రాసేవాడు. మాటకు 10 సెంట్లు చొప్పున సంపాదించుకునేవాడు—రాను రాను అతని మాటలధర పదిహేను సెంట్లకూ, ఇరవై అయిదు సెంట్లకూ కూడా పెరిగింది. తనకు రచన చేయటమంటే అసహ్యమని అతను అన్నమాటలో అతిశయోక్తి ఉండవచ్చు గాని, అతను శ్రమపడి రచన సాగించాడనటానికి సందేహంలేదు. "మార్టిన్ ఈడెన్" అన్న నవలలో కథానాయకుడు రచయితగా విజయం సంపాదించుకున్న కొద్ది కాలానికే ఆత్మహత్య చేసుకున్నట్టు జాక్ లండన్ చిత్రించాడు.

జాక్ లండన్ "రొమాంటిక్" భావాలన్నీ ఏమైనట్టు? అకస్మికంగా జరిగిన అతని మొదటి వివాహంలో అణుమాత్రమైనా "రొమాన్స్" లేదు. అతనికి నిత్యవిధులు చాలా అసహ్యకరంగా కనిపించాయి, తానొక గానుగెద్దు అన్నభావం కలిగింది. ఇలాటి జీవితాన్ని అతను ఎంతకాలం సహించగలడు?

దక్షిణాఫ్రికాలో బోయర్ యుద్ధం సాగుతోంది. అక్కడికి వెళ్ళి యుద్ధవార్తలు పంపటానికి ప్రత్యేక విలేఖరిగా అసోసియేటెడ్ ప్రెస్ (వార్తాసంస్థ) వారు ఆహ్వానించే సరికి జాక్ లండన్ ఎగిరిగంతేసి ఒప్పుకున్నాడు. కాని అతను ప్రయాణమై ఇంకా న్యూయార్క్ చేరకముందే సంధి సంప్రతింపులు ఆరంభమయినట్టు వార్తవచ్చింది. అయినప్పటికీ జాక్ లండన్ తన ప్రయాణం ఉపసంహరించుకోక ఇంగ్లాండుకు వెళ్లాడు. అక్కడ మాక్మిలన్ కంపెనీ (పుస్తక ప్రచురణ సంస్థ) వారు అతనిని లండన్‌లోని మురికిపేటలను చిత్రిస్తూ ఒక పుస్తకం రాయమని కోరారు. అతడు ఏడువారాలపాటు లండన్ చూసి "చిల్డ్రన్ ఆఫ్ ది అబిస్" (The children of the Abyss) రచించాడు. అతను ఇంటికి తిరిగి వచ్చిన కొద్దికాలానికే భార్యకు విడాకులిచ్చేశాడు. మరుసటి వసంతంలో

అతను రష్యా జపానుల మధ్య యుద్ధం జరిగేచోటికి హర్స్టట్ సంస్థ తర పున యుద్ధ విలేఖరిగా వెళ్ళాడు. తిరిగి ఇంటికివచ్చి అతను శాన్ ఫ్రాన్సిస్కో అఖాతంలో పూర్వంలాగే పడవవేసుకుని తిరిగాడు. సోషలిస్టు అభ్యర్థిగా మేయర్ ఎన్నికలకు నిలబడ్డాడు, గ్లెన్ ఎలెన్ అనేచోట నూట ఇరవై తొమ్మిది ఎకరాల క్షేత్రం కొన్నాడు, ఉపన్యాసాలిస్తూ ఊళ్ళు తిరి గాడు, రెండో వివాహం చేసుకున్నాడు. మొదటి పెళ్ళికన్న ఈ పెళ్ళిలో చాలా రసికత కనపడింది. ఇదంతా 1905 లో జరిగింది. మరుసటి సంవ త్సరం అతను వెస్ట్ ఇండీస్‌కు వెళ్ళివచ్చి, తన క్షేత్రాన్ని అభివృద్ధి చేసు కునేటందుకు ఎంతో ఖర్చుతోకూడిన పెద్దప్లానులు వేశాడు. యీ ప్లానులు సగంలో ఉండగానే ఒక యాభై అడుగుల నౌకమీద ప్రపంచ ప్రదక్షిణం చేసి రావటానికి, ప్రయత్నాలు ప్రారంభించాడు. తన క్షేత్రాన్నిఅభివృద్ధి చేయటానికీ, అందులో ఒకభవంతి కట్టటానికీ, ప్రపంచయాత్రకై నౌక కొనటానికీ అవసరమైన ధనం సంపాదించగలందులకై అతను విధి విరామమూ లేకుండా రచన సాగించాడు.

"స్నార్క్" అనే నౌకపై ప్రారంభమయిన భూ ప్రదక్షిణం చివ రంటా సాగలేదు. పోలినీషియా చేరేసరికి జాక్‌లండన్‌ను ఒక వింత జబ్బు పట్టుకున్నది, అది పడవప్రయాణంలో ఉద్రేకించినట్టు కనబడింది. కాని అప్పటికి ఒకటిన్నర సంవత్సరాల ప్రయాణంసాగింది. సిడ్నీ నగ రంలో "స్నార్క్"ను అమ్మేసి ఈక్వెడోర్ పనామాలమీదిగా జాక్‌లండన్ మరొక అరుమాసాలకు ఇల్లు చేరుకున్నాడు. ఈ ప్రయాణంలో జరిగిన రసవత్తర సంఘటనలను జాక్‌లండన్ "క్రూయిజ్ ఆఫ్ ది స్నార్క్" (The cruise of the Snark) అనే పుస్తకంలోనూ, అతనిభార్య చామి యన్ "లాగ్ ఆఫ్ ది స్నార్క్" (The lag of the snork) అన్న పుస్తకంలోను సమగ్రంగా వివరించారు. ఈ ప్రయాణంలో జాక్‌లండన్

ఆరుపుస్తకాలూ, మరి ఒకటి రెండుపుస్తకాలకు సరిపడే కథలనూ, వ్యాసాలనూ రచించాడు.

జాక్ లండన్‌లో బతికిన చివరి ఆరు సంవత్సరాలూ అతనికి ఇలాగే తీరికలేకుండా గడిచాయి. అతను నాలుగు గుర్రాల బండిలో పసిఫిక్ తీరదేశం (అమెరికా రాష్ట్రాల పడమటి తీరప్రాంతం) తిరిగాడు, కేప్‌హార్న్‌ను పడవలో చుట్టివచ్చాడు, మెక్సికోకూ, హవాయీకి ప్రయాణాలు చేశాడు. అతని క్షేత్రం ఇప్పుడు 1300 ఎకరాలున్నది; దానిలో అతను జాతిపశువులను తయారుచేయసాగాడు. 75 ఎకరాల మేరలో ద్రాక్ష తోటలు వేశాడు, ఒక లక్ష యూకలిప్టస్ చెట్లు నాటాడు, అనేక అద్భుత నిర్మాణాలు చేశాడు. ఇన్నీ చేస్తున్నా అతను విడవకుండా రచన సాగిస్తూనే ఉన్నాడు. అతను 1916 నవంబరు 22 న, నలభయ్యవ ఏట, యురీమియా ( uremia ) వ్యాధి కారణంగా చనిపోయాడు. అయితే అతని జీవిత చరిత్ర రచించిన అతని భార్య అతని మృతికి కారణం పని జాస్తికావటమే నన్నది. అతని ఖ్యాతి అంతర్జాతీయమైనది. రష్యాలో ఆంద్రేయెవ్, కుప్రిన్ ప్రభృతుల ప్రచారంతో జాక్ లండన్‌కు ఎంత ఆదరణ లభించిందంటే 1918 కి పూర్వమే అతని సమగ్ర రచనలు రెండుసార్లు ప్రచురణ అయాయి. ఫ్రాన్స్‌లోకూడా అతనికి దాదాపు అంత ఖ్యాతీ వచ్చింది. అతని ప్రముఖ రచనలు యూరప్‌లోని దాదాపు అన్ని భాషలలోకి అనువాదం పొందాయి. అతనిలో సహజ ప్రవృత్తీ చైతన్యమూ మిళితమయాయి; అతను గుడ్డిగా నియమాలను పాటించే మనిషికాడు; బలీయమైన అద్భుతమైన ప్రవృత్తితో కూడుకున్నవాడు. అతనిని ఇతర దేశాలవారు ప్రామాణికమైన అమెరికనుగా గణించారు.

ఇంత తీరికలేకుండా, విజృంభణతో జీవిస్తూకూడా జాక్ లండన్ తన జీవితంలో ప్రచారంలో ఉన్న తాత్విక సిద్ధాంతాలను పరిశీలించాడు. విస్తృతీ, సమగ్రతా గల భావాలు అతనికి చాల ఇష్టం, సమస్తాన్నీ విశ

దీక రించేసి సిద్ధాంతాలు అతన్ని ఆకర్షించేవి. "హ్యూమన్ డ్రిఫ్ట్" ( The Human Drift ) అన్న యుద్ధవ్యాసంలో అతను హెర్బర్టు స్పెన్సర్ అనే తత్వవేత్త రచనలనుంచి ఈ భావాలను ఉదహరించాడు. "ఈనాడు జరిగే పరిణామంలాంటి పరిణామాలు పూర్వం కూడా జరిగాయి, భవిష్యత్తులో కూడా జరుగుతాయి. పరిణామ ఫలితాలు అచ్చగా ఒకటిగా ఉండకపోయినా, పరిణామ విధానం మాత్రం ఎల్లప్పుడూ ఒకటిగానే ఉంటుంది." ఈ బ్రహ్మాండమైన భావన జాక్ లండన్‌ను బలంగా ఆకర్షించింది. దీన్ని గురించి అతను "ఇదే మనం సాధించిన ఉత్తమ జ్ఞానం — పరిణామమూ, విలయమూ, తిరిగి పరిణామమూ!" అన్నాడు. నిజానికి ఇది జ్ఞానంకాదు; దీనికి శాస్త్రాధారం లేదు. ఇది ఒక రసమయమైన ఒక "రొమాంటిక్" భావన. జ్ఞానికి ఉండవలసిన అనేక లక్షణాలలో జాక్ లండన్‌కు ఒకటి మాత్రమే ఉన్నది — తెలుసుకోవాలనే ఆస్థ. జ్ఞానికి ఉండదగిన ఓపిక అతనిలో లేదు. అతను చప్పున ఉద్రేకానికి లొంగిపోయేవాడు. అందుచేత అతను సమగ్ర తత్వజ్ఞాని కాలేకపోయాడు.

అయితే జాక్ లండన్‌కు ఆధునిక సాహిత్యంలో స్థానం లభించినది. అతని తత్వజ్ఞానం మూలంగా కానేకాదు. పరిణామవాదాన్ని గానీ, "నీచే" (Nietzsche) సిద్ధాంతాలనుగాని, ఫ్రాయిడ్ (Freud) సిద్ధాంతాలుగానీ, మార్క్సిస్టు సోషలిజమునుగాని అతని రచన లేవీ నిర్దుష్టంగా విపులీకరించలేదు. అయితే "రొమాన్స్"తో కూడిన రచనలు చేసేవాడు గొప్ప తత్వవేత్తా, శాస్త్రవేత్తా అయి ఉండాలని కోరటం సబబుకాదు. అతని రచనలు రసమయమైనవి, వాటిని ఆ దృష్టితోనే మనం చూడాలి.

రొమాన్స్, వాస్తవికత ( realism) అనే మాటలను అడ్డదిడ్డంగా వాడటం జరుగుతున్నది. విమర్శనా జ్ఞానం లోపించినవారు ఉపయోగించటంవల్ల ఇలా జరుగుతున్నది. జాక్ లండన్ తన జీవితంలో

జరిగిన వాస్తవ సంఘటనలను గురించి, తరచు బాధాకరమైన విషయా లను గురించీ రచనలు చేసిన కారణంచేత అతనిని వాస్తవిక రచయితగా పరిగణించారు. అతనుకూడా తాను వాస్తవిక రచయితనే నని భావించా డనటానికి సందేహం లేదు. తనకు ప్రతిరూపమైన మార్టిన్ ఈడెన్ పాత్రను గురించి అతను ఇలా అన్నాడు: "అతని భావన ఊహాపూరి తమూ, ఒక్కొక్కప్పుడు ఊహాతీతమూ అయినప్పటికీ, అతనికి స్వత హాగా వాస్తవ విషయాలపై ఆసక్తి హెచ్చు. అందుచేత తనకు తెలిసిన విషయాలనుగురించే రచన చేసేవాడు. అయితే కల్పనాసాహిత్యంలో వాస్తవికతకు ఆధారం యాథార్థ్యం కాదు, ఒక వ్యక్తి సంపాదించిన జీవి తానుభూతి కూడా కాదు. కల్పనా సాహిత్యంలో వాస్తవికతకు ప్రాతి పదిక అధిక సంఖ్యాకులైన పాఠకులందరికీ అందుబాటులో ఉండే అను భూతి జాక్ లండన్ పొందిన అనుభవాలు సామాన్య పాఠకులకు అందు బాటులో ఉండేవికావు. లోగడ మనం తెలుసుకున్నట్టుగా, అతని జీవి తంలో చాలాభాగం మారుమూల సముద్రప్రాంతాలా, అసాధారణ వ్యక్తుల మధ్యా, అలగావాళ్ళ జీవితాలను అన్వేషించటంలోనూ, దూరదేశాలలో సంచరించటంలోనూ, గడిచింది. అతని స్వభావం అసాధారణమైనది, అతని జీవితం అసాధారణమైనది. అలాటప్పుడు అతని రచనలలో అసాధారణ విషయా లుండటం తప్పనిసరి. ఈ అసాధారణత్వమే "రొమాన్స్"కు మూలకందం.

జాక్ లండన్ వాస్తవిక రచయిత అని కొందరు భ్రమపడటానికి మరొక కారణంకూడా ఉన్నది. "వాస్తవికత"కూ, "సహజత్వానికీ" ( Naturalism ) గల తేడా చాలామందికి తెలియదు. కల్పనాసాహిత్య రచనలలో సహజత్వాన్ని ప్రవేశపెట్టేవారు మానవుడిలో ఉండే పశు శక్తు లను అధికంగా చిత్రిస్తారు గాని, సంస్కారం పొందిన మానవ స్వభా వాన్ని చిత్రించరు. ఈ శతాబ్దారంభంలో జాక్ లండన్ రచనలు ప్రారం

భించే నాటికి స్టీఫెన్ క్రేన్, ఫ్రాంక్ నారిస్ ప్రభృతులు "సహజత్వం" తో కూడిన రచనలు చేసేవారు. ఈ అమెరికన్ నవలారచయితలలో జాక్ లండన్ చేర్చబడ్డాడు. "సహజత్వం" తో కూడిన రచన సార్వజనీనంగా ఉంటే వాస్తవిక రచన అనిపించుకుంటుంది. అసాధారణంగా ఉంటే "రొమాన్స్" అనిపించుకుంటుంది. క్రేన్ రచించిన "మాగ్" (Maggie) సహజత్వంతో కూడిన వాస్తవిక రచన అనవచ్చు; జాక్ లండన్ రచించిన "సీ వుల్ఫ్" ( The Sea wolf ) విధిగా సహజత్వంతో కూడిన రొమాన్స్ అవుతుంది.

నిజానికి ఈ తేడాలు ఎక్కువ ప్రాముఖ్యం గలవి కావు. జాక్ లండన్‌లో ఉన్న గొప్ప విశేషమేమంటే అతను కథ చెప్పటంలో అద్వితీయుడు. అతనికి కథనశక్తి పుట్టుకతోనే వచ్చింది. అతను ఏ దేశంలో ఏ యుగంలో జీవించినా గొప్ప కథకుడుగా రాణించి ఉండేవాడే. తాను సృష్టించిన మార్టిన్ ఈడెన్ పాత్రలాగే జాక్ లండన్ కూడా కథనంలోనూ, వివరణలోనూ, శైలిలోనూ పాత్రల దృష్టినుంచి సన్నివేశాలు చిత్రించటంలోనూ ఒడుపులు ఆలోచించి ఉండవచ్చు. కల్పనాసాహిత్యం సృష్టించే వాడి కది తప్పనిసరి. కాని అతనిలో పాఠకుణ్ణి పట్టేసేలాగా కథ చెప్పేశక్తీ, కళ్ళకు కట్టినట్టు చిత్రాలను వర్ణించే శక్తీ, అపూర్వసంఘటనలను సన్నివేశాలనూ సృష్టించే శక్తీ లేకపోతే ఈ ఒడుపులు ఎందుకూ పనికివచ్చి ఉండవు — అతని రచనలకు జీవమూ బలమూ చేకూర్చిన అంశాలు ఇవే.

జాక్ లండన్ రచనలలో మంచివీ చెడ్డవీ ఉన్నట్టు అతని అభిమానులే ఒప్పుకుంటారు. ఆ రచనలలో హెచ్చుభాగం అతను ఋణబాధనుంచి తప్పించుకునేటందుకు చేసినట్టు అతను రాసిన ఉత్తరాలు స్పష్టంచేస్తున్నాయి. అతను తన ఆప్తులకు ఎన్నోసార్లు "చెత్త" రాస్తున్నట్టు రాశాడు. "లిటిల్ లేడీ ఆఫ్ ది బిగ్ హౌస్" (The Little lady

of the Big House) "మ్యూటినీ ఆఫ్ ది ఎల్సినోర్" (The Mutiny of the Elsinere ), "వాలీ ఆఫ్ ది మూన్" (The Valey of the moon) అన్న అతని రచనలు సాఫీగా సాగవు. కాని వింత ఏమిటంటే అతని రచనలలో అంత హెచ్చుభాగం అద్భుతమంగా ఉండటం. అందులో కొంత శాశ్వతమైన విలువగలది కూడాను.

కల్పనా సాహిత్యం రాయటంలో సహజదక్షతగల వారు చాలా మంది తమ అనుభవాలను తమ కథలలో ప్రవేశపెడతారు. జాక్‌లండన్ ఆత్మలాలసుడు Egoist కావటంచేత తన పుస్తకాలు చాలాభాగం స్వీయ చరిత్రలు చేసుకున్నాడు. "మార్టిన్ ఈడెన్"లో రచయితగా జాక్‌లండన్ అనుభవాలున్నాయి. "ది రోడ్" (The road) అన్న పుస్తకంలో అతను దేశద్రిమ్మరిగా ఉన్నప్పటి అనుభవా లున్నాయి, "జాన్ బార్లి కారన్" (John Barleycorn) లో సారాగురించిన అతని అనుభవా లున్నాయి. ఈ చివరి పుస్తకంలో మద్యనిషేధ ప్రచారం ప్రబలంగా ఉన్నది. "క్రూయిజ్ ఆఫ్ ది స్నార్క్—"The cruise of the snarkలో అతని ప్రపంచ పర్యటనానుభవాలు రసవత్తరమైనవి ఉన్నాయి. క్రూయిజ్ ఆఫ్ ది డాజ్లర్" (the cruise of the dozzler), "టేల్స్ ఆఫ్ ది ఫిష్ పెట్రోల్" (The tales of the fish patrol) అన్న పిల్లల పుస్తకాలలో అతని శాన్ ఫ్రాన్సిస్కో అఖాతపు అనుభవా లున్నాయి. "వాలీ ఆఫ్ ది మూన్"లో అతని క్షేత్రానుభవాలున్నాయి. అతని వ్యాసాలలో కూడా అతనికి సంబంధించిన విషయాలే హెచ్చుగా ఉంటాయి. "స్మాల్ బోట్ సేలింగ్" (Small boat sailing)"ఫోర్ హార్సెస్ అండ్ ఎ సైలర్ (Four horsses and a sailor) "పీపుల్ ఆఫ్ ది ఏబిస్" (The people of the Abyss) ఇలాటివి. ఇవి ఇలా ఉండగా, ఇతర రచయితలలాగే, జాక్‌లండన్ తన అనుభవంలో జరి

గిన అనేక సంఘటనలనూ, తనకు పరిచయమైన అనేక వ్యక్తులనూ తన కథలలోనూ, నవలలోనూ ప్రవేశపెట్టాడు.

ఈ సందర్భంలో జాక్‌లండన్ ఆత్మలాలసత గురించి ఒక్క విషయం చెప్పవచ్చు. "నాయిష్టం" అన్నమాటకు తిరుగు లేదని అతను "క్రూయిజ్ ఆఫ్ ది స్నార్క్"లో రాశాడు. అతని ఆత్మీయులు అతని యిష్టానికి తలవగ్గవలసి వచ్చేది, లేకపోతే ఆత్మీయులు కాకుండా పోవలసిందే. చాలామందికి అతనిలో ఉన్న ఈ గుణం నచ్చలేదు. అతని కెప్పుడూ బోలెడంతమంది శత్రువు లుండేవారు. మన్యాంగి అనే జపానీయు డొకడు జాక్‌లండన్‌కు నౌకరుగా ఉండేవాడు. వాడిలో తన యజమానిపై చాలాకాలంగా కసి పేరుతూ ఉంది ఉండాలి. ఒకనాడు జాక్ లండన్ అనేకమంది అతిథులమధ్య ఉన్న సమయంలో వాడు పళ్ళెంలో పానీయాలు తెచ్చి, తన యజమానిముందు వంగి, అతివినయంగా, "దేవుడికి బీర్ కావాలా ?" అని అడిగి కసితీర్చుకున్నాడు. అతిథులు నివ్వెరపోయారు. జాక్‌లండన్ జీవితం రచించిన అతనిభార్య అతని అహంకారాన్ని "రాజోచితమైనది" అన్నది.

అనేక రకాలైన రసమయ సన్నివేశాలలో తాను ఎలా ఉండేవాడో లోకానికి తెలిసేలాగు జాక్‌లండన్ తన నవలలు దాదాపు అన్నిటిలోనూ నాయకపాత్రలను తనకు ప్రతిబింబాలుగా సృష్టించుకున్నాడు. బాగానే ఉంది, కాని అంతమాత్రాన అతను కొన్ని విశిష్టపాత్రలను సృష్టించి ఉండటానికి అభ్యంతరమేమీ లేదు. డికెన్స్ (ప్రసిద్ధ బ్రిటిష్ నవలా కారుడు) డేవిడ్‌కాపర్‌ఫీల్డ్ పాత్రను తనకు ప్రతిబింబంగా సృష్టించాడు. అలాగే మార్క్‌ట్వేన్ (ప్రసిద్ధ అమెరికన్ రచయిత) టామ్ సాయర్ పాత్రను తనకు ప్రతిబింబంగా సృష్టించుకున్నాడు; అయినా ఈ రచయితలు అనేక గొప్పపాత్రలను సృష్టించారు. జాక్‌లండన్ మాత్రం "బక్" అనేకుక్క మినహాగా ఒక్క స్మరణీయమైన నాయకపాత్రను కూడా

సృష్టించలేదన్నది స్పష్టంగా కనిపిస్తోంది. అతను సృష్టించిన మార్టిన్ ఈడెన్ రాజసంతోకూడిన పాత్ర, వుల్ఫ్‌లార్సెన్ పాత్ర తామసంతో కూడినది. రెండు పాత్రలూ ఎక్కువ వాస్తవపాత్రలుగా కనబడవు. అతీతమానవులు ఎన్నడూ వాస్తవంగా వుండరు. స్త్రీ పాత్రల విష యంలో జాక్‌లండన్‌కు ఈపాటి సాఫల్యంకూడా లేదు. "లిటిల్ లెడీ ఆఫ్ ది బిగ్ హౌస్"లో నాయిక, పాలా ఫారెస్ట్ అన్ని స్త్రీ పాత్రలలోకీ ఉత్తమమైనది అనవచ్చునేమో. కాని ఆమెకూడా అంత వాస్తవ వ్యక్తిగా కనబడదు.

అయితే నైసర్గిక వాతావరణాన్నీ, ఆ యా ప్రదేశాలనూ జాక్ లండన్ ఎప్పుడూ చక్కగా చిత్రిస్తాడు, ఒక్కొక్కప్పుడు అద్భుతంగా కూడా చిత్రిస్తాడు. ఈ చిత్రణలను అతి సునాయాసంగానూ, కథనానికి అడ్డులేకుండానూ సాగించటంవల్ల అవి అత్యంత మనోజ్ఞంగా ఉంటాయి. గొప్ప అమెరికన్ కథలలో ఒకటైన "టు బిల్డ్ ఎ ఫైర్" (To Build a fire) లో సాటిలేని స్థానిక వాతావరణ వర్ణన ఉన్నది. ఈ కథలో ఒక పాత్ర వున్నట్టు కనబడినా వాస్తవంగా మూడుపాత్రలున్నాయి—మనిషీ, అతని కుక్కా, ఉత్తరాది ప్రాంతమూన్నూ. ఈ మూడు పాత్రలలోకీ ఉత్తరాదిప్రాంతమే ఉత్తమపాత్ర. పవనస్థితి-ప్రకృతి దృశ్యాలు, పాత్రల మనస్థితి వీటిని జాక్‌లండన్ ఎప్పుడూ బాగానే చిత్రించేవాడు. ఒక్కొక్కప్పుడు అద్భుతంగా చిత్రించేవాడు.

జాక్‌లండన్ కథలలోని ఇతివృత్తాలను గురించి ఇదివరకే కొంత తెలుసుకున్నాం. అతనికి తాత్విక విషయాలు ఇష్టం కావటంచేత వాటి సహాయంతో అతను అసంఖ్యాకమైన ఇతివృత్తాలు సంపాదించగలిగాడు. అతడు ఒకసారి ఉపయోగించిన ఇతివృత్తాన్ని మళ్ళీ మళ్ళీ ఉపయో గించేవాడు కూడా. అదీగాక అపారమైన అతని అనుభవాలనుంచి అత నికి అంతులేని సన్నివేశాలు లభించాయి. అయితే ఈ సన్నివేశాలను రక్తిగా రచించే శక్తి అతనికి స్వతహాగా ఉన్నది.

ఈ నవలగురించి తెలుసుకోవలసిన వివరాలు కొన్ని వున్నాయి. 1903 మార్చి 13 న జాక్‌లండన్ తన స్నేహితురాలైన అనా స్ట్రూనాస్కీకి "ప్రకృతి పిలుపు" (The call of the wild) గురించి ఇలా రాశాడు. "బాటర్డ్" (Batard) అని ఒక కుక్కకథ లోగడ రాశాను, మీకు జ్ఞాపకం ఉండే వుంటుంది, దానికి అనుబంధంగా దీన్ని ప్రారంభించాను. గాని అది నాచెయ్యి దాటిపోయింది. నాలుగువేల మాటలలో ముగింతామనుకున్న కథ 32 వేల మాటలకు పెరిగింది." "బాటర్డ్" అన్న నవలలో ఒక భయంకరమైన కుక్కకూ, ఒక రాక్షసిలాటి మనిషికీ పోరాటం సాగి, చివరకు ఇద్దరూ మరణిస్తారు. ఇలాటి కుక్కను సృష్టించినందుకు పరిహారంగా అతను చాలా మంచికుక్కను సృష్టించి మరొక కథ రాయ సంకల్పించాడు. కాలిఫోర్నియాలోని శాంటాక్లారా లోయలో జడ్జ్ బాంచ్ అనే ఆయన తాలూకు పశుక్షేత్రం (Ranch) లో ఒకకుక్క వుండేది. జడ్జ్ కుమారుడు లూయీ బాండ్ ఆ కుక్కను యూకాన్‌కు వెంటపెట్టుకు వెళ్ళాడు. డాసన్ అనేచోట అతనికీ, జాక్ లండన్‌కూ పరిచయమయింది. బాండ్‌వెంట వున్న అద్భుతమైన కుక్క జాక్‌లండన్‌ను ఆకర్షించింది. ఆయిదేళ్ళ అనంతరం ఆ కుక్కనే ప్రధాన పాత్రగా పెట్టి అతను "ప్రకృతి పిలుపు" రచించాడు. బాటర్డ్, బక్ అనే కుక్కలుగా ఇంకా ఇతరకుక్కల పాత్రలనుకూడా అతను సృష్టించాడు. "బ్రౌన్ వుల్ఫ్" కథలో అదే పేరుగల ఉత్తరాదికుక్క అద్భుతమైనది ఒకటి వున్నది. జెరీ, దానితోబుట్టువు మైకేల్ అనే సౌత్‌సీ (South sea) కుక్కలను ఆతను రెండు నవలలో ప్రవేశపెట్టాడు. ఎగర్టన్ ఆర్. యంగ్ అనే ఆయన రచించిన "నా ఉత్తరాది కుక్కలు" (My dogs of the Northland) అనే గ్రంథం తనకు చాలా తోడ్పడిందని జాక్‌లండన్ ఒప్పుకున్నాడు. "ప్రకృతి పిలుపు"నూ ఆ గ్రంథాన్నీ పోల్చి చూసినట్టయితే దానినుంచి జాక్‌లండన్ అనేక విషయాలు స్వీకరించినట్టు స్పష్టమవుతుంది.

జాక్‌లండన్ గతించి ముప్ఫైమూడేళ్ళు (ఈనాటికి 42 సంవత్స రాలు—అనువాదకుడు) అయింది. అతను రచించిన యాభై పుస్తకా లలో చాలాభాగం స్మృతిపథంనుంచి జారిపోయాయి, కాలం గొప్ప విమర్శకుడు, దానికి విశ్రాంతీ విరామమూ లేదు. ఒక్కొక్క రచనే ఏరి ఎడంగా పెడుతూ ఉంటుంది, దానికి దయా దాక్షిణ్యాలు లేవు. అయినా జాక్‌లండన్ రచనలలో కొద్దిభాగం—"ప్రకృతి పిలుపు", "ది సీ వుల్ఫ్", "మార్టిన్ ఈడెన్", "చిల్డ్రెన్ ఆఫ్ ది ఏబిస్" మొదలైన నవలలూ, సుమారు ఇరవై చిన్నకథలూ—ఇప్పటికే జీవించి ఉన్నాయి. ఇరవై సంవత్సరాల కాలంలో అరడజను శాశ్వత గ్రంథాలు రాయటం తక్కువ సంగతి కాదు. జాక్‌లండన్ ఈ పుస్తకాలన్నిటినీ తనమొదటి పదేళ్ళ రచనాకాలంలోనే రచించాడు. అందుచేత అవి పటిష్ఠమైన రచనలు. ఏమంటే, "స్నార్క్" లో ప్రయాణంచేసి తిరిగివచ్చాక జాక్‌లండన్ రచనలలో బలం కొంత తగ్గింది.

నవలా రచయితలలో రెండు రకా లున్నా రనవచ్చు, నాజూకుగా రాసేవారూ బలంగా రాసేవారూ, మొదటిరకం రచనలను "క్లాసిక్" రచనలంటారు. రెండోవి "రొమాంటిక్" రచనలు. జాక్‌లండన్ రచనలు రెండోరకానికి చెందినవి. మొదటిరకం రచనలను అర్థం చేసుకునే మన స్తత్వంగాని, శిక్షణగాని జాక్‌లండన్‌కులేవు. అందుచేత అలాటి రచనలను అంచనావేసే ప్రమాణాలను జాక్‌లండన్ రచనలకు ఉపయోగించరాదు. అమెరికన్ సారస్వతంలో జాక్‌లండన్‌కు స్థానం సంపాదించినవి విశృంఖలమైన అతని "రొమాంటిక్" భావనాశక్తీ, అత నిలో స్వతస్సిద్ధంగా ఉన్న బలమూ, కథనశక్తీ అని చెప్పాలి.

—ఫ్రాంక్ లూథర్ మాట్.

# ప్రకృతి పిలుపు

బక్ పత్రికలు చూడదు, చూసినట్టయితే తనకూ తన లాగా బలమైన కండలూ, వంటిపైన జూలూ ఉన్న ఇతర కుక్కలకూ కష్టాలు రాబోతున్నాయని తెలుసుకుని ఉండేదే. ఎందు చేతనంటే, ఉత్తర ధృవప్రాంతపు చీకటిలో వెతికే మనుషులకు ఒక పచ్చని లోహం - బంగారం - దొరికింది; ఈ సంగతి ఓడల కంపెనీల ద్వారా, ఇతర రవాణా సంస్థల ద్వారా ప్రచురమయింది. వేలాదిగా జనం ఉత్తరాదికి ప్రయాణమై పోసాగారు. వీళ్ళకి బలమైన కుక్కలు కావాలి. అవి శ్రమించటానికి బలమైన కండరాలూ, చలికి తట్టుకునేటందుకు మంచి జూలూ కలవై ఉండాలి.

శాంటాక్లారా లోయలో ఉన్న ఒక పెద్ద భవంతిలో బక్ నివసించేది. ఆ భవంతి జడ్జ్ మిల్లర్ అనే ఆయనది. అది రోడ్డుకు ఎడంగా ఉండేది. ఇంటికి నాలుగువైపులా వరండాలుండేవి. చెట్ల మధ్య సందులనుంచి ఈ వరండాలు కనిపించేవి. ఇంటిముందు విశాలమైన 'లాన్' లు (lawns) ఉండేవి. వాటి మధ్యగా వంపులు తిరిగిపోయే గులకరాతి మార్గాలుండేవి. ఆ మార్గాలకు రెండువైపులా ఉండే 'పాప్లర్' (poplar) చెట్ల కొమ్మలు దారి ఎగువగా కలుసుకుని పెనవేసుకుని ఉండేవి. ఇంటిముందు భాగంకంటె వెనకభాగం ఇంకా విశాలంగా ఉండేది. ఇక్కడ పెద్ద గుర్రపు సాల

ఉండేవి. వాటిలో పన్నెండుమంది కానాప్రవాళ్ళుండేవారు. అంతులేని కుటీరాలు అమర్చినట్టుగా ఉండేవి. నిడివి అయిన ద్రాక్షమడులూ, పచ్చిక బయళ్ళు, పళ్ళతోటలూ, 'బెరీ' (berry) మడులూ, ఉండేవి. ఇక్కడ ఒక బుగ్గబావి, నీరు తోడే యంత్రమూ, జడ్జిమిల్లర్ కొడుకులు ఎండవేళ ఈత లాడేటందుకు గాను సిమెంటుతో కట్టిన పెద్ద నీటికొలనూ ఉండేవి.

ఇదంతా బక్ సామ్రాజ్యం. అది నాలుగేళ్ళ క్రితం ఇక్కడే పుట్టి ఇక్కడే పెరిగింది. ఇక్కడ ఇతర కుక్కలేవి లేవని కాదు. అంత పెద్ద లోగిలిలో అనేక కుక్కలు విధిగా వుంటాయి. కాని అవి లెక్కకి రావు. అవి ఇవాళ్ళ వుంటాయి, రేపు పోతాయి. వాటిలో ఎక్కువభాగం ఇంటి వెలపల కుక్కల కొట్టాలలో మందలుగా ఉండేవి. కొద్ది కుక్కలు ఇంట్లోనే ఏదో ఒక మూల కాలక్షేపం చేసేవి. ఈ ఇంటి కుక్కలలో జపాను దేశపు చట్టిముక్కు కుక్క 'టూట్స్', మెక్సికో దేశపు బొచ్చులేని కుక్క, 'ఇజబెల్' మొదలైనవి ఉండేవి. ఈ వింతకుక్కలు సాధారణంగా బయట అడుగుపెట్టేవి కావు. దొడ్డికుక్కలలో కనీసం ఇరవై 'ఫాక్స్ టెరియర్' (fox terrier) కుక్కలుండేవి. ఇంటి కుక్కలు కిటికీలనుంచి తమకేసి చూస్తే ఇవి మొరిగి వాటిని భయపెట్టేవి; ఇంటి దాసీ జనం చీపురు కట్టలతోనూ, కర్రల తోనూ వాటిని బెదిరించేవాళ్ళు.

బక్ ఇంటికుక్కా కాదు, దొడ్డి కుక్కా కాదు. సమస్తమూ దానిదే. అది జడ్జి కొడుకులతోబాటు ఈతలు కొట్టేది.

వేటకూ బయలు దేరేది. ఉదయంగాని, సాయంకాలంగాని జడ్జికూతుళ్ళు మోలి, ఆలిస్‌లు అలా షైరుకు బయలుదేరి నప్పుడు బక్ వారి వెంట వెళ్ళేది. చలికాలం రాత్రివేళ జడ్జి తన లైబ్రరీలో చలిమంటకు ఎదురుగా కూచుంటే బక్ ఆయన కాళ్ళదగ్గిర పడుకునేది. జడ్జి మనుమలను తన వీపున సవారీ చేయనిచ్చేది. వాళ్ళని గడ్డిలో పొర్లించేది. వాళ్లు ఆవరణలో సంచారానికి బయలుదేరితే అంగరక్షకుగాను వెంట వుండేది. టెరియర్ కుక్కల మధ్య అది రీవిగా సంచరించేది. 'టూట్స్', 'కేసీ', 'ఇజబెక్' కేసి చూడనైనా చూసేది కాదు; ఏమంటే, దానికి జడ్జిమిలర్ ఆవరణలో పాకే పరుగెత్తే, ఎగిరే ప్రాణులన్నిటిపైనా, మనుషులపైనా కూడా సార్వభౌమాధికారం ఉన్నది.

దాని తండ్రి 'ఎమ్ము' ఒక పెద్ద 'సెంట్ బర్నార్డ్'. కుక్క విడవకుండా జడ్జిగారి వెంటనంటి ఉండేది. బక్‌కుకూడా అదే ఉద్యోగం లభించే లక్షణాలు పొడగట్టుతున్నాయి. బక్ తల్లి 'షెప్' స్కాట్లండ్ దేశపు గొర్రెలకాపరి కుక్క. బక్ తండ్రి అంత పెద్ద కుక్క కాదు. దాని బరువు నూట నలభై పౌన్లు మాత్రమే. అయినప్పటికీ లోటులేని జీవితమూ, నలుగురూ ఇచ్చే మర్యాదా మూలంగా అది దర్పంగా వ్యవహరించ గలిగేది. గడచిన నాలుగేళ్ళూ దాని దర్జా బాగా సాగింది. అడిగేవాళ్ళులేని భూస్వామిలాగా జీవించిన కారణంచేత దానికి వల్లమాలిన స్వాభిమానమూ, కించిత్తు స్వాతిశయమూ ఉండేది. అయినా అది ఒట్టిమాలిమి జంతువుగా ఒళ్ళు బరువెక్కి పోలేదు. తరుచు వేటాడటం

మూలానా, ఇతర వ్యాయామాల మూలానా దానికి కొవ్వు చేరలేదు, కండరాలు గట్టిబడ్డాయి. నీటిలో ఈతలాడటం దాని ఆరోగ్యానికి సహాయపడింది.

1897 హేమంతం నాటికి బక్ అనే కుక్క-పరిస్థితి ఇదీ. అంతలో క్లాండైక్ వద్ద బంగారం దొరకటమూ, ప్రపంచ మంతా మంచు కప్పిన ఉత్తరాదికి పరిగెత్తటమూ జరిగింది. అయితే బక్ పత్రికలు చదవదు. తోటమాలికింద పనిచేసే వారిలో ఒకడైన మాన్యూల్ చాలా చెడ్డవాడనికూడా దానికి తెలియదు. ఈ మాన్యూల్‌కు పెద్ద జబ్బొకటిఉన్నది, వాడికి చైనా లాటరీ అనే జూదం అంటే అమిత ఇష్టం. ఈ జూదంలోకూడా వాడికొక వెర్రి ఉండేది—సూత్రాల ప్రకారం ఆడటం. ఈసూత్రాలే వాడి కొంప ముంచాయి. సూత్రాల ప్రకారం ఆడి జూదంలో గెలవదలచినవాడికి పుష్కలంగా డబ్బుండాలి. తోట కూలి చేసుకునేవాడి జీతంలోనుంచి పెళ్ళాంఖర్చూ, గంపెడు పిల్లలఖర్చూ పోగా ఏమి మిగిలి ఏడుస్తుంది?

మాన్యూల్ పాపానికి ఒడిగట్టిన రాత్రి జడ్జిగారు ఏదో వ్యవసాయదారుల మీటింగుకు వెళ్ళి ఉన్నాడు. ఆయన కుమారులు వ్యాయామదార్ల క్లబ్బు స్థాపించేపనిలో మునిగి తేలుతున్నారు. అందుచేత బక్ మాన్యూల్ వెంట పళ్ళతోటగుండా వెళ్ళటం ఎవరూ చూడలేదు. బక్ అనుకున్నదికూడా తాను షికారు వెళుతున్నాననే. వాళ్ళిద్దరూ కాలేజీ పార్కు అనే చిన్న స్టేషను చేరటం కూడా

ఒక్క మనిషే గమనించాడు. ఈ మనిషి మాన్యూల్‌తో ఏదో మాట్లాడాడు, కొంత డబ్బు చేతులు మారింది.

"సరుకును కట్టి మరీ ఇయ్యి" అన్నాడు కొత్తమనిషి మొరటుగా. మాన్యూల్ లావుపాటి తాడు జమిలిగా వేసి బక్ మెడపట్టికింద చుట్టాడు.

"దాన్ని మెలిపెట్టానంటే గొంతు బాగా బిగుసు కుంటుంది." అన్నాడు మాన్యూల్. రెండోవాడు సరేనన్నట్టు హుంకరించాడు.

బక్ ఈ తాడును తొణకకుండా ఆమోదించింది. తన మెడకు తాడు కట్టటం అసాధారణమైన పనే. అయినా బక్ ఎరిగినవాళ్ళను నమ్మేది, తనకన్న వారు చాలా వివేకు లని విశ్వసించేది. కాని ఈతాడు కొసలు కొత్తవాడి చేతు ల్లోకి మారగానే అది భయంకరంగా గుర్రుమన్నది. తన కిదంతా నచ్చలేదని తెలియజేయటానికి మాత్రమే అది అలా చేసింది. తన అభిప్రాయాలు ఆజ్ఞలతో సమానమని దాని భ్రమ. అయితే అది భ్రమ అని రుజువయింది. ఏమంటే తాడు దాని చుట్టూ మరింత బిగిసి గొంతులో ఊపిరి ఆడలేదు. కోపావేశంలో అది కొత్తమనిషి మీదికి దూకింది. వాడుకూడా వెనక్కు తగ్గక వచ్చి, దానిగొంతు గట్టిగా పట్టుకుని, ఒక్క మెలికతిప్పి దాన్ని భుజాన వేసు కున్నాడు. మెడచుట్టూ ఉచ్చు మరింత బిగుసుకున్నది. బక్ పట్టరాని కోపంతో గిలగిలా తన్నుకున్నది. నాలుక బయటికి వేళ్ళాడవేసి రోజింది. దాని రొమ్ము శ్వాసకోసం

వ్యర్థ ప్రయత్నాలు చేస్తున్నది. దాని జన్మలో దాని కిలాటి ద్రోహం ఎన్నడూ జరుగలేదు. దానికి ఇంత ఆగ్రహం ఎవరిపైనా రాలేదుకూడా. క్రమంగా దాని బలం క్షీణించింది. గాజుకళ్ళుపడ్డాయి. రైలు రావటమూ, ఆమనుషులిద్దరూ తనను సామాన్ల పెట్టెలోకి పడెయ్యటమూ దానికి తెలియదు.

దానికి మళ్ళీ స్పృహ తెలిసేసరికి తన నాలుక పీకుతున్నట్టూ, తాను ఏదో వాహనంలో ఎక్కడికో వెళ్ళిపోతున్నట్టూ తెలిసింది. ఇంతలో ఇంజనుకూత కీచుగా వినబడింది. తాను రైలులో పోతున్నట్టు బక్ గ్రహించింది. అది జడ్జి వెంట చాలాసార్లు రైలు ప్రయాణాలు చేసింది. అది కళ్లు తెరిచి, శత్రువులకు బందీ అయిన రాజుగారికి వచ్చేటంత కోపంతో చూసింది. ఆ మనిషి దాని గొంతు అందుకోవటానికి ప్రయత్నించాడు. కాని బక్ వాడి చేతిని నోటితో చిక్కించుకుని, తనను ఊపిరాడక స్పృహతప్పినదాకా విడవనే లేదు.

చప్పుడు విని సామాను కాపలావాడు వచ్చాడు. వాడితో ఆ మనిషి ',ఔ దీనికి మూర్ఛలు. అయ్యగారు తీసుకుపొమ్మంటే ఫ్రిస్కో (లేక శాన్‌ఫ్రాన్సిస్కో) తీసుకుపోతున్నా. అక్కడ ఉండే పిచ్చికుక్కలవైద్యుడు బాగు చేస్తా నంటున్నాడు' అన్నాడు.

శాన్ ఫ్రాన్సిస్కో సముద్రతీరాన ఉన్న ఒక పానశాల (saloon) వెనకభాగంలోని ఒక పాకలో కూచుని ఆ

మనిషి గతరాత్రి ప్రయాణం గురించి చెబుతూ, 'నాకు ముట్టింది యాభయ్యే. ఈపనే మళ్ళీ చెయ్యమంటే వెయ్యి ఇచ్చినా ఒప్పుకోను' అన్నాడు.

అతని చేతికి చుట్టిన రుమాలు నెత్తురుతో తడిసి ఉన్నది. అతని లాగు మోకాలినుంచి మడమదాకా చినిగి ఉన్నది.

'ఆ ఇంకోడి కేం ముట్టింది?' అని పానశాల నడిపే వాడు అడిగాడు.

'నూరూ! రోలీ తక్కువయితే వల్లగాదు పొమ్మన్నాడు.'

'అంటే అంతా కలిసి నూటయాభై ఏం? ఈ కుక్క అంతా చేస్తుంది' అన్నాడు పానశాలవాడు.

కుక్కను ఎత్తుకు వచ్చినవాడు రుమాలు విప్పి తన చేతిమీది గాట్లు పరీక్షించుకుంటూ, 'నీళ్ళభయం రోగం ♦ రాకుండా ఉంటే—' అన్నాడు.

పానశాల మనిషి నవ్వుతూ, 'నిన్ను ఉరి తీసేశా రన్నమాట! పట్టు, ఒక చెయ్యి వెయ్యి!' అన్నాడు.

దిమ్మరపోయి, సగంచచ్చి, గొంతులోనూ నాలుక లోనూ భరించరాని బాధతో బక్ తన పాలిటి యమ కింక రులపై కలియబడింది. కాని వాళ్ళు దాన్ని మళ్ళా మళ్ళా కింద పడేసి పీక పిసికారు. ఎలాగయితేనేం ఆకురాయితో

♦ పిచ్చికుక్క కాటువల్ల కలిగే జలభయ వ్యాధి.

దాని మెడపట్టీ తొలగించారు. తరువాత దాని మెడకుచుట్టిన తాడు విప్పి, దాన్ని బోనులాటి పెట్టెలో పెట్టారు.

ఆ రాత్రల్లా అది అందులోనే ఉండి, కోపంతోనూ అవమానంతోనూ కుమిలింది. అసలిదంతా ఏమిటో దానికి అర్థంకా లేదు. వీళ్ళేవరు, తనతో వీళ్ళ కేంపని? తనను ఈ ఇరుకుపెట్టెలో ఎందుకుంచారు? ఈ విషయాలు తెలియకపోయినా, ఏదో ఘోరం జరగబోతున్నదన్న భావం దానిని బాధించింది. ఆ రాత్రి తలుపు చప్పుడైనప్పుడల్లా, జడ్జ్‌గాని, ఆయన కొడుకులుగాని వస్తున్నా రనుకుని అది చంగున లేచి నిలబడింది. కాని ప్రతిసారీ పానశాలవాడి ఉబ్బు మొగంమాత్రమే కనబడింది. వాడు వెలిగే మైనం వత్తితో వచ్చి కుక్కను చూసుకున్నాడు. ఇలా జరిగినప్పుడల్లా బక్, సంతోషంతో అరుద్దా మనుకున్నదల్లా, భీకరంగా గుర్రు మన్నది.

పానశాలవాడు దాని జోలికి రాలేదు. తెల్లవారాక నలుగురు మనుషులువచ్చి బక్ ఉన్న పెట్టెను ఎత్తుకున్నారు. వాళ్ళు చూడటానికే దుర్మార్గుల్లే ఉన్నారు. చింకిబట్టలు ధరించి మురికిగా ఉన్నారు. వాళ్ళనుచూసి తన పాలిటి కొత్త యములవా ళ్ళనుకుని పెట్టెకుగల చువ్వలలోనుంచి వాళ్ళమీద నిప్పులు కక్కింది. వాళ్ళు నవ్వుతూ దాన్ని కర్రలతో పొడిచారు. బక్ ఆ కర్రలను తన నోటితో పట్టుకుని వాటిని పీడించసాగింది. ఆమనుషులు తనచేత అలా చేయించటానికే ప్రయత్నిస్తున్నారని చివరకు దానికి అర్థ

మయింది. అందుచేత అది మొహం మాడ్చుకుని పెట్టెలో పడుకున్నది. పెట్టెను ఎత్తి ఒక బండీలో పెట్టారు. పక్కాతో సహా ఆ పెట్టె చాలామంది చేతులమీదుగా ప్రయాణించి, ఎక్స్‌ప్రెస్ ఆఫీసులో గుమాస్తాల అఫీసులోకి వచ్చింది. అక్కడినుంచి ఇంకొక బండీలో ప్రయాణం, తరవాత ఒక ట్రక్కులో ఇతర పెట్టెలతోనూ, బంగీలతోనూసహా ఈపెట్టె కూడా కదిలింది. బల్లకట్టు స్టీమరుమీద వెళ్ళి ఒక రైల్వే డిపో చేరి, చివరకు 'ఎక్స్‌ప్రెస్ రైలుపెట్టె'లో ఎక్కింది.

ఈ పెట్టె ఎక్కడా ఆగకుండా రెండు పగళ్లూ, రెండు రాత్రులూ నడిచింది. చెవులు చిల్లులు పడేలాగా కూసే ఇంజన్లు దాన్ని ఒకదానితరవాత ఒకటి చేరవేశాయి. ఈ రెండు పగళ్ళూ, రెండు రాత్రులూ బక్ ఆహారపానీయాలు ముట్టలేదు. పెట్టెలోవాళ్ళు తనతో స్నేహం చేసుకొనటానికి ప్రయత్నించగా అది వాళ్ళపై గుర్రు మన్నది. అందుకని వాళ్లు దాన్ని దారి పొడుగునా ఏడిపించారు. కోపంతో వణికి నురుగులు కక్కుతూ అది తన పెట్టెచువ్వల పైకి దూకితే వాళ్ళు నవ్వుతూ దాన్ని కవ్వించారు. వాళ్లు చచ్చురకం కుక్కల్లాగా మొరిగారు. మ్యావుమని అరిచారు, చేతులు కొట్టుకొంటూ కాకుల్లాగా అరిచారు. ఇదంతా బక్‌కు చాలా వెకిలిగా కనిపించింది. దాని మాన మర్యాదలకు అవమానం జరిగినట్టయి, అంత కంతకు కోపం రెచ్చిపోయింది. తిండి తినకపోవటంవల్లకంటెకూడా నీరు తాగకపోవటంచేత దానికి మరింత బాధ కలిగి, మరింత కోపాన్ని

తెప్పించింది. అసలే దాని స్వభావం అతి సున్నితమూ, ఉద్రిక్తమూ అయినది. అందుచేత దానికి జరిగిన ఈ అవమానమే ఎంతో మానసికవ్యథ కలిగించింది. దానికితోడు గొంతూ, నాలుకా వాచి ఆర్చుకుపోవటంతో ఆ వ్యథ మరింత అయింది.

తన మెడకుచుట్టిన తాడు పోవటం దానికి కీడులో మేలుగా కనబడింది. అది ఉండగా తాను వాళ్ళ నేమీ చెయ్యలేకపోయింది. అది పోయిందిగనక తన సంగతి వాళ్ళకు తెలుపవచ్చు. తనమెడకు ఇంకొక తాడు వాళ్ళు చుట్టేమాట కల్ల, తాను చుట్టనివ్వదు. రెండురోజుల ఉపవాసంతో అది కూడపెట్టిన కోపాగ్ని మొట్ట మొదటగా దాన్ని కవ్వించినవాడిపై పడటానికి సిద్ధంగా ఉంది. దాని కళ్లు చింతనిప్పుల్లా ఉన్నాయి, దాని స్వభావమే రాక్షస స్వభావ మయింది. అది ఎంతగా మారిపోయిందంటే జడ్జి స్వయంగా చూసినా దాన్ని గుర్తించలేక పోయేవాడే. సియాటిక్ వద్ద దాన్ని దింపేసినాక రైలుపెట్టెలో మనుషులకు కూడా పెద్ద బరువు దించేసిన ట్లనిపించింది.

బండిపైన బక్ ను ఒక ఎత్తయిన గోడలుగల చిన్న దొడ్డి వద్దకు చేర్చారు. భయం భయంగా నలుగురు మనుషులు బక్ ఉన్న పెట్టెను దొడ్డిలోకి తీసుకుపోయారు. ఎర్రని 'స్వెట్టర్' వేసుకున్న లావుపాటివా డొకడు కుక్క ముట్టినట్లు సంతకం చేశాడు. వాడే తనపాలిటి కొత్తయముల వాడని గ్రహించి బక్ పెట్టె చువ్వలమీదికి లంఘించింది

ఆమనిషి చిన్న వెటకారపు నవ్వు నవ్వి గొడ్డలీ, దుడ్డుకర్రా అందుకొన్నాడు.

'దాన్ని ఇప్పుడే బయటికి తీస్తున్నావా ఏమిటి ?' అని బండివాడు అడిగాడు.

'కచ్చితంగా,' అంటూ లావుమనిషి గొడ్డలితో పెట్టెను ఒక పెట్టు పెట్టాడు. పెట్టె తెచ్చిన నలుగురు మనుషులూ హడలుకుని గోడ ఎక్కి కూచుని వినోదం చూడసాగారు.

గొడ్డలి దెబ్బలకు పెట్టెతాలూకు కొయ్య పెళ పెళా విరగసాగింది. బక్ ఆవేశంతో గొడ్డలిపడ్డ ప్రతిచోటికీదూకి, విరిగిన కొయ్యను నోటితో పట్టేసి పెనగ నారంభించింది. అది వేగిరం బయటపడదామన్న ఆదుర్దాతో మూలిగి, గురగురలాడింది.

ఎర్ర స్వెటర్‌వాడు తాపీగా దాన్ని బయటికి తీసే ప్రయత్నంలోనే ఉన్నాడు. బక్ దూరే కంత ఏర్పడగానే వాడు, 'బయటికి రావే, ఎర్రకళ్ళ రాక్షసీ!' అంటూ గొడ్డలికింద పడేసి, దుడ్డుకర్రను కుడిచేతికి మార్చుకున్నాడు.

అది నిజంగా ఎర్రకళ్ళ రాక్షసిలాగే ఉంది. చింత నిప్పుల్లాంటి కళ్ళతో, రోమాలు నిక్కబొడుచుకుని, నోట నురుగులు కక్కుతూ, వెర్రి చూపుతో అది తన నూటనలభై పౌనుల శరీరాన్నీ, రెండు రోజులుగా ప్రజ్వలించే కోపాగ్నినీ ఆ మనిషిపైకి విసిరింది. అది ఎగిరి ఆ మనిషిని తన కోర తో పట్టబోయేటంతలో దానికి షాక్ తగిలినట్టయి, శరీరం

కుంచుకుపోయింది. పళ్ళు కదుచుకుపోయాయి. ఆ దెబ్బతో అది భూమిమీద వెల్లికిలా పడింది. అంతకుముందు దానికి దుడ్డుకర్ర అనుభవంలేని కారణంచేత ఇదేమిటో అర్థం కాలేదు. బాధా, కోపమూ కూడా కనబరిచేలాగా అరిచి అది మళ్ళా లేచి ఆ మనిషిపైకి దూకింది. మళ్ళీ షాక్ తగిలి అది క్రిందపడిపోయింది. ఈసారి దానికి దుడ్డుకర్ర అర్థమయింది. కాని వెర్రికోపంలో అది లక్ష్యపెట్టలేదు, అది పన్నెండుసార్లు ఎర్ర స్వెట్టర్ వాడిమీద దూకి, పన్నెండుసార్లు దుడ్డుకర్రదెబ్బ తిన్నది.

ఆఖరుదెబ్బ బలంగా పడటంవల్ల అది మరి దూకలేక పోయింది. అది స్పృహ సహించచ్చి, లేచి నిలబడి వశం తప్పిన కాళ్ళతో తూలుతూ అటూ ఇటూ కదిలింది. దాని ముక్కులా, నోటా, చెవులా రక్తం కారుతున్నది. అందమైన దాని జూలునిండా నెత్తురు కలిసిన నోటి నురుగు చిందింది. అంతలో ఆ మనిషి ముందుకువచ్చి వట్టిపుణ్యానికి బక్ ముక్కుమీద బలంగా ఒక దెబ్బ వేశాడు. ఈ బాధ ముందు మిగిలిన బాధలన్నీ ఒక్కసారి తుడుచుపెట్టుకుపోయాయి. సింహంలాగా గర్జిస్తూ బక్ మళ్ళీ ఆ మనిషిపై దూకింది. కాని ఈలోపుగా అతను దుడ్డుకర్రను ఎడమ చేతికి మార్చుకుని, బక్ కింది దవడను ఒడుపుగా చిక్కించుకుని, కిందికీ వెనక్కూ ఒక్క గుంజు గుంజాడు. బక్ గాలిలో ఒకటిన్నరచుట్టు తిరికి దభాలున నేలపై పడటంలో దాని తలా, రొమ్మూ అణుచుకుపోయాయి.

ఇంత అయినా బక్ ఆఖరుసారి ఆ మనిషిపైకి లంఘించింది. వాడుకూడా ఇంతసేపూ కొట్టని అసలుదెబ్బ ఈసారి కొట్టాడు. బక్ స్పృహతప్పి పడిపోయింది.

'కుక్కల్ని దారికి తీసుకురావటంలోను గట్టిచెయ్యి' అన్నాడు గోడమీద ఉన్నవారిలో ఒకడు ఉత్సాహంతో.

బండివాడు ఏదోగొణిగి బండిఎక్కి గుర్రాలను అదిలించుకు పోయాడు.

బక్‌కు స్పృహ వచ్చిందిగాని బలం రాలేదు. అది పడిపోయినచోట నేఉండి ఎర్రస్వెట్టర్ వాణ్ణి పరికించింది. కుక్కను చూపుతున్నట్లు రాస్తు పానశాలవాడు కుక్కపేరు బక్ అని రాశాడు. ఎర్రస్వెట్టర్ వాడు ఆసంగతి మననం చేసుకొని, 'ఏం బిడ్డా, బక్, మన సంఘర్షణ అయిపోయింది. దాన్ని అంతటితో పోనివ్వటం మంచిది. నీ స్థానం నువ్వు తెలుసుకున్నావు. నాది నేనెరుగుదును. మంచిగా ఉన్నావా; అంతా సుఖంగా వెళ్ళిపోతుంది. మొరాయించావో తాటవలిచేస్తా, తెలిసిందా ?' అన్నాడు.

ఇలా మాట్లాడుతూ అతను తాను చితకగొట్టిన తలనే ధైర్యంగా నిమిరాడు. ఆ చెయ్యి తగలగానే బక్ శరీరం గరిపొడిచినా, అది అభ్యంతరం చెప్పకుండా సహించింది. ఆ మనిషి నీరు తెచ్చిఇస్తే ఆర్తిగా తాగింది. పచ్చిమాంసం ముక్కలు అతను చేత్తో అందిస్తుంటే ఆవురావురుమని వాటిని మింగేసింది.

తాను ఓడిపోయిందని దానికి తెలుసుగాని, అది లొంగిపోలేదు. దుడ్డుకర్ర చేతగలవాడిది పై చేయి అని దానికి స్పష్టంగా అర్థమయింది. అది నేర్చుకున్న ఈ పాఠాన్ని జీవితంలో ఎన్నడూ మరువలేదు. దుడ్డుకర్ర దానిపాలిటి కొక మరవరాని అనుభవం. అనాగరిక శాసనా విధానాన్ని బక్‌కు ఈ దుడ్డుకర్ర పరిచయం చేసింది. బక్ బాగా అర్థం చేసుకున్నది కూడా. జీవిత సత్యాలు పూర్వంకన్నా క్రూరంగా ప్రత్యక్ష మయాయి. బక్ ఈ విషయం గుర్తించ టానికి బెదరలేదుగాని, కాని ఆ జీవితసత్యాలను ఎదుర్కో వటంలో బక్ అవ్యక్తంగా ఉన్న జిత్తులమారితనం పైకి వచ్చింది. రోజులు గడుస్తున్నకొద్దీ పెట్టెలలో, మెడతాళ్ళతో సహా కొత్తకుక్కలు వస్తున్నాయి. కొన్ని సౌమ్యంగా వచ్చాయి, మరికొన్ని బక్‌లాగే ధోంధాంలు చేస్తూ వచ్చాయి. అన్నిటినీ ఎర్రస్వెట్టర్‌వాడు లొంగదీయటం బక్ గమనించింది. కుక్కలను దారికి తీసుకరావటంలోగల క్రూరత్వాన్ని మళ్ళీమళ్ళీ చూస్తున్నకొద్దీ, బక్ నేర్చుకున్న పాఠం బాగా వంటపట్టింది. చేతిలో దుడ్డుకర్ర గలవాడు శాసనకర్త; వాడు చెప్పినమాటను ఆమోదించక పోయినా అమలు చెయ్యాలి. శాసనకర్తతో రాజీపడటమన్నది బక్ ఏనాడూ చెయ్యలేదు. అయితే చచ్చేట్టు దెబ్బలుతిన్న కుక్కలు ఆ మనిషిమీద ఆప్యాయత ప్రకటించటమూ, తోకలాడించటమూ, అతని చెయ్యి నాకటమూ బక్ చూసింది.

అప్పుడప్పుడూ కొత్తవాళ్లు వచ్చేవాళ్లు, గందరగోళంగా మాట్లాడేవాళ్ళు. ఎర్రస్వెట్టర్‌వాణ్ణి అనేక రకాల బామాలేవాళ్ళు. అంతా అయాక కొత్తగా వచ్చినవాళ్ళు డబ్బిచ్చి తమకు కావలసిన కుక్కనో, కుక్కలనో తీసుకుపోయేవాళ్ళు. ఇలా వెళ్ళిన కుక్కలు మళ్ళీ తిరిగి వచ్చేవికావు. అవి ఎక్కడికి వెళ్ళాయో అని బక్ ఆశ్చర్యపడేది. ముందు ఏం జరగబోతుందో అని దానికి భయంగా ఉండేది. తనవంతు రానందుకు అది ప్రతిసారీ సంతోషించేది.

చివరకు దానివంతు రానేవచ్చింది. ఒక వొంకుగు బారిన చిన్నమనిషివచ్చి, వచ్చీరానిభాష మాట్లాడుతూ, బక్‌కు అర్థంగాని ఆశ్చర్యార్థకాలు ప్రయోగించాడు.

వాడు బక్‌ను చూసి, 'ఓ రబ్బడ!' అని కేకపెట్టి, 'అద్గో ఆ భలేకుక్క! ఏం? ఎంత?' అన్నాడు.

'మూడు వందలకు ఊరికే ఇచ్చినట్టే. అయినా సర్కారు సొమ్మేగా, నీదేం పోయింది? ఏం పెరాల్ట్?' అన్నాడు ఎర్రస్వెట్టర్‌వాడు.

పెరాల్ట్ ఇకిలించాడు. కుక్కలకు గిరాకీ హెచ్చింది గనక ఇంతమంచికుక్కకు అది పెద్దధరకాదు. కెనడా ప్రభుత్వం నష్టపడదు. పెరాల్ట్‌కు కుక్కలసంగతి బాగా తెలుసు. బక్‌ను చూడగానే అది అసాధారణమైన కుక్క అని గ్రహించాడు. 'పదివేల కుక్కల్లో ఒకటి ఇలాటిది ఉంటుంది.' అని అతను తనలో అనుకున్నాడు.

డబ్బు చేతులు మారటం బక్ చూసింది. పొరుగు బారిన చిన్న మనిషి తననూ, 'కర్లీ' అనే న్యూ ఫౌండ్ లాండ్ కుక్కనూ తనవెంట తీసుకుపోవటం దానికి వింతగా తోచ లేదు. బక్ ఎర్రస్వెట్టర్ వాణ్ణి మరిచూడలేదు. దాన్నీ, కర్లీనీ నర్ హ్వేల్ 'Narwhal' అనేపడవమీదఎక్కించారు. దానిమీదనుంచి సిలోటిక్ నగరం దూరంగాపోతూ కనిపించింది. బక్ దక్షిణ ప్రాంతాన్ని మరి కళ్ల చూడలేదు. పెరాల్ట్ కుక్కలు రెంటినీ పడవలోపలికి తీసుకుపోయి ఫ్రానోస్వయ్ అనే పేరుగలవాడికి వప్పగించాడు. ఈ ఫ్రానోస్వయ్ మొగం నల్లగా ఉంది, వాడు ఒడ్డూ పొడుగూ ఉన్నాడు. పెరాల్ట్ కెనడా దేశపు ఫ్రెంచివాడు. అతను చామన చాయవాడు. ఫ్రానోస్వయ్ కూడా కెనడా దేశపు ఫ్రెంచివాడేగాని, సంకరజాతివాడు. వాడు బాగా నలుపు. ఇలాంటి మనుషులను బక్ లోగడ చూసి ఉండలేదుగాని ముందుముందు అనేకులను చూడనున్నది. వీళ్ళమీద బక్‌కు ప్రేమ కలుగకపోయినా నిజమైన గౌరవంమటుకు ఏర్పడింది. ఎందుచేతనంటే వాళ్ళిద్దరూ న్యాయమైన మనుషులు, తొణకకుండా నిష్పాక్షికంగా న్యాయం అమలు చేసేవారు. కుక్కల యుక్తులన్నీ ఎరిగి ఉండటంచేత వాటి మాయలకు మోసపోయేవారు కారు.

ఈ పడవపైన బక్‌కూ, కర్లీకీ మరి రెండు కుక్కలు తటస్థపడ్డాయి. వాటిలో ఒకటి పెద్దకుక్క, తెల్లటి తెలుపు. దానిది అసలు స్పిట్జ్‌బర్గెన్. తిమింగిలాలను వేటాడే పడవల

కాప్టెన్ ఒకడు దాన్ని తెచ్చాడు, తరవాత అది భూగర్భ పరిశోధనలు చేసే జట్టువెంట బారన్స్ ప్రాంతానికి కూడా వెళ్ళింది.

అది స్నేహంగా ఉంటూనే కుట్ర చేసేది. మొహం లోకి నవ్వుతూ చూస్తూనే ఏదో ద్రోహం ఆలోచిస్తుంది. బక్ తిన్న మొదటి భోజనంలోనుంచే అది కాజేసింది. బక్ కోపంతో దానిమీదికి ఉరికేలోపలనే ఫ్రాన్సోయ్ కొరడా ఛళ్ళుమని దొంగను తాకింది. బక్ తన ఎముకను తాను తిరిగి తీసుకున్నది. ఫ్రాన్సోయ్ చాలా న్యాయస్థుడుగా కన బడ్డాడు. వాడిమీద బక్ కు గౌరవం పెరిగింది.

పోతే, రెండో కొత్తకుక్క ఒకరిని పరిచయం చేసు కోదు, ఒకరిజోలికి రాదు. ఇంకొకరి సొత్తు దొంగిలించే బుద్ధి కూడా దానికి లేదు. అది ఎప్పుడూ విచారంగా, నిరుత్సా హంగా ఉండేది. తన జోలికి ఒకరు రావలసిన అవసరం లేదనీ, ఒకవేళ వస్తే మర్యాద దక్కదనీ అది కర్లీకి స్పష్టం చేసింది. దాని పేరు "డేవ్". తినటమూ, నిద్రపోవటమూ, ఆవలించ టమూ తప్ప దానికింకో పని లేదు. దానికి ఏ ఒక్క విష యంలోనూ ఆసక్తి ఉన్నట్టు కనబడ లేదు. క్వీన్‌షార్లాట్ జలసంధి (Queen Charlotte Sound) దాటేటప్పుడు పడవ దయ్యం పట్టినట్టు తూలి, తుళ్ళి, మొగ్గలు వేసినప్పుడు కూడా ఆ కుక్క కొంచెమైనా ఆసక్తి కనబరచ లేదు. బక్, కర్లీ భయంతో సగం మతిపోయి గొడవపడుతుంటే, డేవ్

తల ఎత్తి చిరాకుగా వాటికేసి చూసి, ఆవలించి, మళ్ళీ నిద్రపోయింది.

రాత్రింబగళ్లు ఫ్రాన్సెల్లరు తిరుగుడుకు పడవ విరామం లేకుండా అదురుతుండేది. ఒకరోజు గడిచినట్టే ఇంకోరోజు గడుస్తున్నది గాని, గాలిలో చలి అంతకంతకు జాస్తి అవుతూండటం బక్ గ్రహించింది. చిట్టచివరకు ఒకనాటి ఉదయం పడవ అదరటం మానేసింది. పడవలో సందడిసాగింది. ఈ సంభ్రమం ఇతర కుక్కలతోపాటు బక్‌కు కూడా తెలిసింది. ఏదో మార్పు రాబోతున్నదని అది అనుకున్నది. ఫ్రాన్సోయ్ కుక్కలను పడవ పైభాగానికి తీసుకువచ్చాడు. పైన అడుగుపెడుతూనే బక్ కాలుకు తెల్లగా, చల్లగా, బురదలాగా ఉండే పదార్థం తగిలింది. చీదరించుకుంటూ బక్ వెనక్కు దూకింది. ఈ తెల్లటి పదార్థం ఆకాశం నుంచి పడుతూండటం కనిపించింది. అది తన వొళ్లు విదిలించుకున్నది. కాని ఆ పదార్థం మరికొంత దానిపైన పడింది. అది ఆ పదార్థాన్ని వాసన చూసి, నాకింది. నాలుక క్షణంసేపు చుర్రుమన్నది, తరవాత ఏమీ లేదు. ఇది వింతగా ఉన్నది. బక్ దాన్ని మళ్ళా నాకి చూసింది, మళ్లా అలాగే అయింది. చుట్టుప్రక్కల ఉన్నవాళ్ళు దాన్ని చూసి నవ్వారు. బక్‌కు అభిమానం వచ్చింది. వాళ్ళెందుకు నవ్వారో దానికి తెలియలేదు. అది అంతకు పూర్వం మంచు ఎలా ఉంటుందో ఎరగదు.

# 2

## క్రూరశాసనం

డయ్యా సముద్రతీరాన బక్ గడిపిన మొదటిరోజు పీడకలలాగా ఉంది. అడుగడుగునా భయోత్పాతాలే. దాన్ని నాగరికత మధ్యనుంచి ఒక్కసారిగా తెచ్చి ప్రాచీన పరిసరాల మధ్య పడేశారు. వెచ్చని ఎండా, పనీపాటూ లేని గాలితిరుగుళ్ళు ఇక్కడ లేవు. ఇక్కడ శాంతి లేదు, విశ్రాంతి లేదు. ప్రాణానికి భద్రత లేదు. అంతా అయోమయమూ, హడావుడీ. ఏ క్షణం అపాయం సంభవించినా సంభవించవచ్చు. అనుక్షణమూ ఒళ్లు దగ్గరపెట్టుకొని ఉండాలి. ఏమంటే ఇక్కడి కుక్కలూ, మనుషులూ కూడా బస్తీ కుక్కలూ, బస్తీ మనుషులూ కారు. వీళ్ళంతా అడవి ప్రాణులు. వారిది కోరలన్యాయమూ, దుడ్డుకర్ర న్యాయమునూ.

కుక్కలు ఇలా పోట్లాడుకోవడం బక్ ఎరుగదు. ఇవి కుక్కలుకావు, తోడేళ్ళు. దానికి కలిగిన మొట్టమొదటి అనుభవమే జన్మలో మరవటానికి వీలులేనిది. అదృష్టవశాత్తూ ఇది దానికే జరగలేదు. లేకపోతే ఆ అనుభవంనుంచి నేర్చుకునేటందుకు అది బతికిఉండేదే కాదు. ఆహుతి అయినది కర్లీ. కలపదుకాణం దగ్గర మకాంవేసి ఉన్న సమయంలో కర్లీ ఒక ఎస్కిమో కుక్కతో స్నేహం కలపయత్నించింది. ఆ ఎస్కిమోకుక్క బాగా పెరిగిన తోడేలంత ఉన్నది. కాని

కర్లీలో సగం కూడా లేదు. అకస్మాత్తుగా ఎస్కిమోకుక్క మెరుపులాగా కర్లీపై దూకి, దాని ముఖం కండ ఊడపీకి, మళ్ళీ పక్కకు దూకింది.

దెబ్బ కొట్టటమూ, పక్కకు దూకటమూ తోడేళ్ళు పోట్లాడే పద్ధతి. కాని ఈ పోట్లాట అంత తేలికగా కూడా ముగియలేదు. ముప్పై నలభై ఎస్కిమో కుక్కలు పరిగెత్తు కుంటూ వచ్చి, పోట్లాడే కుక్కలచుట్టూ నిశ్శబ్దంగా నిల బడ్డాయి. వాటి ఉద్దేశం బక్ తెలుసుకోలేక పోయింది. అవి దవడలు నాక్కోవటం కూడా చిత్రంగా కనబడింది. కర్లీ తన ప్రత్యర్థిపైకి ఉరికింది. ఎస్కిమోకుక్క కర్లీని మళ్ళీ దెబ్బతీసి పక్కకు దూకింది. ఈసారి కర్లీ తనపైకి వచ్చినప్పు డది తన ఎదురు రొమ్ముతో చిత్రంగా కుమ్మి కిందపడేసింది. కర్లీ మళ్ళీ లేవనేలేదు. అది కింద ఎప్పుడు పడుతుందా అని వేచిఉన్న ఎస్కిమో కుక్కలు మొరుగుతూ దానిపై పడి పోయాయి. బాధతో ఏడుస్తూ కర్లీ వాటి అడుగున చిక్కుకు పోయింది.

ఇదంతా ఎంత తలవని తలంపుగానూ, ఆకస్మికం గానూ జరిగిందంటే బక్ నిశ్చేష్టురాలయి పోయింది. నవ్వు తున్న దానిలాగా స్పిట్జ్ నాలుక ఎర్రగా బయటపెట్టటం అది చూచింది. గొడ్డలి ఒకటి ఊపుతూ ఫ్రాన్సోయ్ ఆ కుక్కల పోగు మధ్య దూకాడు. దుడ్డుకర్రలతో ముగ్గురు మనుషులు అతనికి సహాయం వచ్చారు. కర్లీమీద మిగిలిన కుక్కలుపడ్డ రెండు నిమిషాలలో ఆ కుక్కలన్నీ చెదరగొట్ట బడ్డాయి.

కాని కర్లీ అప్పటికే చచ్చిపోయింది. దాని శరీరం పేలికలూ వాలికలూ అయిపోయి రొచ్చుగా తయారయిన మంచులో నిశ్చలంగా పడిఉంది. ఫ్రాన్సోయ్ దాని పక్కన నిలబడి ఘోరమైన శాపనార్థాల వర్షం కురిపించాడు. ఈ దృశ్యం బక్‌కు తరచు కలలోకూడా వచ్చి కలవరపెట్టేది. పరిస్థితి ఇదన్నమాట. న్యాయంలేదు. కిందపడ్డావో నీ పని చిత్తే! సరే, ఇంకేం, తను కిందపడకుండా చూచుకోవాలి. స్పిట్జ్ మళ్ళీ నాలుక బయటికి చాచి నవ్వింది. ఆ క్షణంనుంచీ బక్ దాన్ని మనస్ఫూర్తిగా, శాశ్వతంగా ద్వేషించింది.

కర్లీ చావువల్ల కలిగిన షాక్ నుంచి తెప్పరిల్లుకునే లోగా బక్‌కు మరొక షాక్ తగిలింది. ఫ్రాన్సోయ్ దాని శరీరానికి తోలుపట్టీలతో ఒక జీనులాంటిది తగిలించాడు— గుర్రాలకు జీను తగిలించినట్టే "స్లెడ్జ్" (చక్రాలు లేనిబండి) పైన లోయచివర ఉండే అడవికి లాక్కునిపోయి వంటచెరుకును చేరవేసేపనికి బక్ నియోగించబడింది. ఇలా తనచేత కూలిపని చేయించటం అవమానంగా తోచినప్పటికీ, బక్ వివేకం అవలంబించి తిరుగుబాటు చేయలేదు. ఈరకం పని తనకు కొత్తదే అయినా బక్ పని బాగా చేయటానికి శాయశక్తులా ప్రయత్నించింది. ఫ్రాన్సోయ్ నిక్కచ్చి మనిషి. తన మాటకు కాస్త ఇటూ అటూ జరిగితే కొరడా అంటించేవాడు. కుక్కల బళ్ళను దారివెంట నడిపించటంలో డేవ్ అనుభవం గలది. బక్ తప్పుగా పోయినప్పుడల్లా అది బక్ తొడ కొరికేది, స్పిట్జ్ బండిలాగే కుక్కలన్నిటికన్న ముందు

వెళ్లేది. అదికూడా అనుభవంగలదే. కాని బక్ తప్పుచేస్తే న్యాయంగా శిక్షించలేక గట్టిగా అరచేది, లేదా యుక్తిగా దాని జీనుతాళ్ళను తన శరీరంతో తోసి బక్‌ను సరి అయిన దారికి తిప్పేది. బక్ తనపనిని సులువుగానే నేర్చుకొన్నది. ఫ్రాన్స్వాయ్, ఆ రెండుకుక్కలు గలిసి బక్‌కు నైపుణ్యం సంపాదించి పెట్టాయి. మళ్ళీ శిబిరం చేరేలోపుగా బక్‌కు "హో, హో!" అంటే ఆగటమూ, "మష్" అంటే కదలటమూ, దారిలో వొంపులు వచ్చినప్పుడు దారి అవతలి పక్కగా వెళ్ళటమూ, బరువువేసుకుని స్లెడ్జ్ పల్లానికి పరుగెత్తేటప్పుడు దారిచూపే కుక్కకు ఎడంగా ఉండటమూ అర్థమయింది.

పెరాల్ట్‌తో ఫ్రాన్స్వాయ్, "మూడూ చాలామంచి కుక్కలు. ఆ బక్, అది చచ్చేట్టు లాగుతుంది. త్వరగా నేర్చుకున్నది" అన్నాడు.

మధ్యాహ్నం దాటాక పెరాల్ట్ మరిరెండు కుక్కలను తెచ్చాడు. అవి రెండూ అన్నదమ్ములు ఎస్కిమోకుక్కలు. వాటిపేర్లు "బిల్లీ", "జో". ఒక తల్లిపిల్లలే అయినా వాటి మధ్య ఎంతో తేడా ఉన్నది. బిల్లీ అతిమంచిది, జో దానికి పూర్తిగా విరుద్ధం. రుసరుస లాడుతూ, కోపిష్టిగా, చీటికీ మాటికీ కంయిమంటూ, కోరచూపులు చూసేది. బక్ ఆ రెండు కుక్కలపట్లా స్నేహభావం ప్రకటించింది. డేవ్ వాటి కేసిచూడనైనా లేదు. స్పిట్జ్ మటుకు వేరు వేరుగా రెంటితోనూ కలియబడింది. బిల్లీ రాజీబేరంగా తోక ఆడించి

చూసింది. అందువల్ల లాభంలేక ఫ్రిట్జ్ కోరలు తనచర్మంలో దిగబడినప్పుడు ఏడవటంకూడా రాజీ సూచకంగానే ఏడి చింది. జో మాత్రం అలాకాదు, ఫ్రిట్జ్ తనచుట్టూ ఎంత చాకచక్యంతో తిరిగినా, జో దానికి వెనుకభాగం అంద నివ్వలేదు. దానిజూలు నిక్కబొడుచుకున్నది, చెవులు వెనక్కు ముడుచుకొన్నాయి, పెదవులు విచ్చుకొని వికృతాట్ట హాసం చేస్తున్నాయి. దానికళ్ళు దయ్యపుకళ్ళలాగా మెరు స్తున్నాయి—జో వాలకం పిరికితనంతో కూడిన అఘా యిత్యం స్ఫురింపజేస్తున్నది. భయంకరమైన దాని వాలకం చూసి స్పిట్జు దాన్ని వదిలేసి ఊరుకున్నది. తనకు జరిగిన ఈ అవమానాన్ని కప్పిపుచ్చుకునేటందుకు గాను అది అసలే హడలిపోతున్న బిల్లిమీదపడి దాన్ని శిబిరం మూలకు తరి మింది.

సాయంకాలం లోపలే పెరాల్ట్ మరొక కుక్కను సంపాదించాడు. అదొక ముసలి ఎస్కిమో కుక్క. పొడు గుగా, సన్నగా, బక్కచిక్కి ఉన్నది. దాని మొహంనిండా గాయాల మచ్చలు. దానికి ఉన్నది ఒకటే కన్ను. అయినా దాని చూపులో సమర్థతా, ఠీవీ ఉన్నాయి. దానిపేరు "సోల్ లెక్స్". ఆ మాటకు "కోపిష్టిది" అని అర్థం. డేవ్‌లాగే అది ఒకరిఊసు కోరదు. తనఊసు ఒకరిని ఎత్తనివ్వదు. అది దర్పంగా అడుగులు వేసుకుంటూ మిగిలిన కుక్కలమధ్యకు వచ్చినప్పుడు స్పిట్జుకూడా దానిజోలికి పోవటానికి జంకి ఊరుకున్నది. దానికి ఒక్కటే సరిపడదు — తన గుడ్డికంటి

వేపు ఎవరైనా రావటం. ఈ సంగతి దురదృష్టవశాత్తూ బక్ కే మొదటిగా అనుభవమయింది. పొరపాటున అది సోల్ లెక్స్ను గుడ్డికంటివేపు నుంచి సమీపించింది. మరుక్షణం ఆ గుడ్డికుక్క గిరుక్కున తిరిగి ఏం జరిగేది బక్ తెలుసుకునే లోపల దానితొడను మూడంగుళాల మేర ఎముకలోతుకు చీరేసింది. ఆ తరవాత బక్ ఎన్నడూ దాని గుడ్డికన్ను వేపుగా వెళ్ళలేదు, వాటి రెంటిమధ్యా ఇంకో పేచీకూడా రానేలేదు. డేవ్ లాగే సోల్ లెక్స్ కూడా తనజోలికి ఎవరూ రాకుండా ఉంటే అంతకన్న కావలసింది లేదన్నట్లు కన పడింది. కాని ఈ రెండుకుక్కలకు మరొక గొప్పఆశయం ఉన్నట్టు కాలక్రమేణ బక్ తెలుసుకున్నది.

ఆ రాత్రి బక్ కు నిద్ర సమస్య ఎదురయింది. మంచు కప్పిన ఆ మైదానం మధ్య డేరాలోపల మైనంవత్తి వెలు గుతో, వెచ్చగా కంటబడేసరికి, బక్ సహజంగా అందులో అడుగుపెట్టింది. కాని వెంటనే పెరాల్ట్, ప్రాన్స్వాయ్ లిద్దరూ శాపనార్థాలు పెడుతూ, వంటసామాగ్రి దానిపై గిరవాటు వేశారు. బక్ కంగారుతో బయటి చలిలోకి పరిగెత్తింది. చలిగాలి వీచి దానిని బాధపెట్టసాగింది. ముఖ్యంగా దాని తొడమీది గాయం చలికి చాలా తీపుపెట్టింది. అది మంచులో పడుకుని నిద్రపోవటానికి ప్రయత్నించింది. కాని దాని అరి కాళ్ళనుంచీ వణుకు పుట్టుకురాసాగింది. బాధా, విచారమూ ముంచుకురాగా అది అక్కడఉండే అనేక గుడారాలమధ్యగా కలయతిరిగింది. ఎక్కడికి వెళ్ళినా ఒకటే చలి. ఎక్కడనైనా

ధూర్తపు కుక్కలు తనమీదికి వస్తే అది మెడమీది జూలుని నిక్కబొడిచి, గుర్రుమనే సరికి అవి వెనక్కి తగ్గాయి. (బక్ కు బతుకు తెరువు త్వరగానే అలవడుతున్నది.

చివరకు దాని కొక ఆలోచన తట్టింది. అది వెనక్కి వెళ్ళి తన అనుచరులు ఏం చేస్తున్నదీ చూతామనుకున్నది. కాని వాటి జాడ ఎక్కడా కనిపించక పోవటం దానికి ఆశ్చర్యకరంగా తోచింది. అది మరొకసారి వాటికోసం శిబిరమంతా గాలించి వెనక్కి తిరిగి వచ్చింది. అవి డేరాలలో లేవుగద ? అది సాధ్యం కాదు, అయితే తనను ఎందుకు బయటికి తరుముతారు ? అయితే అవి ఏమైనట్టు ? తోకముడిచి చలికి వణుకుతున్న దేహంతో, భరించరాని నిస్పృహతో అది డేరాచుట్టూ అర్థం లేకుండా తిరగసాగింది. అకస్మాత్తుగా దాని కాళ్లు మంచులో దిగబడిపోయాయి. దాని కాళ్ళకింద ఏదో కదులుతున్నది. రోషంవచ్చి గుర్రుపెడుతూ, తన కాళ్ళకింద కదిలినది ఏమిటో అని ఒక చెంప భయపడుతూ, బక్ వెనక్కి గెంతింది; అయితే మరుక్షణం స్నేహపూర్వకమైన చిన్న మొరుగు వినిపించేసరికి, ధైర్యంవచ్చి అది ఏమిటో విచారించటానికి ఉపక్రమించింది. వెచ్చని ఊపిరి దాని ముక్కుకు తగిలింది. మంచుకింద చుట్టచుట్టుకుని పడుకునిఉన్న బిల్లీ కనిపించింది. తనకు బక్ పట్ల స్నేహభావం తప్ప మరొకటి లేదని సూచించటానికి బిల్లీ చిన్న గాయానికి వొళ్ళంతా ఆడించింది, వెచ్చని తన నాలుకతో బక్ ముఖం నాకింది కూడా.

ఇది మరొకపాఠం. తాను నిద్రపోవలసిన పద్ధతి ఇదన్న మాట. బక్ ఒకచోటు ఏరుకుని అక్కడ ఆర్భాటంగా ఒక గుంట తవ్వుకుని పడుకున్నది. క్షణంలో దాని వొంటి వేడి ఆ గుంట నిండింది. అది నిద్రపోయింది. ఆ రోజల్లా శ్రమ పడి ఉండటాన అది సుఖంగానే నిద్రపోయింది. గాని పీడకలల మూలాన అది నిద్రలో గుర్రుపెట్టడమూ, మొరగటమూ జరిగింది.

శిబిరమంతా మేలుకున్న సందడికి గాని అది నిద్ర లేవలేదు. మొదట్లో దానికి తానెక్కడ ఉన్నదీ అర్థం కాలేదు. రాత్రల్లా మంచు పడటంవల్ల అది పూర్తిగా మంచులో కూరుకుపోయింది. అన్నివేపులా తనను మంచు పొదివి ఉండటం చూసి అది దడుచుకున్నది. ఆ భయం బోనులో చిక్కుకున్న వన్యమృగాల కుంటుంది. నిజాని కది నాగరిక వాతావరణంలో పెరిగిన కుక్క. ఎన్నడూ బోనులో చిక్కుకున్న ప్రాణికాదు. అయినా దానికి ఈ భయం కలిగిందంటే అది తన స్వభావాన్ని వన్యమృగాల కేసి తిప్పిందని సూచన. ఈ భయంతో దాని శరీరంలోని కండరాలన్నీ ముడుచుకున్నాయి. దాని మెడమీదా, భుజాలమీదా ఉండే రోమాలు నిక్కబొడుచుకున్నాయి, అది భయంకరంగా అరుస్తూ మంచులోనుంచి వెలుగులోకి ఒక్క ఎగురు ఎగిరింది. ఆ ఎగరటంతో మంచు మేఘంలాగా విరజిమ్మింది. ఎగిరి నాలుగు కాళ్ళు భూమిపై ఆన్చేలోపునే దానికి శిబిరమంతా తెల్లగా కనిపించింది. తానెక్కడఉన్నదీ అర్థ

మయింది, తాను మాన్యూల్ వెంట మిశాదుకు బయలుదేరి నది లగాయతు గుంట తవ్వకుని అందులో పడుకున్నదాకా జరిగిన సంఘటనలన్నీ జ్ఞాపకం వచ్చాయి.

బక్ కంటబడగానే ఫ్రాన్స్వాయ్ ఒక్క కేక పెట్టి పెరాల్టుతో, "నేనేం చెప్పాను ! ఆ బక్ క్షణంలో ప్రతిదీ నేర్చుకుంటుంది !" అన్నాడు.

పెరాక్ గంభీరంగా తల ఊపాడు. కెనడా ప్రభుత్వం తరఫున ముఖ్యమైన వార్తలు చేరవేయటం అతని పని. ఈ పనికి గాను అతనికి సాధ్యమైనంత మంచికుక్కలు అవసరం. బక్ అతనికి చాలా తృప్తి కలిగించింది.

మరొక గంటలోపల మరి మూడు ఎస్కిమోకుక్కలు వచ్చి చేరాయి. వాటితో మొత్తం తొమ్మిది కుక్కలు. అన్నిటికీ జీనులు తొడిగి బయలుదేర దీసేసరికి మరొక పావుగంట పట్టింది. అవి డైయాలోయకేసి బయలు దేరాయి. అక్కడినుంచి వెళ్ళిపోవటం బక్‌కు బాగానే ఉన్నది. ఈ బండిలాగేపని కష్టమైనదే అయినా, దానికి అభ్యంతరం లేకపోయింది. కొత్తకుక్కలు డేవ్, సోల్‌లెక్ లలో కనబడిన ఉత్సాహం దాన్ని ఆశ్చర్యపరిచింది. ఆ ఉత్సాహం దానికి కూడా సోకింది. అవి కొత్తకుక్కలు, అయినా జీనులు తగిలించేసరికి మారిపోయాయి. వాటి ఉదాసీనత అంతా మాయమయింది. అవి చురుకుగా, పని బాగా సాగాలన్నట్టుగా ప్రవర్తించాయి; ఏ కారణం చేతగాని పని నానుడులోపడి సాగకపోతే వాటికి చాలా చిరాకు వచ్చింది

కూడా. అవి లాగుడుకోసమే పుట్టినట్టూ, అందులోనే నాటి నిజమైన ఆనందం ఉన్నట్టూ కనబడింది.

స్లెడ్జ్‌కు డేవ్‌ని కట్టారు, దానికి ముందుగా బక్‌ను కట్టారు. దాని తరవాత సోల్‌వెక్స్‌నూ, వరసగా మిగిలిన కుక్కలనూ కట్టారు. అన్నిటికన్న ముందున్న కుక్క స్పిట్జ్.

బండి లాగటం నేర్పాలనే ఉద్దేశ్యంతో బక్‌ను డేవ్‌కూ, సోల్‌వెక్స్‌కునూ మధ్య ఉంచారు. బక్ నేర్చుకోవటంలో ఎంత నేర్పరో, అవి నేర్పటంలో అంత నేర్పరులు. అది ఏ తప్పుచేసినా వెంటనే కోరడాలతో శిక్షించి మరీ సరిదిద్దేవి. డేవ్ న్యాయమైన కుక్క, వివేకం గలది. అది అకారణంగా తన కోరలు ఉపయోగించేది కాదు, ఉపయోగించవలసి వస్తే సంకోచించేదీ కాదు. దానికి మద్దత్తుగా ఫ్రాన్స్వాయ్ కోరడా ఉండనే ఉండేది గనక బక్ డేవ్ పైన కసి తీర్చుకోవటం కంటే తన పాఠం నేర్చుకోవటమే మేలని తెలుసుకున్నది. ఒకసారి ఒక చిన్న మజిలీలో బక్ లాగుడు తాళ్ళలో చిక్కుకుపోయేసరికి, దానిమూలంగా ప్రయాణం ఆలస్యం కావటం చూసి, డేవ్, సోల్‌వెక్స్‌లు రెండూ భయంకరంగా దానిపైబడి గట్టిగా బుద్ధిచెప్పాయి. అందువల్ల అప్పటికి చిక్కు మరింత అయినప్పటికీ, ఆ తరువాత మళ్ళీ ఎన్నడూ తాళ్ళు చిక్కుపడకుండా బక్ తగు జాగ్రత్తతో వ్యవహరించింది. ఆ రాత్రి లోపుగా అది తన పనిని చాలా బాగా నేర్చుకున్నది. అందుచేత ఆ రెండుకుక్కలూ దానిని వేధించటం మానేశాయి. ఫ్రాన్స్వాయ్ కొరడా చుర

కలు కూడా అంత జాస్తిగా లేవు. పెరాల్టుకూడా గొప్ప మర్యాద చేశాడు - దాని కాళ్లు పైకెత్తి పాదాలు పరీక్షించాడు.

కనుమమీదికి ఎక్కిపోయేదారి చాలా కష్టసాధ్యమైనది. అది అనేక వందల అడుగుల లోతుగల మంచు మీదుగా, హిమానీ నదులమీదుగా. చిల్కూట్ భూసంధి మీదుగా ఉన్నది. దారిలో ఒక సరస్సుల పరంపర తగిలింది, చల్లారిపోయిన అగ్నిపర్వతాల తాలూకు గోతులలో ఈ సరస్సులు ఏర్పడ్డాయి. ఈ సరస్సుల పక్కగా దిగుతూ వచ్చి వారా రాత్రి పొద్దుపోయి బెనెట్ సరస్సు ఎగువను గల పెద్దశిబిరం చేసుకున్నారు ఈ శిబిరంలో బంగారంకోసం అన్వేషించ వచ్చినవారు వేలసంఖ్యలు ఉన్నారు. వేసవిలో మంచుకరిగితే ఉపయోగించటానికి గాను వారు పడవలు తయారు చేసుకుంటున్నారు. బక్ మంచులో గుంటచేసుకుని సొమ్మసిల్లి నిద్రపోయింది. అయితే ఇంకా చీకటి ఉండగానే దాన్ని లేవగొట్టి మిగిలిన కుక్కలతోబాటు స్లెడ్జ్‌కు కట్టారు.

ఆ రోజు వారు నలిగిన దారిన వెళ్ళి నలభై మైళ్ళు నడిచారు. కాని మర్నాటినుంచీ వారు మంచులో దారికూడా చేసుకోవలసి వచ్చింది. కష్టపడవలసి వచ్చింది, ప్రయాణం చురుకుగా సాగలేదు. సాధారణంగా పెరాల్టుముందు నడుస్తూ మంచును తనకాళ్ళతో అణగదొక్కి చదునుచేసి దారిచేసేవాడు. స్లెడ్జ్‌ను దారి వెంటనడిపే పని ఫ్రాన్సోయ్‌ది. అయితే అతను ఎప్పుడైనా పెరాల్టుతో పని మారకం వేసుకునేవాడు.

పెరాల్ట్ తొందరలో ఉన్నాడు. అతనికి మంచుసంగతి తెలుసును. అది చాలా అవసరం. ఎందుచేతనంటే ఈ శరత్కాలపు మంచు మందంగా పేరుకోదు. ప్రవాహాల వేగం హెచ్చుగా ఉంటే అసలు మంచే ఏర్పడదు.

రోజువిడిచి రోజు బక్ చచ్చేటట్టు శ్రమిస్తున్నది. ఆ రోజులకు అంతంటూ ఉన్నట్టు కనపడ లేదు. కటిక చీకటిలో ప్రయాణం నిలుపుచేసి విడిచేవాళ్ళు. మళ్ళా తూర్పు తెల్ల వారుతుండగానే కదిలేవాళ్ళు. మైళ్ళకుమైళ్ళు తిరిగిపోతున్నాయి. చీకటిపడినాకనే ఆగటం; ఆ తరువాత తమవంతు చేపలుతినటమూ, మంచులో దూరి నిద్రపోవటమూనూ. బక్‌ను ఆకలి దహించివేస్తున్నది. దానికి రోజుకు అరవీశె (పౌనున్నర) ఎండుచేప ఆహారంగా ఇచ్చేవారు. అది ఏమైపోయేదో తెలియదు. దానికి ఎన్నడూ కడుపునిండేది కాదు. ఆకలితో అస్తమానం డొక్కమాడుతూనేఉండేది. మిగిలిన కుక్కలు చిన్నసైజువి కావటంవల్లనూ, ఈ జీవితానికి అలవాటు పడినవి కావటంవల్లనూ రోజుకు ఒకపౌను ఆహారం మాత్రమే తిన్నప్పటికీ సుఖంగా ఉండేవి.

బక్ ఒకప్పుడు తిండివిషయంలో చాలా పట్టుదలగా ఉండి, నాజూకుగా తినేది. ఆ పట్టుదల యావత్తూ త్వరలోనే ఇగిరిపోయింది. తన ఆహారాన్ని తాను గబగబా దిగమింగకపోతే దాని సహచరులు ముందుగా తమవంతు కబళించేసి తన ఆహారంమీద వచ్చిపడతాయని అది తెలుసుకున్నది. అది తమతిండి తినేలోపుగా తాను తనతిండి తినివెయ్యాక

పోతే అది తనకు దక్కదు. ఒకటి రెండు ముక్కలను తాను తరిమికొట్టేలోపుగా మిగిలినవి వచ్చిపడి తన మిగిలిన ఆహారాన్ని మింగేసేవి. బక్ తన ఆహారాన్ని ఇతర కుక్కలంత వేగిరం మింగెయ్యటమే గాక, ఆకలితీరని కారణంచేత తనది కాని ఆహారాన్నికూడా తినటానికి యత్నించేది. అది అనేక విషయాలు చూసి నేర్చుకొన్నది. కొత్తకుక్కలలో "పైక్" అనే దొంగకుక్క ఒకటి ఉండేది. అది పెరాల్ట్ చూడని సమయంలో చిన్న మాంసంముక్క కాజెయ్యటం గమనించి, బక్ కూడా మర్నాడు అదే ఉపాయంతో పెద్దముక్క తస్కరించింది. ముక్క పోయినట్లు బయటపడి అల్లరి అయింది, కాని బక్‌ను ఎవరూ అనుమానించలేదు. బక్ చేసిన నేరానికి "డబ్" అనే కుక్క శిక్షపొందింది. ఈకుక్క ఎప్పుడూ ఏదో పాడుపనులు చేసి తెలివితక్కువగా దొరికిపోతూ ఉండేది.

క్లేశపూరితమైన ఈ ఉత్తరప్రాంతపు జీవితానికి తట్టుకునే అర్హత బక్‌కు అలవడించటానికి తొలి నిదర్శనం ఈ మొదటి దొంగతనమే. కొత్త పరిస్థితులకు అనుగుణంగా మారేశక్తి దానికి ఉన్నట్టు రుజువయింది. ఈ శక్తి లేకపోతే శీఘ్రమరణంతప్ప మరొకటి ఉండదు. దాని నైతికస్వభావం మొక్కపోయినట్టుకూడా ఈ దొంగతనం స్పష్టంచేసింది. దయా దాక్షిణ్య రహితమైన జీవిత పోరాటానికి నైతిక స్వభావం ఒకపెద్ద ప్రతిబంధకం. దక్షిణాన తనచుట్టూ ప్రేమించినవారూ, స్నేహితులూ ఉన్నచోట ఇది నీది, ఇది ఇంకొకరిది అన్నభావం ఉండటంలేదు; ఈ ఉత్తరాన దుడ్డు

క్రూర న్యాయమూ, ఘోరన్యాయమూ అమలు జరిగేచోట అలాంటి విచక్షణాలు పాటించటం కేవలం మూర్ఖులు చేసేపని, వాళ్ళు బాగుపడలేరు.

బక్ ఈ విధంగా వితర్కించుకున్నదని కాదు. పరిస్థితులకు అనుగుణంగా మారేశక్తి దానిలో ఉన్నది. అందుచేత అది మారింది, అంతే. లోగడ అది ఎంత ప్రమాదం ఎదురైనా వెన్నిచ్చి ఎరగదు. కాని ఎర్రస్వెట్టర్ వాడిదుడ్డు కర్రతో దానిదర్పం కాస్తా పోయింది. నాగరికంగా బతికే రోజులలో ఒకనైతిక విషయంకోసం, ఉదాహరణకు జడ్జి గారి చరణాలను కాపాడటంకోసం, ప్రాణాలుఅర్పించి ఉండేది. కాని ఇప్పుడా నాగరికత అంతా తుడిచి పెట్టుకు పోయింది. అది ఇప్పుడు తననుతాను రక్షించుకునేటందుకు ఏ నైతిక విషయాన్నయినా జారవిడిచి కాలికి బుద్ధిచెప్ప గలదు. అది తిండి దొంగిలించిందంటే సరదాకు కాదు, ఆకలి బాధ భరించలేకనే. అది అందరూ చూసేలాగు తిండి దొంగిలించలేదు; దుడ్డుకర్రలపైనా, కోరలపైనాగల గౌరవం కొద్దీ చాటుగా,యుక్తిగా దొంగిలించింది. ఒక్కముక్కలో చెప్పాలంటే అది చేసినప్పుడు పనులు చెయ్యటంకంటె చెయ్యకుండా ఉండటమే దానికి కష్టసాధ్యమయింది.

దాని పరిణామం (లేదా, పతనం) అతిశీఘ్రంగా జరిగింది. దాని కండరాలు ఉక్కులాగా తయారయాయి. దానికి బాధఅంటే లక్ష్యంలేకుండా పోయింది. అది ఎంత రోత పుట్టించే ఆహారమైనా, ఎంతజీర్ణంకాని ఆహారమైనా

తినటమూ, తిని హారాయించుకుని వంట పట్టించుకోవటమూ నేర్చింది. అది తిన్న ఆహారం పూర్తిగా, ఒక్కనలుసు పాలు బోకుండా వంటపట్టి దాని శరీరంలోని ప్రతిభాగంలోనూ దృఢమైన ధాతువులు తయారయాయి. దాని చూపూ, ఘ్రాణశక్తీ అపరిమితంగా పెరిగాయి. ఇక శ్రవణశక్తి మాట చెప్పనే అవసరంలేదు. అది నిద్రలో ఇంత చిన్న చప్పుడు విన్నాసరే అది నిరపాయమైనదో, అపాయం సూచిస్తుందో తెలుసుకునేది. తన కాలి వేళ్ళసందున మంచు పేరితే దాన్ని కొరికి తీసిపారెయ్యటం అది నేర్చుకున్నది. దానికి దాహంగా ఉన్నప్పుడు నీటిమడుగుపై మందంగా మంచుపేరుకుని కనిపిస్తే, అది తన ముందుకాళ్ళతో బలంగా ఆ మంచుమీద కొట్టి పగులగొట్టేది. అన్నిటికన్న అది నేర్చిన గొప్పవిద్య ఏమంటే, గాలిని వాసనచూసి మరునటి రాత్రి ఉండబోయే వాతావరణస్థితి తెలుసుకోవటం. అది ఏ చెట్టుపక్కనో, గట్టుపక్కనో గొయ్యి తవ్వుకునేటప్పుడు గాలి ఎంత నిశ్చలంగా ఉండనీగాక, తరవాత కొంతసేపటికి గాలి సాగాక చూస్తే అది ఉన్నచోటికి గాలి తగలకుండా ఆ చెట్టుగాని, గట్టుగాని అడ్డుండటం కనిపించేది.

అది అచ్చగా అనుభవంతోనే నేర్చుకోలేదు. దాని లోపల అణగారిఉండిన సహజ ప్రవృత్తి మేలుకున్నది. తరతరాలుగా దాని సంతతి కుక్కలు పొందిన మచ్చిక మటుమాయమయింది. తమజాతి వన్యజీవితం గడిపిననాటి స్మరణలు దానికి అస్పష్టంగా స్ఫురించసాగాయి. దాని పూర్వీకులు అడవులవెంట మందలు మందలుగా తిరిగి

వేటాడిన జంతువులను ఆహారంగానే తిన్న విధంగా అది తయారయింది. పోట్లాటలో శత్రువును చీల్చిచెండాడటమూ, తోడేలులాగా చప్పున కొరకటమూ అతి సులువుగా అల వడ్డాయి. దాని పూర్వీకులు ఇలాగే పోట్లాడాయి. వాటి రక్తం దాని శరీరంలో ప్రవహిస్తున్నట్టయింది. అవి తమ సంతతికి సంక్రమింపజేసిన యుక్తులు ఇప్పుడు దాని సొత్తు అయాయి, వీటికోసం అవి శ్రమపడలేదు. అవి దానిరక్తంలో ఎప్పుడూ ఉన్నట్టే అయింది. అది చలిరాత్రులవేళ దాని మోర ఏ నక్షత్రంకేసో ఎత్తి దీర్ఘంగా, తోడేలులాగా కూతపెడితే, ఏనాడో చచ్చి మట్టిలోగలసిన దాని పూర్వీకులు నక్షత్రాలకేసి మోరఎత్తి దానిద్వారా కూశాయి. వాటి ఆర్తనాదమే దాని ఆర్తనాదం కూడా — ఆ ఆర్తనాదాలు వాటి కష్టాలూ, వాటికి ఆ నిస్సబ్ధతలోనూ, చలిలోనూ, చీకటిలోనూ కనిపించిన అంతరార్థమూ వ్యక్తమయేవి.

జీవితం ఒక బొమ్మలాట. దానికి నిదర్శనంగా దాని నోటివెంట ఆ పాత శోకగీతం వెలువడింది; దాని వారసత్వాన్ని అది అందిపుచ్చుకున్నది. ఇది ఎందుకు సంభవించిందయ్యా అంటే; మనుషులకు ఉత్తరాన ఒక పసుపు పచ్చని లోహం దొరికిందిగనకా, తోటమాలికింద పనిచేసే మాన్యూల్ సంపాదన వాడి భార్యఖర్చుకూ, పిల్లలఖర్చుకూ చాలకపోవటం వల్లనూ.

# 3

## తీవ్రమైన రాకాసి తత్వము

బక్‌లో సృష్టికాలంనాటి రాక్షసితత్వం ఉంది. అది ఈ బళ్ళలాగే దుష్కర జీవితంతోబాటు క్రమంగా అభివృద్ధి చెందింది. ఇలా పెరిగే రాక్షసత్వాన్ని అది పైకి కనబడనివ్వలేదు. దాన్ని దాచిఉంచే యుక్తిని అది సంపాదించుకున్నది. ఈ కొత్తజీవితం దానికి కత్తిమీద సాము లాగా ఉండటంచేత అది తొణకకుండా తొందరపడకుండా తనను తాను నిగ్రహించుకున్నది. అది కయ్యానికి కాలు దువ్వకపోగా, సాధ్యమైనంతవరకు పోట్లాటలను తప్పుకు తిరిగింది. అది అతి జాగ్రత్తగా మసులుకుంటూ, తనకూ స్పిట్జ్‌కూ మధ్య సాగుతున్న వైరం విషయంలోకూడా తనవల్ల తొందరపాటుగాని ప్రకోపక చర్యలుగాని, కలగకుండా చూసుకుంటూ వచ్చింది.

స్పిట్జ్ తనకు బక్ తీవ్రమైన పోటీదారన్న సంగతి గ్రహించిందేమో, అది అవకాశం దొరికినప్పుడల్లా బక్‌కు కోరలు చూపుతుండేది. కావాలని బక్ మీద తనపరాక్రమం ప్రదర్శించేది. తానో అదో తేలిపోయే పోరాటానికి బక్‌ను కవ్వించటానికి మహా ప్రయత్నించేది.

ఆ రెండుకుక్కలూ ఏది ఉండటమో ఏదిచావటమో నిర్ణయమయ్యే అవకాశం తొలిరోజుల్లోనే కలిగి, ప్రమాదం వెంట్రుకవాసిలో తప్పిపోయింది. అది తప్పిపోవటానికి

కారణాంతరంగా మరొక ఘోరం జరిగింది. ఆనాడు రాత్రి చాలా ఘోరమైన పరిస్థితులలో ఒకసరస్సుఒడ్డున విడిశారు. మంచు చెరుగుతున్నది, ఈదురుగాలి కత్తిలాగా కోస్తున్నది. గాఢాంధకారంలో వారు విడిది స్థలంకోసం తడుముకోవాల్సి వచ్చింది. అంతకంటె పనికిమాలినస్థలం వారికి కావాలన్నా దొరికి ఉండదు. వారివెనక గోడలాగా నిలబడిఉన్న కొండ ఉన్నది. పెరాల్ట్, ఫ్రాన్సోయ్‌లు గడ్డకట్టిన సరస్సుపైనే మంటచేసుకొని పక్కలు పరచుకున్నారు. బరువుతగ్గుతుందనే ఉద్దేశంతో వారు తమ డేరాను డైయా వద్దనే వదిలేశారు. మంట చేసేటందుకు వారికి కొద్ది కర్రపుల్లలు దొరికాయి. ఆ మంటకూడా మంచుకరిగి త్వరలోనే ఆరిపోయింది. వారు చీకటిలోనే భోజనం చేశారు.

కొండకింద ఈదురుగాలి తగలనిచోట, బక్ తనకోసం గుంటచేసుకున్నది. అది హాయిగా, వెచ్చగా ఉండటంవల్ల ఫ్రాన్సోయ్ కుక్కలకు చేపలు పెట్టేటప్పుడు దానికి ఆగుంట వదిలిపోవడం కష్టమయింది. అది తిండి తిని తన గుంటకు తిరిగి వచ్చేసరికి అందులో స్పిట్జ్ అదివరకే చేరి బెదిరింపుగా బక్‌మీద గుర్రుమన్నది. ఇంతవరకూ బక్ తన శత్రువుతో కలగజేసుకోకుండా మసులుకుంటూ వచ్చింది గాని, ఈ దుర్మార్గాన్ని సహించలేకపోయింది. దానిలో ఉన్న రాక్షసి పైకి వచ్చింది, అది వెర్రి కోపావేశంతో స్పిట్జ్ పైన పడింది. తనలో ఇంత ఆగ్రహావేశం ఉన్నదని బక్‌కే తెలియదు సరేగదా; స్పిట్జ్‌కుకూడా ఆ ఆవేశం చూసి ఆశ్చర్యం కలిగింది; బక్ పిరికికుక్క అనీ, తనపెద్దశరీరంతో

అది దబాయించుకు వస్తున్నదని స్పిట్జ్ ఇంతకాలమూ అనుకున్నది.

రెండు కుక్కలూ కలియబడి చిక్కుపడిపోయినట్టుగా అయి గుంటనుంచి ఇవతలికి వచ్చిపడటం ఫ్రాన్స్వాయ్ చూసి ఏం జరిగినదీ ఊహించాడు, అతనికికూడా బక్ సాహసం ఆశ్చర్యం కలిగించింది. అతను బక్‌ను ఉత్సాహంతో ప్రోత్సహించసాగాడు.

స్పిట్జ్ ఏమాత్రమూ తగ్గలేదు. మంచి పట్టుకోసం చూస్తూ అది గుండ్రంగా తిరుగుతూ కోపంతో అరుస్తున్నది. స్పిట్జ్‌ను గట్టి దెబ్బతీసే ఆసక్తితో బక్ కూడా ఎంతో జాగ్రత్తగా అవకాశంకోసం చూస్తూ గుండ్రంగా తిరుగుతున్నది. సరిగా ఆ సమయంలో అనుకోని దుస్సంఘటన ఒకటి జరిగి, ఆ రెంటిమధ్యా బలాబలాలు నిర్ణయమయే ఘడియ వాయిదా పడింది. ఆ అవకాశం మళ్ళీ చాలా కాలానికిగాని రాలేదు.

ఉన్నట్టుండి పెరాల్ట్ గొంతెత్తి శాపనార్థాలు పెట్టటమూ, మరుక్షణం తపీమని దుడ్డుకర్ర దేని పువ్వెప్పైనో కొట్టటమూ, అది బాధతో కుంయోమనటమూ వినిపించాయి. ఆ తరవాత అల్లకల్లోలం చెలరేగింది. దీనికంతకు మూలకారణం ఏమిటంటే, దాదాపు వంద ఎస్కిమో కుక్కలు చడీచప్పుడూ లేకుండా శిబిరంలోకి జొరబడ్డాయి. అవి ఆ సమీపంలో ఉండే ఎర్ర ఇండియనుల గ్రామానికి చెందినవై ఉంటాయి. ఆకలికి మాడు

టున్న ఆ కుక్కలు శిబిరాన్ని పసికట్టాయి; బక్‌కూ, స్పిట్జ్‌కూ ఘర్షణ సాగుతున్న సమయంలో అవి శిబిరంలో జొరబడ్డాయి. మనుషులిద్దరూ దుడ్డుకర్రలు తీసుకుని వాటిపై దాడి చేశారు. అవి పారిపోక కోరలుచూపి పోట్లాటకు తల పడ్డాయి. తిండి వాసనకు వాటికి మతి పోయిన ట్టయింది. తిండి బుట్టలో మూతి పెట్టిఉన్న ఒకకుక్కను పెరాల్ట్‌చూసి చావుదెబ్బ కొట్టాడు. ఆహారపు బుట్ట కింద పడిపోయింది. వెంటనే ఇరవై కుక్కలు రొట్టెకోసమూ, మాంసముకోసమూ ఎగబడ్డాయి. దుడ్డుకర్ర దెబ్బలను అవి లక్ష్యపెట్టలేదు. అవి బాధకు ఏడుస్తూనే, తిండి ఒక్కనలుసుకూడా మిగల్చకుండా కాజేశాయి.

ఈ అల్లకల్లోలమంతా విని నిర్ఘాంతపోయిన శిబిరం కుక్కలు తమ గుంటల్లోనుంచి బయటికి వచ్చేసరికి దాడి వచ్చిన కుక్కలు వాటిపై తలపడ్డాయి. అంత నాసిరకం కుక్కలను బక్ ఎన్నడూ చూసిఉండ లేదు. వాటి ఎముకలు, చర్మంలోనుంచి పొడుచుకు వస్తున్నాయి. అవి అస్థిపంజ రాలలాగా ఉన్నాయి. వాటి కళ్ళు మెరుస్తున్నాయి. వాటి కోరలనుంచి చొంగ కారుతున్నది. కాని ఆకలిమూలంగా అవి దుర్వార్యంగా తయారయాయి. వాటిని ఎదిరించటానికి లేదు. మొదటి దెబ్బలో శిబిరం కుక్కలు కొండదాకా పరిగెత్తాయి. మూడు కుక్కలు బక్‌ను ఎదుర్కొని, ఒక్క క్షణంలో దాని తలా, భుజమూ పీకి పెట్టాయి. చప్పుడు దుర్భరంగా ఉంది. బిల్లీ దాని అలవాటుప్రకారం అది శోకాలు పెడుతున్నది. డేవ్, సోల్‌లెక్స్ పక్కపక్కనేఉండి

అత్యంత ధైర్యంతో పోరాడుతున్నాయి. వాటి శరీరాల నిండా గాయాలే, శరీరమంతా రక్తమయమే. జో దయ్యం పూనినట్టు కొరికేస్తున్నది. అది ఒక కుక్క కాలిని ఎముకతో సహా కొరికేసింది. ఆ కాలువిరిగిన కుక్క మెడ పట్టుకుని పైక్ ఒక విదిలింపుతో విరిచేసింది. బక్ మరొక కుక్కను గొంతుపట్టి కొరికేసరికి దాని రక్తం బక్ శరీరంనిండా చిమ్మింది. వేడిరక్తం చవిచూడగానే దాని పౌరుషం రెచ్చి పోయింది. అది మరొక కుక్కపై పడింది. ఆ క్షణంలో పక్కనుంచి బక్‌పై పడి దాని మెడ గట్టిగా కొరికింది.

పెరాల్ట్, ఫ్రాన్సోయిస్‌లు తామున్నస్థలం చక్కదిద్దు కుని తమ కుక్కలను రక్షించుకోటానికి వచ్చారు. వారిని చూసి దొంగకుక్కలు పారిపోయాయి. కాని అవి మళ్ళీ తిండిబుట్టకేసి పోయాయి. ఆహారాన్ని రక్షించుకోవటానికి మనుషులు వెళ్ళేసరికి మళ్ళీ శిబిరంకుక్కలు పైకివచ్చాయి. బిల్లీకి భయంతో ఎక్కడలేని సత్తువావచ్చి, తమని చుట్టు ముట్టే శత్రువులమీదుగా దూకి మంచుమీదపడి పారిపో యింది. పైక్, డచ్ దాన్ని అనుసరించాయి. మిగిలిన శిబిరం కుక్కలుకూడా అదేమార్గం అవలంబించాయి. బక్ కూడా ఒక్క దూకు దూకి వాటిని అనుసరించబోతున్న సమ యంలో, స్పిట్జ్ తనపైన తాకి కిందపడవెయ్యటానికి పొంచి ఉండటం క్రీగంట కనిపించింది. ఆ సమయంలో అది కింద పడి దొంగ కుక్కలు దానిని కమ్ముకోవటమే జరిగితే ఇక అది బతికే ఆశలేదు. అందుచేత బక్ స్పిట్జ్ తాకిడికి కింద

బడకుండా ఉండటానికి ఊతంగా నిలబడింది. ఆ తరవాత అదికూడా సరస్సుమీదికి పరిగెత్తిపోయింది.

కొంతసేపటికి శిబిరానికి చెందిన తొమ్మిది కుక్కలూ కలుసుకుని అడవిలో తలదాచుకున్నాయి. ప్రమాదం తప్పిందిగాని అవి చాలా విషాదకరమైన స్థితిలో ఉన్నాయి. వాటిలో నాలుగైదు గాయాలులేని కుక్క ఒకటీ లేదు. కొన్ని ఘోరంగా గాయపడ్డాయి. డచ్ వెనక కాలికి గాయమయింది. అన్నిటికన్న ఆఖరుకు తీసుకురాబడిన డాలీ అనే కుక్కకు గొంతు గాయమయింది. జోకు ఒక కన్నుపోయింది. అతి సాధువైన బిల్లీ చెవి వాలికలూ పేలికలూ అయింది. అది తెల్లవార్లూ మూలుగుతూనేఉంది. తెల్లవారినాక అవి భయపడుతూ శిబిరానికి తిరిగి వచ్చాయి. అప్పటికి దొంగ కుక్కలు వెళ్ళిపోయాయిగాని మనుషులిద్దరూ చాలా చిరాకుగాఉన్నారు. వారిఆహారపదార్థాలలో సగంపోయాయి. స్లెడ్జ్ తాలూకు కట్లుతాళ్ళనూ, దాని వైనక ప్పేకాన్వాస్‌ను దొంగ కుక్కలు కొరికాయి. ఆమాటకువస్తే అవి ప్రతి వస్తువునూ కొరికాయి—తినేది అయినాసరే; కాకపోయినా సరే. అవి పెరాల్ట్ కాలితొడుగులు కొరికాయి, స్లెడ్జ్‌తోలు పగ్గాలనూ, ఫ్రాన్సోయ్ కొరడాతాడునూ కొరికాయి. కుక్కలు తిరిగి వచ్చేసరికి అతను తన కొరడాను చూసుకుని విచారపడుతున్నాడు.

అతను గాయపడిన కుక్కలను చూసుకుంటూ మృదువుగా వాటితో, "ఈ గాయాల మూలంగా మీకు పిచ్చి

ఎత్తదుగదా! కొంపతీసి అన్నీ పిచ్చికుక్కలై పోతాయేమో! ఏం పెరాల్ట్!" అన్నాడు.

పెరాల్టు అనుమానంగా తల ఆడించాడు. అతను చేరవలసిన డాసన్ నగరం ఇంకా నాలుగువందలమైళ్ళు న్నది. తన లాగుడు కుక్కలకు పిచ్చిఎత్త నారంభిస్తే అతను చాలా చిక్కులో పడిపోతాడు. కుక్కలకు జీనులు తగిలించి స్లెడ్జికు పూన్చటానికి రెండుగంటలసేపు హైరాన పడవలసి వచ్చింది. క్షతగాత్రాలతో కుక్కలు లాగసాగాయి. దీనికి తగట్టు దారి వెనకటికంటె చాలా కష్టంగా తయారయింది. నిజానికి డాసన్‌కు వెళ్ళే దారిఅంతటిలోకీ అవి ఇప్పుడు పోతున్న భాగం చాలా కరుకైనది.

"ముప్పైమైళ్ళనది" (Thirty Mile River) పేరుకో లేదు. అతి వేగంగా ప్రవహించే దాని నీరు చలికి గడ్డకట్ట లేదు. సుడిగుండాలలోనూ, ప్రవాహం మందంగా ఉన్న చోటా మాత్రమే మంచుగడ్డలు చేరాయి. ఆముప్పైమైళ్లూ ప్రాణంతోడే దారి. వాటిని గడవటానికి ఆరురోజులు వర్ణ నాతీతమైన శ్రమకు గురికావలసి వచ్చింది. అడుగడుగునా ప్రాణాపాయమే. దారివెతుక్కుంటూ ముందు వెళ్లే పెరాల్ట్ ఒక డజనుసార్లయినా మంచు విరిగి అడుగుకు దిగిపోయాడు. కాని అతను తన భుజాలమీద అడ్డంగా పట్టుకుని ఉండిన పొడుగుపాటి కర్ర అతను దిగబడిన గోతికి అడ్డంపడి అతన్ని రక్షించింది. అయితే చలి విపరీతంగా ఉన్నది, మంచు చలి కంటె యాభై డిగ్రీలు తక్కువ. అందుచేత అతను మంచులో

ఇరుక్కుపోయి పైకివచ్చినప్పుడల్లా చలిమంట వేసి, అతని దుస్తులు ఆరబెట్టి అతని ప్రాణాం కాపాడవలసి వచ్చింది.

అతనికి భయమేమిటో తెలియదు. భయం తెలియని వాడు గనుకనే ప్రభుత్వం అతనిని వార్తాహరుడుగా నియమించింది. అతను అన్నిరకాల ప్రమాదాలను ఎదుర్కొంటూనే తెల్లవారినది లగాయతు చీకటి పడేదాకా మొండిగా ఆ మంచుతో ఘర్షణ పడేవాడు. అతను ఎంతో అపాయకరమైన మంచుమీదుగా దారి తీసేవాడు. ఒకసారి స్లెడ్జ్, డేవ్‌తో బక్‌తో సహా మంచులో దిగబడిపోయింది. ఆ కుక్కలు కొనప్రాణాలతో బయటికి లాగబడ్డాయి. చలికి వాటి శరీరాలు కొయ్యబారిపోయాయి. చలిమంట వెయ్యకపోతే అవి బతికే ఆశలేదు. వాటి శరీరాలమీద మంచు మందంగా పట్టింది. వాటిని చలిమంట చుట్టూ పరిగెత్తించారు. మంచంతా కరిగి నీరు కారిపోయింది. కాని అవి మంటకు చాల దగ్గిరిగా పరిగెత్తటంచేత వాటి బొచ్చుకూడా కాలింది.

మరొకసారి స్పిట్జ్ (స్లెడ్ లాగేటప్పుడు అన్నిటికన్న ముందునడిచే కుక్క) తాను మంచులో మునిగిపోతూ, బక్‌కూ తనకూ మధ్యఉన్న కుక్కలన్నిటినీ అడుగుకు లాక్కుపోయింది. కాలుకు పట్టుచిక్కకుండా ఉన్న మంచు మీద బక్ కాళ్ళు ముందుకు తొక్కిపట్టి వెనక్కు వాలింది. దానిచుట్టూ మంచు పెళపెళా పగిలిపోతున్నది. దానికి వెనక ఉన్న డేవ్‌కూడా అలాగే చేసింది. స్లెడ్జ్ వెనక నడుస్తున్న

ఫ్రాన్సొయ్ తనకున్న సత్తువ యావత్తూ వినియోగించి స్లెడ్జ్‌ను వెనక్కు లాగిపట్టుకున్నాడు.

వారికి ముందూ వెనకాకూడా ఉన్న మంచు పగల నారంభించింది. పెరాల్ట్ చప్పున పక్కనే ఉన్న గుట్టపైకి ఎగబాకాడు — దాన్ని ఎలా ఎక్కగలిగాడో అతనికే తెలియదు. అతనాపని జయప్రదంగా చెయ్యాలని ఫ్రాన్సొయ్ ఎన్నో దణ్ణాలుపెట్టుకున్నాడు. తమదగ్గర ఉన్న ప్రతి తోలుపట్టా, జీనుతాడూ తీసి ఒక మోకుగా పేని ఒకొక్క కుక్కనే మంచుఅడుగున ఉన్న సీటినుంచి పైకి లాగారు. స్లెడ్జ్‌కూడా పైకిచేర్చాక ఫ్రాన్సొయ్ వచ్చాడు. ఆ గుట్టమీదనుంచి ఎటుగా దిగాలా అని వెతుక్కోవలసి వచ్చింది. దిగటానికికూడా మోకు ఉపయోగపడింది. తిరిగి ఆరాత్రికి వారు మళ్ళీ నదిమీదికి చేరుకుని మజిలీచేశారు. ఆరోజు వారు సాగించిన ప్రయాణం రెండు ఫర్లాంగులే!

వారు హూటాలింకా (Hoota linqua) చేరుకునే సరికి మళ్ళీ గట్టిమంచువచ్చింది. అయితే బక్‌లో త్రాణ మిగలలేదు. మిగిలిన కుక్కలస్థితి అలాగేఉంది. కాని లోగడ జరిగిన జాప్యాన్ని సరిచేసుకోవటానికి పెరాల్ట్ వాటిని విధీ విరామమూ లేకుండా తోలాడు. మొట్టమొదటిరోజున అవి ముప్ఫైఅయిదు మైళ్ళు ప్రయాణంచేసి "బిగ్ శామన్" (Big Salmon) చేరాయి. మర్నాడు మరి ముప్ఫైఅయిదు మైళ్ళు వెళ్ళి "లిటిల్ శామన్" చేరాయి. మూడోనాడు నలభై మైళ్ళు నడిచి దాదాపు "ఫైవ్ ఫింగర్స్" సమీపించాయి.

బక్ పాదాలు ఎస్కిమో కుక్కల పాదాలంత చిన్నవీ కావు, గట్టివీకావు. దాని పూర్వీకులు మచ్చికలు పెరగటం మొదలైననాటినుంచీ అవి మెత్తబడుతూ వస్తున్నాయి. రోజల్లా అది కుంటుతూ బాధపడేది; మజిలీవేశాక ప్రాణం సొమ్మసిల్లి పడుకునేది. ఒకచెంప ఆకలి దహించుకుపోతున్నా అది తన ఆహారంకోసమైనా లేచేదికాదు. దానివంతు చేప ముక్కను ఫ్రాన్సాయ్ స్వయంగానే తెచ్చిపెట్టేవాడు. అంతే కాదు, అతను ప్రతిరాత్రీ తిండితిన్నాక దాని పాదాలు అర గంటసేపు రుద్దేవాడు. తన కాలి తొడుగు పైభాగాలు కత్తిరించి దాని నాలుగుపాదాలకూ తొడుగులు తయారుచేశాడు కూడా. ఈ తొడుగులు బక్ ప్రాణానికి ఎంతో హాయిఅనిపించాయి. అవిలేకుండా అది ప్రయాణమయ్యేదికాదు. ఒక నాటి ఉదయం అది వెల్లకిలా పడుకుని నాలుగుకాళ్ళూ పైకెత్తి ఆడిస్తూ, తొడుగులు అమర్చటం మరిచిపోయిన ఫ్రాన్సాయ్‌కి జ్ఞాపకం చేస్తూండటం చూసి, ఆర్చుకుపోయిన పెరాల్ట్ ముఖంలోకి నవ్వు వచ్చిందికూడా. క్రమంగా దాని పాదాలు గట్టిపడ్డాక ఆ తొడుగులతో అవసరంలేకుండా పోయింది.

"పెల్లీ" ప్రాంతంలో ఒకనాటి ఉదయం వారు బయలుదేరబోతూన్న సమయంలో, ఎన్నడూ ఒక ఊసూ సొంటీ పట్టించుకోని డాలీకి పిచ్చి ఎత్తింది. అది ఉన్నట్టుండి, గుండెలు చెదిరేలాగ ఒక దీర్ఘమైన శోకంపెట్టి, బక్ పైకి ఉరికింది. అది పెట్టిన శోకానికి కుక్కలన్నీ

హడలిపోయాయి. బక్ ఎన్నడూ కుక్కలకు పిచ్చి ఎత్తటం చూడ లేదు. దానికి పిచ్చికుక్కల భయంకూడా అనుభవం లేదు. అయినా ఈ పిచ్చి భయానకమైనదని అదిగ్రహించి ప్రాణభీతికొద్దీ పరిగెత్తసాగింది. డాలీ దాని వెంటబడి ఒక్క అంగలో అందుకునే దూరంలో పరిగెత్తుతున్నది. అయితే భీతావహంకొద్దీ బక్ పరిగెత్తుతుండటంవల్ల డాలీ దాన్ని అందుకోలేక పోయింది. ఆమాట అని అది బక్‌ను విడవనూ లేదు. బక్ లంకమీది చెట్లతోపుల్లోకి పరిగెత్తి, లంకదాటి నది పాయమీద పేరుకున్న మంచుమీదుగా ఇంకొక లంక చేరి, అక్కడినుంచి మూడోలంకకు పరిగెత్తి, చుట్టూ తిరిగి అసలు నదిమీదిగా పరిగెత్తుకు రాసాగింది. అంతసేపూ అది వెనక్కు తిరిగిచూడక పోయినా, డాలీ తనను వెన్నంటి తరుముతూ ఉండటం దానికి తెలుస్తూనే ఉంది. రెండు ఫర్లాంగుల దూరంనుంచి ఫ్రాన్సోయ్ తనను పిలవటం బక్‌కు వినపడింది. తనను అతను రక్షించగలడన్న విశ్వాసం పెట్టు కుని, రొప్పుతూ రోజుతూ బక్ తిరిగి రాసాగింది. బక్ చేతు లతో గొడ్డలిఎత్తి పట్టుకుని నిలుచుని ఉన్నాడు. బక్ తన పక్కగా దాటిపోగానే అతను ఆ గొడ్డలితో డాలీతల ఒక్క దెబ్బన పగులగొట్టేశాడు.

బక్ సొమ్మసిల్లి స్లెడ్జ్ పైనవెళ్ళి పడింది. దానికి ఊపిరికూడా సరిగా అందటంలేదు. శక్తిపూర్తిగా ఉడిగి పోయింది. ఇది తనకు మంచి అవకాశమని తెలుసుకుని స్పిట్జ్ బక్‌పైబడి దాని కండలు రెండుచోట్ల పీకేసింది. బక్ ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయింది. ఇంతలో ఫ్రాన్సోయ్

కొరడా ఝళిపించిన స్పిట్జ్‌ను తాకింది. ఆనాడు స్పిట్జ్ తిన్న కొరడాదెబ్బలు లాగుడుకుక్కలలో దేనికీ ఏనాడూ తగల లేదు.

"ఆస్పిట్జ్ రాక్షసి. ఎప్పుడో బక్‌ను పొట్టపెట్టుకుంటుంది" అన్నాడు పెరాల్ట్.

"బక్ రెట్టింపు రాక్షసి. నేను దాన్ని గమనిస్తూనే ఉన్నాను. చూస్తూఉండు. ఎప్పుడో దానికి దయ్యం పట్టుతుంది. ఆరోజు అది స్పిట్జ్‌ను నమిలి పిప్పిచేసి మంచుమీద అంతటా ఉమ్మేస్తుంది. అదిరాసిపెట్టిఉంది" అని ఫ్రాన్స్వాయ్ జవాబిచ్చాడు.

అది మొదలు ఆ రెండు కుక్కలమధ్య ఎడతెగని పోరుసాగింది. దారి వెంబడి పురోగామిగా ఉండటమే గాక కుక్కలకన్నిటికీ పెద్దగా పరిగణించబడుతున్న స్పిట్జ్‌కు ఈ దక్షిణాదికుక్క పోటీలాగా కనబడింది. బక్ దానికి అర్థం కాలేదు. ఏమంటే అది చాలా దక్షిణాది కుక్కల నెరుగును. వాటిలో ఒక్కటీ మజిలీలో గాని, దారి వెంబడి గాని రాణించలేదు. అవి బొత్తిగా దార్ఢ్యంలేనివై పని చెయ్యలేకా, చలిమూలంగా, తిండిచాలకా చచ్చేవి. బక్ దీనికి విరుద్ధం. అది బలంలోనూ, రౌద్రంలోనూ, జిత్తులమారితనంలోనూ ఎస్కిమో కుక్కలకు ఏమాత్రమూ తీసిపోదు. దానికి దర్పంకూడా హెచ్చు. దీనికితోడు అది ఎర్రస్వెట్టర్ వాడి దుడ్డుకర్ర దెబ్బతో, తన ఆధిక్యత నిరూపించుకోవటం కోసం వెర్రి ఆవేశంతో మైమరవటం ప్రమాదమని తెలుసు

కున్నది. అది జిత్తులమారితనం బాగా నేర్చింది. మంచి అవకాశం దొరికినదాకా కాలానికి కట్టుబడి ఉండే ఓర్పు దానికి అద్భుతంగా అలవడింది.

ఈ రెంటిమధ్యా దేనిది నాయకత్వమన్న విషయం తేలటం తప్పనిసరి అయింది. బక్ కోరికకూడా అదే. లాగుడు కుక్కలకు ఒక అర్థంగాని అతిశయం పట్టుకుంటుంది. ఈ అతిశయం మూలంగానే అవి తమ పనికోసం కొసప్రాణంతో సయితం శ్రమిస్తాయి. అలా శ్రమిస్తూ ఆనందంతో ప్రాణాలు వదులుతాయి. జీను విప్పి వదిలేస్తే తమ సర్వస్వమూ పోయినట్టు చిన్నబుచ్చుకుంటాయి. ఈ అతిశయం డేవ్‌లో ఉండేది. సోల్‌లెక్స్‌లో ఉండేది. విడిది సమయంలో నీరసంగా, నిర్లక్ష్యంగా ఉండే ఈ కుక్కలు ప్రయాణ సన్నాహం ప్రారంభం కాగానే ఉత్సాహ పూరితంగా, ఉరవళ్ళు తొక్కుతూ తయారయ్యేవి. ఈ అతిశయంతోనే అవి పగలల్లా ఒళ్ళు తెలియకుండా లాగి రాత్రి మజిలీ వెయ్యగానే సొమ్మసిల్లి పడిపోయేవి. వాటిఉత్సాహమంతా పోయి, ఏదో అసంతృప్తి, ఆవేదనా కలిగేవి. ఈ అతిశయం మూలానే స్పిట్జ్ దారిలో తప్పుచేసిన కుక్కలనూ, బయలుదేరేవేళకు కనిపించకుండా దాక్కున్న కుక్కలనూ తీవ్రంగా దండించేది. ఈ అతిశయంచేతనే దానికిప్పుడు తన స్థానాన్ని బక్ కాజేస్తుందేమోనన్న విచారం కూడా పట్టుకున్నది. బక్ కున్నదికూడా ఇలాంటి అతిశయమే.

స్పిట్జ్ నాయకత్వాన్ని బక్ బహిరంగంగానే ధిక్కరించ సాగింది. స్పిట్జ్ ఏ కుక్కనైనా దండించబోయి నప్పుడు బక్ కనిపెట్టుకుని దానికి అడ్డువచ్చేది. ఒకరాత్రి మంచు భారీగా పడింది. తెల్లారినాక పైక్ అయిపు లేకుండా పోయింది—అసలది చాలా దొంగది. అది తన గుంటలో మంచుకింద అడుగులోతున దాక్కున్నది. ఫ్రాన్సోయ్ దాన్ని పిలిచాడు. దానికోసం వెతికాడు, కాని అది కనిపించ లేదు. స్పిట్జ్‌కు మండిపోయి, శిబిరమంతటా వాసనచూస్తూ, అను మానం ఉన్నచోట తవ్వుతూ, గుర్రుపెడుతూ తిరగటం మొదలుపెట్టేసరికి, పైక్ బెదిరిపోయి తన గుంటలో వణక సాగింది.

తీరా పైక్ దొరికిపోయి, దాన్ని శిక్షించటానికి స్పిట్జ్ దానిపై విరుచుకు పడబోయే సమయానికి, బక్ అంత ఉద్రేకంతోనూ రెంటిమధ్యా అడ్డుపడింది. స్పిట్జ్‌పై ఈ దాడి ఎంత తలవని తలంపుగా, ఎంత చాతుర్యంతో జరిగిం దంటే స్పిట్జ్ వెనక్కు పడిపోయింది. అంతదాకా కాళ్ళు చల్లబడి వణుకుతూ ఉండిన పైక్‌కు ఈ "తిరుగుబాటు" చూసి ధైర్యంవచ్చి, అది స్పిట్జ్‌పైన పడింది. న్యాయా న్యాయ విచక్షణకు ఏనాడో స్వస్తిచెప్పిన బక్ తానుకూడా అదేసమయంలో స్పిట్జ్‌పైన పడింది. అయితే ఫ్రాన్సోయ్ ఈ సంఘటనచూసి తనలోతాను నవ్వుకుంటూనే, బక్‌ను కొరడా తాడుతో బలంకొద్దీ కొట్టాడు. ఆదెబ్బతినికూడా బక్ తన శత్రువును వదలకపోయేసరికి ఫ్రాన్సోయ్ దాన్ని కొరడా

కర్ర తిరిగేసి బాదాడు. ఆ దెబ్బతో దిమ్మరపోయి వెనక్కు పడిపోయిన బక్ చాలా కొరడా దెబ్బలు తిన్నది. ఈ లోపుగా స్పిట్జ్ పైక్‌ను కసితీర దండించింది.

ఆ తరవాత, డాసన్ సమీపించే రోజులలో బక్ అనేకమార్లు తప్పుచేసిన కుక్కలకూ స్పిట్జ్‌కూ మధ్య అడ్డు పడింది. కాని అంత తెలివితక్కువగా ప్రవర్తించక, ఫ్రాన్సోయిస్ దగ్గరలేని సమయంగాచూసేది. బక్ ఈ విధంగా చాటుమాటు తిరుగుబాటు సాగించటంతో కుక్కలలో క్రమ శిక్షణ సన్నగిల్లి అరాజకం ప్రబలింది. డేవ్, సోల్‌లెక్స్ తప్ప మిగిలిన కుక్కలన్నీ మారిపోయాయి. ఏ పని సరిగా సాగటంలేదు. అస్తమానం పనిహెచ్చు తగ్గులు కాసాగింది. అడుగడుగునా ఏదో ఒక పేచీ వస్తుండేది. ప్రతి పేచీకీ మూల కారణం బక్కే. దానిమూలంగా ఫ్రాన్సోయిస్‌కి శాంతి లేకుండా పోయింది. ఎప్పుడో ఒకప్పుడు ఆ రెండు కుక్కలూ తలపడి ఏదో ఒకటి చచ్చినదాకా పోట్లాడుకుంటాయన్న అనుమానం అతనికి రూఢిగా కలిగిపోయింది. ఈ భయంతో అతను రాత్రివేళల ఎన్నోసార్లు, ఇతరకుక్కలు కొట్లాడుకోవటం విని, అవి బక్, స్పిట్జ్ లనుకుని, తాను నిద్రపోయే పంచీలో నుంచి బయటికి వచ్చాడు.

అయితే వాటికి అవకాశం దొరకలేదు. అవి ఒక దాన్నొకటి చంపుకోకుండానే ఒకనాటి సాయంకాలం డాసన్ చేరాయి ఇక్కడ అనేకమంది మనుషులున్నారు. అంతులేని కుక్కలున్నాయి. అందరూ పనిమీద ఉన్నారు. కుక్కలకు పనిచెయ్యాలని రాసిపెట్టి ఉన్నట్టు కనిపించింది

పగలల్లా అవి పెద్దవీధి వెంట ఏదో ఒకటి చేరవేస్తూనే ఉంటాయి. రాత్రివేళకూడా వాటిముఖ్వాలు అస్తమానం మోగుతూనే ఉంటాయి. అవి దుంగలనూ, వంట చెరుకునూ లాగుకు వచ్చేవి. శాంటాక్లారా లోయలో గుర్రాలుచేసే అన్ని పనులూ చేసేవి. వాటిలో అక్కడక్కడా దక్షిణాది కుక్కలున్నా, అవి ఎక్కువభాగం తోడేళ్ళను బోలిన ఎస్కిమో కుక్కలే. ప్రతిరాత్రీ సరిగా తొమ్మిదింటికీ, పన్నెండింటికీ, మూడింటికీ అవి మోరలెత్తి చిత్రంగా కూతలు పెట్టేవి. బక్ ఆనందంతో తానుకూడా వాటితో కలిసి కూత పెట్టేది.

"అరోరా బోరియాలిస్" (Ourora borealis) కాంతులు ఆకాశాన విరజిమ్మినప్పుడు, లేదా నక్షత్రాలు చల్లగాలిలో గెంతినట్లు కనిపించేటప్పుడు, భూదేవి మంచు అడుగున బిగుసుకుపోయి ఉండగా కుక్కలు పెట్టే ఈకూతలు జీవితభారాన్ని వ్యక్తం చేస్తున్నట్లుగా, ఏడుపులాగా ధ్వనించేవి. ఇదిచాలా పాతపాట — కుక్కజాతి పుట్టిననాటిది, భూమిపైన విషాదగీతాలు మాత్రమే ఉండిన కాలపు తొలి పాటలలో ఒకటి, బక్‌ను చలింపజేసిన ఈ పాట అనేక తరాల ప్రాణుల ఆర్తనాదం. ఆ పాటలో బక్ గొంతు కలిసినప్పుడు దాని గొంతువెంట దాని పూర్వీకుల జీవితభారమూ, దాన్నిచూసీ, చీకటినిచూసీ అవిచెందిన భయవిభ్రాంతులూ వ్యక్తమయేవి. ఇవి బక్‌ను సంచలింప జేశాయంటే అది తాను అనుభవించిన నాగరిక జీవితాన్ని పూర్తిగా వదిలేసుకుని తొలియుగాలను చేరుకున్నదన్న మాట.

డాసన్ చేరిన ఏడురోజులకు వాళ్ళు యూకాన్‌మార్గం పట్టుకుని షైయాకు బయలుదేరారు. పెరాల్ట్ ఈసారి ఇంకా అర్జంటు సమాచారాలు చేరవేస్తున్నాడు. అదీగాక ప్రయాణోత్సాహం అతన్ని ఆవహించింది. అతను ఈ ప్రయాణాన్ని కనీ వినవంత శీఘ్రంగా ముగించాలనుకున్నాడు. దానికి తగ్గట్టే అతనికి అనేక అంశాలు కలిసి వచ్చాయి. వారంరోజులు విశ్రాంతితో కుక్కలు బాగా పుంజుకున్నాయి. వచ్చేటప్పుడు తాముచేసుకున్న దారిన ఇంకా అనేకమంది ప్రయాణీకులు నడిచి దారి చాలబాగుపడింది. అదీగాక దారిలో రెండుమూడు చోట్ల పోలీసుశాఖవారు కుక్కలకూ, మనుషులకూ కావలిసిన ఆహార నిక్షేపాలు ఏర్పాటుచేశారు. ఈ తిరుగుప్రయాణంలో అతను బోలెడంత ఆహారం మోయటం తప్పింది.

వాళ్ళు మొదటిరోజు యూషైమైళ్ళు నడిచారు. రెండోరోజు యూకాన్ నదికి ఎదురు నడుస్తూ దాదాపు "పెల్లీ" చేరబడ్డారు. నడక బాగా సాగిందేగాని ఫ్రాన్స్వాయ్‌కి కష్టాలూ, చిరాకూ తప్పలేదు. బక్ సాగించిన తిరుగుబాటు కారణంగా కుక్కలమధ్య ఏకీభావం పోయింది. అదివరకు లాగా ఒక్కకుక్కే లాగుడంతా చేస్తున్నట్టుగా ఇప్పుడు లేదు. బక్ ఇచ్చిన ప్రోత్సాహంతో తిరుగుబాటులో చేరిన కుక్కలు కొద్దిగా తోకలు జాడించసాగాయి. స్పిట్జ్ నాయకత్వంపైన గురీ, భయమూ సన్నగిల్లాయి. దానిపైకి చీటికీ మాటికీ ఇతర కుక్కలు కాలు దువ్వసాగాయి. పైక్ ఒక రాత్రి స్పిట్జ్ ఆహారంలో నుంచి సగంచేపను కాజేసి దిగమింగిది, బక్ దానికి అండగా నిలిచింది. వారొకనాటి

రాత్రి స్పిట్జ్, తప్పుచేసినందుకు డబ్‌నూ, జోనూ దండించ బోయేసరికి, అవి దానిపై తిరగబడి శిక్ష తప్పించుకున్నాయి. చివరకు నోట్లో వేలుపెడితే కరవలేని బిల్లీకూడా వెనకటంత మెతకగా లేదు. అది శోకాలుపెట్టినా లోగడ పెట్టినంత దీనంగా శోకాలు పెట్టటంలేదు. ఇక బక్, స్పిట్జ్ తనకు అంత దూరంలోకి వస్తేచాలు, కోరలుచూపి విషం కక్కేది. అది రౌడీలాగా ప్రవర్తించుతూ, స్పిట్జ్ ఎదటనే రొమ్ములు విరుచుకు తిరగసాగింది.

క్రమశిక్షణ వెనకబడిన కారణంగా కుక్కలమధ్య ఉండే పరస్పర బాంధవ్యాలుకూడా మార్పుచెందాయి. అవి తమలో తాము చీటికీ మాటికీ కీచులాడుకో సాగాయి. ఒకొక్క రాత్రి విడిసిన చోటు వాటి అరుపులతో గందరగోళంగా అయిపోయేది. మారనివి "డేవ్", "సోల్ వెక్స్" మాత్రమే. వాటికి కూడా కుక్కల కీచులాటల మూలాన చిరాకు జాస్తి అయింది. ఫ్రాన్సోయ్ శాపనార్థాలు పెట్టాడు. ఏమీ చెయ్యలేక మంచులో చిందులు తొక్కాడు; తనజుట్టు పీక్కున్నాడు. అతని కొరడా అనుక్షణమూ మోగుతూనే ఉండేది, కాని అందువల్ల కించిత్తయినా ప్రయోజనం లేక పోయింది; అతను అటు తిరుగగానే ఎప్పటిస్థితి ఏర్పడేది. అతని కొరడా స్పిట్జ్ పక్షమయింది. బక్ మిగిలిన కుక్కల పక్షమయింది. బక్ స్వయంగా ఇదంతా చేస్తున్నదని అతనికి తెలుసు, అతనికి తెలుసునని బక్‌కు కూడా తెలుసు. కాని బక్ ఎన్నడూ అతనికి దొరికిపోయేటంత తెలివితక్కువగా ప్రవర్తించలేదు. అది లాగుడులో ఏమాత్రము ఒళ్ళు

దాచుకోలేదు, ఆ పని దాని కిష్టంకు సరదాగాకూడా ఉంది; మిగిలిన కుక్కలమధ్య తగూలు పెట్టడమూ, కట్లాలు చిక్కుపడేలాగు చేయటమూ దానికి మరింత సరదాగా ఉంది.

తాకీనా నదీముఖంవద్ద ఒకనాటి రాత్రి భోజనాలయాక డబ్ ఒక మంచు కుందేటిని పసిగట్టి పట్టబోతే అది కాస్తా తప్పించుకున్నది. మరుక్షణం కుక్కలన్నీ అరుస్తూ కుందేలు వెంటపడ్డాయి. అరఫర్లాంగు దూరాన నార్త్‌వెస్ట్ పోలీసుల శిబిరం ఉన్నది. ఆ శిబిరానికి చెందిన యాభై ఎస్కిమో కుక్కలూ వేటలో వచ్చి కలిశాయి. కుందేలు గడ్డకట్టిన నదిపైగా తేలికగా పరిగెత్త సాగింది. కుక్కలు మంచులో కాళ్ళు కూరుకుంటూ బలమంతా పెట్టి పరిగెత్తుతున్నాయి. అరవైకుక్కల ముందుండి బక్ కుందేలును వెంబడిస్తున్నది గాని, దాన్ని ఎంతకూ అందుకోలేకుండా ఉన్నది. కాంతిహీనమైన వెన్నెలలో బక్ దూకుతూ, ఆత్రంగా మూలుగుతూ పరిగెత్తుతుంటే అందమైన దాని దేహం మెరుస్తున్నది. కుందేలుకూడా చెంగు చెంగున దూకుతూ ముందు పరుగెత్తు తున్నది.

ఉన్నట్టుండి రక్తంలో ఏదో సంచలనం కలిగి రక్తదాహం పెరిగి, చంపాలనే ఆవేశం ప్రకోపించగా నగరాలలో ఉండే మనుషులు తుపాకులూ, తూటాలు తీసుకుని అరణ్యాలలోకి మైదానాల మీదకీ పోతారు; అలాంటి దాహమే మరింత ప్రగాఢంగా ఇప్పుడు బక్‌ను ఆవేశించింది. అది కుక్కలన్నిటికన్నా ముందుండి ప్రాణంతో ఉన్న ఆహారాన్ని వేటాడుతున్నది. దాన్ని ఎలాగైనా అందుకోవాలి,

తన కోరలతో దాన్ని చంపి, తన ముట్టెను దాని వేడి రక్తంలో ముంచాలి.

జీవితం అత్యున్నతస్థాయి నందుకుని, మళ్ళీ అలాటి దశ జీవితంలో రాదన్న సమయం వచ్చినప్పుడు ఒక గొప్ప ఆవేశం కలుగుతుంది. జీవితాగ్రంలో అనుభవమయే ఈ ఆవేశం, అదేంచిత్రమో, జీవితాన్ని విస్మరింప జేస్తుంది. ఈ ఆవేశం, తాను జీవించి ఉన్నట్టుకూడా తెలియని స్థితి కళాకారుడికి అనుభవమైనప్పుడు ఒక మహాజ్వాలతో పైకి వెళ్ళి తనను తాను మరచిపోతాడు; సైనికుడికి వచ్చినప్పుడు యుద్ధోన్మాదానికి వశుడై ప్రాణాలకు తెగించి పోరుతాడు. బక్ అలాటి ఆవేశానికి చిక్కి, మిగిలిన కుక్కలకు దారితీస్తూ తోడేలులాగా అరుస్తూ, ఆ వెన్నెలలో సజీవంగా తనకు అందకుండా పరుగెత్తే ఆహారాన్ని వెంటాడింది. అది తన ప్రకృతి తాలూకు లోతులనూ, తనకన్నకూడా లోతయి కాలగర్భంలోకి చొచ్చుకుపోయి ఉన్న ప్రకృతి లోతులనూ మథిస్తున్నది. జీవితోద్వేగం దానిని ఆవహించింది, దాని నరనరానా, ప్రతి కండరానా ఆనందం ఉబుకుతున్నది. ఆ ఆనందం కదలికరూపంలో దాన్ని ముందుకు ఉరికిస్తున్నది.

కుందేలు పరుగెత్తుతున్నది, గడ్డకట్టుకుపోయిన నీటిపాయ మీదుగా. ఈ నీటిపాయ కొంతదూరం పోయాక మెలిక తిరిగింది ఎంత ఉద్రేకంలోనూ వివశత్వం చెందని స్పిట్జ్ తనకు చిక్కిన అవకాశాన్ని గ్రహించి, మిగిలిన కుక్కలను విడిచిపెట్టి నీటిపాయ మెలికలో ఉన్న భూభాగం మీదుగా కుందేలుకన్న ముందే తిరిగి నీటిపాయను చేరింది. కుందేలు

పైనే దృష్టి ఉంచి పరుగెత్తుతున్న బక్ కుందేలు దారిలోకి ఒడ్డునుంచి మరొక తెల్లటి ఆకారం దూకటం గమనించి, అది స్పిట్జ్ అని తెలుసుకున్నది. కుందేలు పక్కకు తిరగ లేక పోయింది. స్పిట్జ్ కోరలు తన వీపులో గుచ్చుకున్నప్పుడది దెబ్బతిన్న మనిషిలాగా కెవ్వున అరచింది. మృత్యువు చేత చిక్కి ప్రాణం పతనమవుతూ చేసే ఈ ఆర్తనాదానికి పార వశ్యం చెంది, బక్ వెనక పరిగెత్తివచ్చే కుక్కలన్నీ సంతోషంతో అరిచాయి.

బక్ మాత్రం అరవలేదు. దాని పరుగు ఆగనుకూడా లేదు. అది వెళ్ళి అమితవేగంతో స్పిట్జ్ పైన పడింది. వేగం మూలానే స్పిట్జ్ మెడ దానికి అంద లేదు. మంచులో రెండు కుక్కలూ పొర్లిగింతలు పెట్టాయి. స్పిట్జ్ కింద పడీపడక ముందే చివాలున లేచి, బక్ భుజం చీల్చి వెనక్కుదూకింది. అది బక్ అంతు కనుక్కోవటానికి సిద్ధమయింది.

ఈసారి తమ రెంటిలో ఒకదానికి చావు మూడిందని బక్ తెలుసుకున్నది. అది ఎదురుచూస్తున్న సమయం ఇప్పుడు వచ్చింది. చెవులు వెనక్కుమడిచి, అవి కోరలు బయటపెట్టి గుర్రుపెడుతూ, మంచి అవకాశం కోసం వెయ్యి కళ్ళతో కనిపెడుతూ ఒకదానిచుట్టూ ఒకటి పొంచి తిరుగు తున్న సమయంలో ఇదంతా అదివరకు జరిగినట్టుగా బక్ స్ఫురణకు వచ్చింది. తెల్లని అడవీ, నేలా, వెన్నెలా, యుద్ధోద్రేకముగా అన్నీ దానికి జ్ఞాపకం వచ్చాయి. అంతటా తెల్లగా, నిశ్శబ్దంగా, ప్రశాంతంగా ఉన్నది. గాలి చలించ టం లేదు, ఆకు అల్లాడటం లేదు. కుక్కలు విడిచే ఊపిరి

చల్లగాలిలో పైకిపోవటం కంటికి కనిపిస్తున్నది. సరిగా మచ్చికగాని తోడేళ్ళను బోలిన ఆ కుక్కలు కుందేలును మాయం చేసేశాయి. అవి ఇప్పుడు చుట్టూ నిలబడి తమాషా చూస్తున్నాయి. అవికూడా మౌనంగానే ఉన్నాయి. వాటి కళ్ళు మెరుస్తున్నాయి, వాటి శ్వాసకూడా గాలిలోకి మెల్లిగా తేలిపోతున్నది. ప్రాచీనమైన ఈ దృశ్యం బక్‌కు కొత్తగా గాని, వింతగా గాని తోచలేదు. ఇదే అనవాయితీ, ఎప్పుడూ ఇలాగే జరుగుతుంది.

స్పిట్జ్ పోట్లాడటంలో అనుభవం గలది. అది స్పిట్జ్ బెర్గెన్‌నుంచి ఉత్తర ధృవప్రాంతంగుండా, కెనడామీదుగా ప్రయాణంచేసి ఎన్నోరకాల కుక్కలతో తలపడి నెగ్గి, వాటి మీద తన ఆధిపత్యం ప్రతిష్ఠించుకున్నది. దానికి చాలా కోపంవస్తుంది గాని, ఒళ్ళు తెలియకుండా ఎన్నడూ పోదు. అవతలికుక్కను చీల్చి చెండాడాలని తనకెంతగా ఉంటుందో, దానికికూడా అంతగా తనను చీల్చి చెండాడాలని ఉంటుం దన్న సంగతి అది ఎన్నడూ మరిచేదికాదు. తనశత్రువు తన మీదికి ఉరికితే ఆత్మరక్షణ చేసుకోలేని స్థితిలో అది శత్రువు పైకి ఉరికేది కాదు. శత్రువు దెబ్బకొడితే తప్పుకునే శక్తి చూసుకునే తాను దెబ్బకొట్టేది.

ఆ తెల్లని పెద్దకుక్క మెడను తనకోరలతో పట్టేద్దా మని బక్ చేసిన యత్నాలు ఫలించలేదు. దానికూడ అందు కోవటానికి బక్ కోరలు ప్రయోగించినప్పుడల్లా దానికి బక్ కోరలే తగిలాయి, కోరలకు కోరలు తగిలాయి, దవడలు

కోసుకుపోయి రక్తం కారింది. కాని స్పిట్జ్ మటుకు బక్ కు ఏమరుపాటున దొరకలేదు. బక్ కు రోషంవచ్చి స్పిట్జ్ చుట్టూ సుడిగాలిలా తిరిగింది. స్పిట్జ్ పీక చిక్కించుకోవాలని మళ్ళీ మళ్ళీ బక్ ప్రయత్నించింది. కాని ప్రతిసారీ స్పిట్జే ఎదురు దెబ్బతీసి తప్పించుకున్నది. తరవాత బక్ తన శత్రువు కంఠం పట్టుకోబోయే దానిలాగా దానిపైకి ఉరికి, తన జబ్బతో స్పిట్జ్ జబ్బను బలంగా తాకి దానిని కింద పడగొట్టటానికి యత్నించింది. స్పిట్జ్ కింద పడకపోగా బక్ జబ్బచీరి అవలీలగా పక్కకు తప్పుకుంటూ వచ్చింది.

స్పిట్జ్ కు ఒక్కగాయం కాకుండానే, బక్ శరీరం రక్తప్రవాహాలయింది, అది ఆయాసంతో రొప్పుతున్నది. ఈ లోపల చుట్టూ ఉన్న కుక్కలు నిశ్శబ్దంగా నిలబడి, ఏది ఓడిపోతే దాన్ని అంతం చెయ్యటానికి కనిపెట్టుకుని ఉన్నాయి. బక్ కు ఆయాసం రావటం కనిపెట్టి స్పిట్జ్ దానిపైకి ఉరకసాగింది. బక్ తనకాళ్ళమీద నిలబడటానికి విశ్వప్రయత్నం చేయవలసి వచ్చింది. ఒకసారి బక్ కింద పడిపోయింది. చుట్టూ ఉన్న అరవై కుక్కలూ కమ్ముకోసాగాయి. కాని అంతలోనే బక్ లేచింది. కుక్కలు మళ్ళీ దూరంపోయాయి.

అయితే బక్ లో ఒకగొప్ప విశేషం ఉన్నది—అది ఊహాశక్తి. అది సహజ ప్రేమతోనేగాక, బుద్ధి ఉపయోగించికూడా పోరాడగలది. అది స్పిట్జ్ మెడ పట్టుకోవటానికి వస్తున్నట్టే దూసుకువచ్చి, తీరా దగ్గిరికి వచ్చాక వంగి తల మంచుకేసి చూచి, స్పిట్జ్ ముందు కాళ్ళలో ఎడమకాలిని నోట చిక్కించుకుని కటిక్కిన కొరికింది. ఎముక ఫెళ్ళున విరి

గింది. స్పిట్జ్ మూడుకాళ్ళ మృగంగా బక్‌ను ఎదుర్కోవలసి వచ్చింది. కాని అప్పటికే దాన్ని పడగొట్టటానికి బక్ మూడు ప్రయత్నాలు చేసి గెలవలేకపోయింది. తరువాత అది ఎడమ కాలును కొరికిన యుక్తితోనే కుడికాలు కూడా నోట చిక్కించుకుని దాన్నికూడా విరిచేసింది. స్పిట్జ్ బాధపడు తున్నది. దానిది అసహాయ స్థితి అయిపోయింది. అయినా అది నిలవదొక్కుకోటానికి ప్రబ్రహ్మాండంగా యత్నం చేసింది. అది చుట్టూ మౌనంగా నిలబడి ఉన్న కుక్కలను చూసింది. వాటికళ్ళు మెరవటమూ, వాటి నాలుకలు బయటికి వేళ్ళాడు తూండటమూ, వాటిశ్వాస గాలిలో పైకి పోతూండటమూ, అవి తనపైకి కమ్ముకుంటూండమూ దానికి కనిపించింది. లోగడ ఇలాగే చుట్టూఉన్న కుక్కలు ఓడిన కుక్కమీదికి కమ్ముకోవటం అదిచూసి ఉండింది. కాని ఇప్పుడు ఓడిన కుక్క తానే.

దానికి మూడింది. బక్‌లో ఏకోశానా దాక్షిణ్యం లేదు. ఈ వాతావరణంలో దయకు తావులేదు. అది తన శత్రువును తుదముట్టించటానికి ఆయత్తమయింది. చుట్టూ ఉన్న కుక్కలు చాలా దగ్గిరికి వచ్చాయి. వాటిశ్వాస బక్‌కు తగులుతున్నది. స్పిట్జ్ వెనకా, పక్కలా ఉన్నకుక్క లను అది గమనిపించింది. అవి స్పిట్జ్‌నే చూస్తూ, దానిపై దూకటానికి పొంచి ఉన్నాయి. పరిస్థితి కాస్సేపుపాటు స్తంభించినట్టయింది. కుక్కలన్నీ కొయ్యబారి పోయినట్టు నిశ్చలంగా ఉన్నాయి. స్పిట్జ్ మాత్రమే ముందుకూ, వెన కకూ తూలుతూ వణుకుతున్నది, దానిరోమాలు నిక్క

బొడుచుకుని ఉన్నాయి. అది భీభత్సంగా అరుస్తూ దగ్గిరికి వచ్చే మృత్యుదేవతను భయపెట్ట జూస్తున్నట్టుగా ఉన్నది. బక్ చిట్టచివరకు ఒక్క దూకు దూకి మళ్ళీ వెనక్కు గెంతింది. ఈసారి దానికి కావలసినట్టుగా భుజం భుజాన్ని ఢీకొన్నది. మరుక్షణం కుక్కలన్నీ కిందపడిపోయిన స్పిట్జ్‌ను కమ్మేశాయి. బక్ ఎడంగా, విజయగర్వంతో చూస్తూ నిలబడింది.

# 4

## నాయకత్వం ఎవరిది?

మర్నాడు ఉదయం ఫ్రాన్సోయ్ స్పిట్జ్ అయిపులేక పోవటమూ, బక్ శరీరంనిండా గాయాలుండటమూ గమనించి, దాన్ని మంట దగ్గరికి తీసుకుపోయి దాని కాంతిలో గాయాలను చూపిస్తూ, "ఏం చెప్పాను! ఈ బక్ రెండు రాక్షసులకు సమానం!" అన్నాడు.

పెరాల్ట్ బక్ శరీరంమీది లోతైన గాయాలు గమనిస్తూ, "ఆ స్పిట్జ్ దయ్యంలాగా పోట్లాడుతుంది" అన్నాడు.

"బక్ రెండు దయ్యాల్లాగా పోట్లాడుతుంది. స్పిట్జ్ పీడ వదిలింది గనక ఇక మన ప్రయాణం జోరుగా సాగుతుంది" అన్నాడు ఫ్రాన్సోయ్.

పెరాల్ట్ సామానంతా సర్ది స్లెడ్ పైన ఎక్కిస్తుంటే ఫ్రాన్సోయ్ కుక్కలకు జీనులు తొడిగాడు. బక్ ముందుకు వెళ్ళి, స్పిట్జ్ స్థానంలో నిలబడింది. అది నాయకస్థానం.

ఫ్రాన్సోయ్ ఈ సంగతి గమనించక స్పిట్జ్ స్థానంలోకి సోల్ వెక్స్‌ను తీసుకువచ్చాడు. మిగిలిన కుక్కలలో నాయకత్వం వహించగలది అదేనని అతని ఉద్దేశం. రౌద్రంగా బక్ సోల్ వెక్స్‌ను తరిమేసి దాని స్థానంలో తాను నిలబడింది.

ఫ్రాన్సోయ్ ఆనందంతో తొడలు చరుచుకుంటూ, "ఆః! ఆః! ఆ బక్ చూడు. స్పిట్జ్‌ను అదే చంపింది, దాని ఉద్యోగం కాజెయ్యాలని చూస్తున్నది" అన్నాడు.

అతను బక్‌ను అదిలించాడు, కాని బక్ కదలలేదు. బక్ భయంకరంగా గుర్రుపెడుతున్నా లక్ష్యపెట్టక అతడు దాని మెడ పట్టుకుని పక్కకు ఈడ్చి దాని స్థానంలో సోల్ వెక్స్‌ను నిలబెట్టాడు. ఆ ముసలి కుక్కకు ఇది అంతగా నచ్చ లేదు; తనకు బక్‌ను చూస్తే భయం ఉన్నట్టు అది స్పష్టం చేసింది. ఫ్రాన్సోయ్ మొండికెత్తాడు, అయితే అతను అటు తిరగగానే బక్ సోల్ వెక్స్ స్థానం కాజేసింది, సోల్ వెక్స్ అభ్యంతరం చెప్పలేదు.

ఫ్రాన్సోయ్ కోపంతో, "నీ తాడు తెగ, నీ సంగతి చెబుతానుండు!" అంటూ బరువైన దుడ్డుకర్ర తీసుకు వచ్చాడు.

బక్ ఎర్ర స్వెటర్‌వాణ్ణి జ్ఞాపకం తెచ్చుకుని మెల్లిగా వెనక్కు తగ్గింది. ఈసారి సోల్ వెక్స్‌ను ముందుకు తెచ్చి నిల బెట్టినప్పుడది కలియబడలేదు. కాని అది దుడ్డుకర్రకు అంద కుండా అటూ ఇటూ మసులుతూ కోపంతోనూ, నిరాశ తోనూ అరవసాగింది. దానికి దుడ్డుకర్ర తత్వం బాగా అర్థ

మయి ఉండటంచేత, ఫ్రాన్స్వాయ్ చేతిలో ఉన్న దుడ్డుకర్ర విసిరితే తప్పించుకునే జాగరూకతమీదనే అది ఉన్నది.

ఈ లోపల ఫ్రాన్స్వాయ్ తన పని కొనసాగించాడు. అతను మామూలు ప్రకారం డేవ్‌కు ముందుగా బక్‌ను పెట్టటానికి ఉద్యమించాడు. బక్ రెండు మూడడుగులు వెనక్కు వేసింది. ఫ్రాన్స్వాయ్ తనను సమీపించే సరికి, మరికొంత వెనక్కు పోయింది. ఇలా కొంత సేపు జరిగాక బక్ తన చేతిలో ఉన్న దుడ్డుకర్రను చూసి బెదురుతున్న దనుకుని దాన్ని ఫ్రాన్స్వాయ్ అవతల పారేశాడు. అయితే బక్ వెనక్కు తగ్గినది. దుడ్డుకర్రను చూసికాదు; అది నాయకత్వం కోసం తిరుగుబాటు చేస్తున్నది. ఆ నాయకత్వాన్ని అది సంపాదించుకున్నది. అంతకు తక్కువ హోదాను అది ఆమోదించదలచ లేదు.

పెరాల్ట్ కల్పించుకున్నాడు. ఇద్దరూ చేరి బక్‌ను దాదాపు ఒక గంటసేపు తరిమారు. దానిమీద దుడ్డుకర్ర విసిరారు. అది పక్కకు తప్పుకున్నది. వాళ్ళు దాన్నిముందు ఏడుతరాలూ, వెనక ఏడుతరాలూ శాపనార్థాలు పెట్టారు. దాన్ని అన్ని వైపులా దుమ్మెత్తిపోశారు. వారి శాపనార్థాలకు అది మొరుగులతో జవాబు చెప్పిందే తప్ప వారికి మాత్రం అంద లేదు. అది పారిపోనూ లేదు, వాళ్ళను శిబిరం చుట్టూ తిప్పింది; తన కోరిక ఆమోదించబడిన మరుక్షణం మంచిగా పనిలోకి వస్తానని అది స్పష్టం చేసింది.

ఫ్రాన్సోయ్ చతికిలబడి బుర్రగోక్కున్నాడు. పెరాల్ట్ గడియారం చూసుకుని తిట్టుకున్నాడు. కాలం మించిపోతు న్నది. ఒక గంట క్రితమే ప్రయాణం సాగిఉండవలసింది. ఫ్రాన్సోయ్ మళ్ళా బుర్ర గోక్కుని, తల అడ్డంగా ఆడించి, పెరాల్ట్ వంక చూసి పిచ్చినవ్వు నవ్వాడు. తమ అసమర్థతను ఆమోదిస్తూ పెరాల్ట్ భుజాలు ముడిచాడు. ఫ్రాన్సోయ్ లేచి వెళ్ళి, సోల్ వెక్స్ నిలబడిన చోటునుంచి బక్ ను పిలిచాడు. బక్ నవ్వింది, కాని దగ్గిరికి రాలేదు. ఫ్రాన్సోయ్ సోల్ వెక్స్ పగ్గాలు విప్పి దాని పాతస్థానానికి తీసుకుపోయి పెట్టాడు. ఇప్పుడు కుక్కలబారు పూడింది, బక్ ను కడితే కుక్కలన్నిటికీ ముందే కట్టాలి. ఫ్రాన్సోయ్ బక్ ను మళ్ళీ పిలిచాడు. బక్ నవ్విందిగాని కదలలేదు.

"ఆ దుడ్డుకర్ర అవతల పడెయ్యి!" అన్నాడు పెరాల్ట్

ఫ్రాన్సోయ్ ఆ పని చెయ్యగానే బక్ విజయగర్వంతో నవ్వుతూ ముందుకువచ్చి, కుక్కలన్నిటికీ అగ్రస్థానంలో నిల బడింది. దానికి పగ్గాలు కట్టినాక స్లెడ్జ్ బయలుదేరింది. మనుషు లిద్దరూ పరిగెత్తసాగారు.

బక్ ను గురించి ఫ్రాన్సోయ్ కి ముందుగానే ఘనమైన అభిప్రాయం ఏర్పడిన మాట నిజమేగాని, త్వరలోనే అత నికి దానివిలువ తానూహించిన దానికంటెకూడా ఎక్కువే నని తెలిసివచ్చింది. అది నాయకత్వపు బాధ్యతలను మొదటి క్షణంనుంచీ నిర్వర్తించటమేగాక, సత్వర నిర్ణయాలు చెయ్య

టంలో, సత్వర చర్యలు తీసుకోవటంలో, కర్తవ్య నిర్ణయంలో అది స్పిట్జ్‌కన్న చాలా మెరుగనిపించింది. స్పిట్జ్‌ను నాయకత్వంలో మించే కుక్క ఉండదని ఫ్రాన్సోయ్ అనుకుంటూండేవాడు.

కాని బక్‌లో ఉన్న అసలు గొప్పతనం ఇతర కుక్కలను శాసించటంలోనూ, తన శాసనాన్ని అమలుజరపటంలోనూ స్పష్టమయింది. నాయకత్వంలో జరిగిన మార్పును డేవ్‌గాని, సోల్ వెక్స్‌గాని అభ్యంతరం చెప్పలేదు. వాటికా విషయం పట్టనేలేదు. వాటిపని శ్రమపడి లాగటంమాత్రమే. ఆ వెట్టిచాకిరి చెయ్యటంలో తభాసకు రానంతకాలమూ మరి ఏది ఎలాపోయినా వాటికి ఒకటే. క్రమశిక్షణకు విఘ్నం కలగకుండా వుంటే, నోట్లో నాలుక లేని బిల్లీ నాయకత్వం వహించినా వాటికి సమ్మతమే. పోతే, మిగిలిన కుక్కలు కొద్దిరోజులుగా స్పిట్జ్‌ను ధిక్కరిస్తూ వచ్చాయి, ఇప్పుడు బక్ తమను తీవ్రంగా దండించ సాగేసరికి వాటికి ఆశ్చర్యం కలిగింది.

పైక్ ఏనాడూ బలమంతా పెట్టి లాగి ఎరగదు, అది పని మహా ఠలాయించేది. అటువంటిది బక్ నాయకత్వం కిందికివచ్చిన మొదటిరోజు ముగిసేలోపలనే తన జన్మలో ఏనాడూ పడనంత శ్రమపడి లాగింది. స్పిట్జ్ చేత ఎన్నడూ శిక్షపొందని జో మొదటిరాత్రి మజిలీలో బాగా తాపులు తిన్నది. బక్ తనబరువు ఆసరాచూసుకుని దాన్ని దండించ సాగేసరికి జో దాన్ని కరిచే ప్రయత్నాలు కట్టిపెట్టి కుంయోమని కాళ్ళబేరానికి దిగింది.

కుక్కలలో చురుకూ, వెనకటి ఐక్యతా తిరిగి కని పించాయి. మళ్ళీ ఒకే కుక్క లాగుచున్న వైఖరి కన బడింది. "రింక్ రాపిడ్స్" (Rink Rapids) అనేచోటు చేరాక మరి రెండు ఎస్కిమో కుక్కలువచ్చి చేరాయి. వాటి పేర్లు "టీక్", "కూనా". ఒక్కక్షణంలో బక్ ఆ రెంటినీ దారికి తీసుకురావటం చూసి ఫ్రానోస్వాయ్ నిర్ఘాంతపోయాడు.

"ఈ బక్‌లాటి కుక్కను ఎన్నడూ చూడలేదు, ఎన్నడూ! అది నిజంగా వెయ్యిడాలర్లు చేస్తుంది. ఏమం టావ్, పెరాల్ట్?" అన్నాడతను.

పెరాల్ట్ అవునని తల ఆడించాడు. ప్రయాణం ఇప్ప టికే ఎన్నడూ జరగనంత చురుకుగా జరిగింది. ఆ రోజు కా రోజు గడిచిన కొద్దీ ప్రయాణకాలం ఇంకా ఆదా అవు తున్నది. దారికూడా గట్టిపడి చక్కగా ఉంది. కొత్తగా మంచుపడక పోవటంమూలాన శ్రమఏమీ లేదు. చలికూడా అట్టేలేదు. మంచు చలికి యాభై డిగ్రీలు కిందుగా నిలిచి ఉన్నది. మనుషులు వంతులుచొప్పున కాస్సేపు స్లెడ్జిలో ఎక్కి, కాస్సేపు పరిగెత్తారు. కుక్కలుమాత్రం ఎప్పుడో తప్ప నిలవటమన్నది లేదు.

"ముప్పైమైళ్ళ నది" పైనమంచు మందంగా ఉంది. వెళ్ళేటప్పుడు పదిరోజులు పట్టిన ప్రయాణం వచ్చేటప్పుడు ఒక్కరోజు మాత్రమే పట్టింది. ఈ ప్రాంతంలో అరవైమైళ్ళ పాటు ఎక్కడా ఆగకుండా ప్రయాణించారు, సరస్సుల

వెంబడి డెభై మైళ్ళదూరం నడక ఎంతవేగంగా సాగిం దంటే, స్లెడ్ వెనక ఉండి తోసేమనిషి, సుఖంగా స్లెడ్ తాడుపట్టుకుని మంచుపై జారుతూ వెళ్ళాడు. రెండోవారం ఆఖరురాత్రి వారు తెల్లకనుమ (White Pass) ఎగువనుంచి స్కాగ్వే గ్రామం తాలూకు దీపాలూ, పడవల రేవూ ఉండే సముద్రతీరానికి దిగారు.

అంత శీఘ్ర ప్రయాణం పూర్వం ఎవరూ చేసి ఉండ లేదు. సగటున రోజుకు నలభైమైళ్ళ చొప్పున పద్నాలుగు రోజులు ప్రయాణించారు. మూడురోజులపాటు పెరాల్ట్, ఫ్రాన్సోయ్ లు స్కాగ్వే పెద్దవీధివెంట రొమ్ములు విరుచుకు తిరిగారు. అందరూ వారిని తాగటానికి ఆహ్వానించేవారే. ఇక కుక్కలను గురించి అక్కడివాళ్ళు విస్తారంగా చెప్పు కున్నారు. ఇంతలో రామాయణంలో పిడకల వేటలాగా ముగ్గురు నలుగురు "పడమటి"వాళ్ళు ఆ ఊరును దోచుకో వాలని యత్నించి కాల్చి చంపబడ్డారు. ఈ విస్తారం అయి పోయాక పెరాల్ట్, ఫ్రాన్సోయ్ కు కొత్త ఉత్తరువులు వచ్చాయి. ఫ్రాన్సోయ్ బక్ ను చేరదీసి కావిలించుకుని ఏడి చాడు. అంతటితో బక్ కూ, ఫ్రాన్సోయ్ పెరాల్ట్ లకూ ఋణం తీరిపోయింది. ఇతరులలాగే వారుకూడా బక్ జీవితంనుంచి నిష్క్రమించారు.

ఇప్పుడు బక్ మిగిలిన కుక్కలతో సహా ఒకస్కాట్ సంకరజాతివాని అధీనమయింది. ఈ కుక్కలజట్టు మరొక అరడజను జట్లుతో సహా కదిలి మళ్ళా డాసన్ దారి పట్టింది. ఈ సారి ప్రయాణం సుఖంగా గాని, వేగంగా గాని సాగలేదు,

బరువు చాలా జాస్తి, లాగే శ్రమకూడా జాస్తి, ఈ బళ్ళు తపాలాబళ్ళు, ఉత్తరధృవ ప్రాంతంలో బంగారాన్ని అన్వేషించే వారికి ఉత్తరాలు వగైరా చేరవేస్తున్నాయి.

బక్ కు ఈ ప్రయాణం బాగా లేదు. అయినా అది, డేవ్ లాగా, సోల్ వెక్స్ లాగా తన పనిని అతిశయంతో కొనసాగించింది. అవి పనిదగ్గర ఒళ్ళుదాచుకోవు. ఈ ప్రయాణంలో కొత్తదనం ఏమీ లేదు; అంతా యంత్రంలాగా జరిగిపోతున్నది. ఒకరోజులాంటిదే ఇంకోరోజుకూడా. ప్రతిఉదయమూ వేళ తప్పకుండా వంటవాళ్ళు నిద్రలేచి, వంటలు చేస్తారు. భోజనాలు అవుతాయి. తరవాత ఒక్కొక్క జట్టే జీనులు తగిలించుకుని బయలుదేరేది. అరుణోదయానికి ఒక్కగంట ముందే ప్రయాణం ఆరంభమయేది. రాత్రివేళ మజిలీ వేసే వాళ్ళు. కొందరు డేరాలు అమర్చేవారు, కొందరు వంట చెరుకూ, పక్కలుగా పరుచుకోవటానికి దేవదారుమండలూ తెచ్చేవారు, మరికొందరు వంటకు నీరుగాని మంచుగాని తెచ్చేవారు. కుక్కలు తిండితినేవి, కుక్కలకు రోజంతటికీ ఇదే విశేషం. అయితే చేపలు ఆరగించినాక ఇతర కుక్కలతో ఒక్క గంటపాటు ఆడుకోవటంకూడా సరదాగానే ఉండేది. కుక్కలన్నీ కలిసి నూటికిపైగా ఉండేవి. వాటిలో కొన్ని పోగరుబోతులుకూడా ఉండేవి. అయితే మూడు భయంకరమైన పోట్లాటలతో బక్ అన్నిటిపైనా తన ఆధిపత్యం ప్రతిష్ఠించుకో గలిగింది. ఆ తరవాత అది బొచ్చు దులిపి, కోరలు చూపిస్తే చాలు ఏ కుక్క అయినా పక్కకు తప్పుకునేది.

బక్‌కు అన్నిటికన్నా ఎక్కువ ఇష్టమైన దేమంటే, వెనకకాళ్ళు ముడుచుకుని. ముందుకాళ్ళు చాచుకుని, తల పైకెత్తి చలిమంటపక్కన కూచుని, మంటల్లోకి చూస్తూ కలలుగనటం. ఎప్పుడైనా దానికి శాంటాక్లారా లోయలోని జడ్జ్ మిలర్ భవనమూ, సిమెంటుతో కట్టిన స్నానాల గుంటా, ఇజబెక్, టూట్స్ మొదలైనవి జ్ఞాపకం వచ్చేవి. కాని అంతకన్న తరుచుగా దానికి ఎర్రస్వెటర్ వాడూ, కర్లీ దుర్మరణమూ, స్పిట్జ్‌తో పోరాటమూ, దానికిష్టమైన ఆహార పదార్థాలూ జ్ఞాపకం వచ్చేవి. అది ఇంటివారితో బాధ పడటం లేదు. ఎండగల దేశం (దక్షిణ ప్రాంతం) దానికి అస్పష్టంగా జ్ఞాపకం వచ్చేది, జ్ఞాపకంవచ్చి దానిని బాధించేది కాదు. అంతకుపూర్వం ఎరగని విషయములు, తరతరాలకు అది చెందిన స్మృతులు దానికి మరింత ప్రస్ఫుటంగా జ్ఞాపకం వచ్చి, తెలిసిన సంగతులేనన్న భ్రమ జనింపజేసేవి. సహజ బుద్ధులు (అంటే దాని తత్వంలో జీర్ణించుకుపోయిన దాని పూర్వీకుల జ్ఞాపకాలు) మధ్యకాలంలో అంతరించిపోయి తిరిగి బక్‌లో చైతన్యం పొంది చిగిర్చాయి.

ఒకొక్కప్పు డది మంటముందుకు పడుకుని జ్వాలల కేసి చూస్తూంటే, ఆ మంట మరొకమంట అయినట్టూ, ఆ మరోమంట పక్కన ఈ సంకరజాతి వంటవాడు కాక మరొకమనిషి ఉండినట్టూ స్ఫురించేది. ఆ ఇంకోమనిషికి కాళ్ళుపొట్టీ, చేతులు పొడుగూనూ; వాడి కండరాలు గుండ్రంగా, ఉబికి వచ్చేవిగా కాక గట్టిగా, నిడుపుగా, ముడి తేలి వుండేవి. వాడిజుట్టు దీర్ఘంగా అట్టలు కట్టుకుపోయి

వుండేవి. వాడి నుదురు కళ్ళకు ఎగువనుంచి వెనక్కి తోసుకుని జుట్టులోకి పోయేది. వాడు నోటితో వింతశబ్దాలు చేసేవాడు. చీకటిని చూస్తే భయపడేవాడు. మోకాలికీ పాదాలకూ మధ్యదాకా వేళ్ళాడే చేతిలో, చివర బరువైన రాయి కట్టిన కర్ర ఒకటి పట్టుకుని, అస్తమానం చీకటిలోకే చూపు నిగుడ్చుతూండేవాడు. వాడు దాదాపు దిగంబరుడు, వాడివీపున సగంవరకు చినిగిపోయి మంటలో కాలిన చర్మం ఒకటి వేళ్ళాడుతూ వుండేది. అయితే వాడి శరీరంనిండా దట్టంగా రోమాలుండేవి. కొన్నిచోట్ల, ముఖ్యంగా రొమ్ము మీాదా. భుజాలమీాదా, చేతుల వెలపలి భాగంలోనూ, తొడల వెలపలా ఈ రోమాలు చాలా దట్టంగా, బొచ్చు లాగా వుండేవి. వాడు నిటారుగా నిలబడిలేక, నడుము పై భాగం ముందుకువంచి నిలబడేవాడు. వాడి మోకాళ్ళు వంగి వుండేవి. వాడిశరీరం చలాకీగా. దాదాపు పిల్లిశరీరాన్ని బోలిన కదలిక కలదై వుండేది. అనుక్షణం అపాయాన్ని ఎదుర్కొనేవాడిలాగా వాడు చాలా చురుకుమీాద ఉండే వాడు.

అప్పుడప్పుడూ ఈ బొచ్చుశరీరంగల మనిషి మంట దగ్గర కూచుని తన తలను కాళ్ళసందున పెట్టుకుని, మోచేతులు మోకాళ్ళపై ఆనించి, హస్తాలు నెత్తిన పెట్టుకుని నిద్ర పోయేవాడు. మంటకు అవతలగా ఉన్న చీకటిలో బక్కు నిప్పుకణికలు రెండేసి రెండేసిగా మెరుస్తూ కనిపించేవి. ఈ నిప్పుకణికలు ఘాతుకమృగాల కళ్ళని బక్కు తెలుసు. అవి రాత్రివేళ పొదలమధ్యగా కదులుతుంటే అయ్యేచప్పుడు

బక్‌కు వినపడేది. బక్ యూకాన్ నది ఒడ్డున మంటలకేసి మత్తుగా చూస్తూ, గతకాలపు ఈ దృశ్యాలనూ, శబ్దాలనూ కలవరించేటప్పుడు, దానివీపునా, భుజాలమీదా, మెడ మీదా ఉండే జూలు నిక్కబొడుచుకునేది; అది మూలిగేది, లేదా చిన్నగా గుర్రుమనేది. అప్పుడు సంకరజాతి వంట వాడు, "ఏయ్, బక్, మేలుకో!" అని కసిరేవాడు. వెంటనే మరొక ప్రపంచం అదృశ్యమై దానికళ్ళకు వాస్తవప్రపంచం కళ్ళబడేది. అది నిద్రమేల్కొన్న దానిలాగా లేచినిలబడి, ఆవలించి, ఒళ్ళు విరుచుకునేది.

ఈ టపా చేరవేయటం పని చాలా గడ్డుపని అయింది. కుక్కలన్నీ చిక్కి, ప్రాణాలుసగం చచ్చి డాసన్ చేరు కున్నాయి. వాటికి అధమం వారం, పదిరోజుల విశ్రాంతి ఉండవలిసింది. కాని రెండురోజులకే అవిమళ్ళీ టపా తీసు కుని తిరుగు ప్రయాణంమీద బయలుదేరాయి. అసలే కుక్కలు అలిసి పోయివుండి, మనుషులు విసుగుచెంది ఉంటే విడవకుండా మంచుపడటం సాగించింది. మంచుమూలంగా దారి మెత్తగా ఉంటుంది, స్లెడ్ బాగా నడవదు. కుక్కలు మరింత శ్రమపడి లాగాలి. అయితే మనుషులు కుక్కలపట్ల చాలా బాగా ప్రవర్తించి వాటికి చూపవలసినంతదయ చూపారు.

ప్రతిరాత్రీ మజిలీలో ముందు కుక్కల అవసరాలే చూసేవారు. కుక్కలు తిన్నాకనే వాళ్ళు తినేవాళ్ళు. కుక్కలకాళ్ళు పరీక్ష చెయ్యకుండా నిద్రపొయ్యేవారు కారు. అయినా కుక్కలబలం క్షీణించసాగింది. చలికాలం ఆరంభ

మయాక అవి పద్దెనిమిది వందలమైళ్ళు నడిచాయి. అంత దూరమూ స్లెడ్‌లను లాగాయి. ఎంతబలంగల కుక్కకైనా పద్దెనిమిదివందల మైళ్ళు మాటలుకాదు. బక్ కూడా అలిసి పోయింది. అయినా అవి పనికి తట్టుకోవటమే గాక తన జట్టులో ఉండేకుక్కల క్రమశిక్షణను కూడా కాపాడింది. బిల్లీ ప్రతిరాత్రి నిద్రలో మూలిగి ఏడిచేది. జో చాలా చిరాకు కనబరిచింది. సోల్‌లెక్స్‌ను ఇప్పుడు గుడ్డికన్ను వేపు నుంచి కాదుగదా, ఎటునుంచీ సమీపించటానికి లేకుండా వుంది.

కాని అన్నింటికన్న ఎక్కువబాధ పడినది డేవ్. దానికేదో వచ్చింది. దానికి గుబులూ, చిరాకూ జాస్తి అయాయి. మజిలీ వెయ్యటమే ఆలస్యంగా అది గుంటచేసుకొని అందులో పడుకునేది. దానిఆహారాన్ని అక్కడికి తెచ్చి దానికి అందివ్వ వలసి వచ్చేది. జీను విప్పగానే అది కాళ్ళుముడుచుకు పడుకుని, మర్నాడు మళ్ళీ జీను తగిలించేదాకా, కాళ్ళమీద నిలబడేదికాదు. దారిలో స్లెడ్ అకస్మాత్తుగా ఆగినప్పుడూ, దాన్ని బయలుదేరదీయటానికి బలంగా లాగవలసివచ్చినప్పుడూ డేవ్ బాధతో అరిచేది. స్లెడ్ తోలే డ్రయివరు దాన్ని జాగ్రత్తగా పరీక్షించి కూడా దోషం ఏమీ తెలుసుకోలేకపోయాడు. మిగిలిన డ్రయివర్లుకూడా దాన్నిగురించి శ్రద్ధ తీసుకుని, భోజనాలు చేసేటప్పుడు మొదలుకొని పైప్‌లు కాల్చుకుని పడుకునేదాకా ఆ విషయమే మాట్లాడుకొనేవారు. ఒకరాత్రి వారు దీన్నిగురించి సమాలోచన జరిపారు. వారు డేవ్‌ను పడుకున్న చోటినుంచి చలిమంట దగ్గ

రికి తెచ్చి దాని శరీరమంతా నొక్కి చూశారు. కొన్నిసార్లు అది ఏడ్చినాక దానిలో అవయవాలకు జబ్బుచేసి ఉండా లని నిర్ణయించారు. ఎందుచేతనంటే దాని ఎముకలన్నీ సరిగానే ఉన్నాయి, ఒకటీ విరగ లేదు.

వారు "కాసియార్ బార్" (Cassiar Bar) వద్దకు చేరేసరికి డేవ్ చాలా బలహీనమైపోయింది. దారివెంబడి అది ఎన్నోసార్లు కూలబడింది. స్కాట్ సంకరజాతివాడు మధ్యదారిలో స్లెడ్ నిలిపి డేవ్‌ను తొలిగించి దాని స్థానంలో సోల్ వెక్స్‌ను స్లెడ్‌కు కట్టాడు. డేవ్ శ్రమ లేకుండా స్లెడ్ వెనకగా పరిగెత్తుతుందని అతని ఉద్దేశం. కాని తనను విప్పి, తన స్థానంలో సోల్ వెక్స్‌ను కట్టటం దానికి ఎంతమాత్రమూ ఇష్టంలేదు. ఆ స్థానం దానిది. ఎంతకాలంగా తాను ఆక్ర మించిన స్థానం ఇంకొక కుక్కకు వెళ్ళటం దానికి చాలా అవమానమయింది. ఒకచెంప చూస్తూకూడా అది జీనువిప్పి టప్పుడు ఏడుపు లకించుకున్నది.

స్లెడ్ తిరిగి నడక సాగించినప్పుడది గట్టిపడిన దారి ప్రక్కన ఉన్న మెత్తని మంచులో తడబడే కాళ్ళతో పరి గెత్తుతూ, సోల్ వెక్స్‌ను కరవసాగింది, దాన్ని దారికి అవతలి ప్రక్కన ఉన్న మెత్తటి మంచులోకి నెట్టటానికి ప్రయత్నిం చింది, స్లెడ్‌కూ సోల్ వెక్స్‌కూ మధ్యగా పగ్గాలలో దూరాలని చూసింది; ఇన్ని చేస్తూ అది ఒక వంక బాధతోనూ, మరొక వంక దుఃఖంతోనూ ఏడుస్తూనే ఉంది. దాన్ని అవతలకి వెళ్ళగొట్టటానికి డ్రయివరు కొరడాతో కొట్టాడు. కాని కొరడాదెబ్బను అది లక్ష్యపెట్టలేదు; గట్టిగా కొట్టటానికి

వాడికి గుండె చాలలేదు. నిజానికి స్లెడ్ వెనకగా గట్టిపడిన దారివెంట నడవటం డేవ్‌కు చాలా సుఖం, అయినా అది ఎంతో కష్టపడి మెత్తని మంచులో తడబడుతూ పరిగెత్తి పరిగెత్తి చివరకు సొమ్మసిల్లి పడిపోయింది. అది తిరిగి లేవలేక దీనంగా ఏడుస్తూ, తన పక్కగా వెళ్ళే ఒక్కొక్క స్లెడ్‌నూ దాటిపోనిచ్చింది.

తరవాత అది ఎలాగో ఓపిక తెచ్చుకుని స్లెడ్‌ల వెనకగా వచ్చింది. స్లెడ్‌లు ఆగినాక అది దారిపక్క మంచులో పడుతూ లేస్తూ తన స్లెడ్ దగ్గరికి చేరుకుని సోల్‌లెక్స్ పక్కన నిలబడింది. డ్రయివరు ఒక్క క్షణంపాటు వెనక్కు వెళ్ళి తన పైప్ వెలిగించుకోవటానికి వెనకఉన్న వాడివద్ద నిప్పు తీసుకుని, మళ్ళీవచ్చి కుక్కలను బయలుదేర దీశాడు. కుక్కలు అతిసునాయాసంగా ముందుకువెళ్ళి, వెనక్కుచూసి ఆశ్చర్యపోయాయి. కుక్కలు కదిలాయిగాని స్లెడ్ కదలలేదు. ఏం జరిగినదీ తెలుసుకుని డ్రైవరు నిర్ఘాంతపోయి, మిగిలిన డ్రయివర్లను పిలిచి వారికి వింత చూపించాడు. డేవ్ సోల్‌లెక్స్‌కు కట్టిన పగ్గాలు కొరికి, దానికీ స్లెడ్‌కూ మధ్య ఉండే తన మామూలుస్థానంలో నిలబడి వున్నది!

"నన్ను ఇక్కడే ఉండనియ్యి" అని బతిమాలుతూ వున్నట్టుగా అది డ్రయివరు కేసి చూసింది. ఏం చెయ్యాలో డ్రయివరుకు పాలుబోలేదు. డ్రయివర్లు కుక్కలను గురించి వింతవిషయాలు చెప్పుకున్నారు. ఈ కుక్కలు, తమను క్రమంగా తినేస్తున్నపనే అయినా అది తమకు లేకుండాచేస్తే

బక్కు పూర్వ స్మృతులు తిరిగి మోసులెత్తినాయి.

మనోవ్యాధి పడతాయి. కొన్ని ముసలికుక్కలను లాగలేవని పనిమానిపిస్తే కృశించి చచ్చాయట. డేవ్ ఎలాగూ చావక తప్పదు. అది దిగులుపడి చచ్చేకన్న, స్లెడ్ లాగుతూ తృప్తిగా, సుఖంగా చావటమే మెరుగని అందరూ భావించారు. అందుచేత దానిని మళ్ళా స్లెడ్ కు యథాప్రకారం పూన్చారు అది గర్వంతో స్లెడ్ ను మళ్ళీ లాగసాగింది. కాని మధ్య మధ్య ఏదో బాధ వచ్చి అది అప్రయత్నంగా అరిచింది. అది చాలాసార్లు కూలబడి దారివెంట ఈడ్చబడింది. ఒక సారి స్లెడ్ దానిమీదిగా వెళ్ళింది. ఆ తరవాత దానివెనక కాళ్ళలో ఒకటి కుంట నారంభించింది.

అయినా అది అలాగే మజిలీదాకా లాగింది. డ్రయివరు దాన్ని చలిమంట దగ్గిరిగా పడుకోబెట్టాడు. మర్నాడు బయలుదేరే వేళకది కదిలే స్థితిలో లేదు. మిగిలిన కుక్కలకు జీను తొడిగేటప్పుడది డ్రయివరు దగ్గిరికి దేకటానికి ప్రయత్నించింది. అతిప్రయత్నంమీద అది కాళ్ళమీద లేచినిలబడి, తూలి, మళ్ళీ కిందపడింది. తరవాత అది ముందు కాళ్ళు చాస్తూ, మిగిలిన శరీరాన్ని ముందుకు ఈడ్చుతూ, మళ్ళీ ముందుకాళ్ళు కొంచెం చాస్తూ అతిప్రయాసతో కుక్కలకు జీను అమర్చే చోటికి చేరుకున్నది. దానిపని అయిపోయింది. అది మంచులో పడుకుని రొప్పుతూ, మిగిలిన కుక్కలకేసి ఆశగా చూస్తూంటే స్లెడ్లు బయలుదేరి పోయాయి.

అవి ఒక చెట్లగుంపు చాటుకు వెళ్ళి ఆగాయి. సంకర జాతివాడు నెమ్మదిగా నడుచుకుంటూ తాము మజిలీచేసిన

చోటికి తిరిగివెళ్ళాడు. మిగిలిన డ్రయివర్లు మాట్లాడటం మానేశారు. రివాల్వరు పేలినచప్పుడు వినపడింది. వెళ్ళిన వాడు త్వరత్వరగాతిరిగివచ్చాడు. కొరడాలుఛెళ్ళుమన్నాయి. మువ్వలు గలగల లాడాయి. స్లెడ్‌లు దారివెంట దాడుతీయ సాగాయి. కాని చెట్లగుంపు చాటున ఏమిజరిగినదీ బక్‌కు తెలుసు, మిగిలిన కుక్కలకు కూడా తెలుసు.

# 5

## వెట్టిచాకిరి

డాసన్‌నుంచి బయలుదేరిన ముప్పైరోజులకు టపా స్కాగ్వే చేరింది. బక్ కుక్కల జట్టులాగే స్లెడ్ వెనకాతలే మిగిలినవికూడా గమ్యస్థానం చేరాయి. కుక్కలన్నీ డస్సి, కుంగి, కృశించి దీనస్థితిలో ఉన్నాయి. నూటనలభై పౌను లుండే బక్ నూటపదిహేను పౌనులయింది, మిగిలిన కుక్కలు దానికన్న తేలికవి అయినా, వాటి బరువుకు అవి బక్‌కన్నా తీసిపోయాయి. దానిజీవిత మంతా దొంగయెత్తులు వెయ్యటం లోనే గడిపి ఎన్నోసార్లు ఉత్తినే కుంటిన పైక్ ఇప్పుడు నిజం గానే కుంటుతున్నది. సోల్ వెక్స్‌కూడా కుంటుతున్నది. డబ్ భుజం ఎముకతొలిగి బాధపెడుతున్నది.

అన్నిటికీ పాదాలు వాచాయి. నేలకేసి అదిమితే బంతిలాగా పైకితన్నే ఆ పాదాలు, ఇప్పుడు దారిపైన బరువుగా పడి, కుక్కల శరీరాలు కుదిసి, రెట్టింపు శ్రమచేస్తున్నట్టనిపించింది. అలుపుతప్ప వాటికి మరొకజబ్బు ఏమీ లేదు.

అది కొద్దిసేపట్లో చాలాపని చెయ్యటంవల్ల కలిగే తాత్కాలికమైన అలుపు కాదు. అలాంటి అలుపు కొద్దిగంటల్లో ఉపశమిస్తుంది. ఇది నెలల తరబడి వెట్టిచాకిరీ చెయ్యటంవల్ల ఏర్పడిన అలసట; దీనినుంచి కోలుకోవటానికి వాటి శరీరాలలో శక్తి లేదు. కుక్కల శరీరాలలోని ప్రతినరమూ, ప్రతి కండరమూ, ప్రతి జీవాణువూ పూర్తిగా డస్సిపోయింది. దీనికి కారణమేమంటే, అవి అయిదుమాసాల కాలంలో ఇరవై అయిదువందల మైళ్లు ప్రయాణించాయి. గడిచిన పద్ధెనిమిది వందలమైళ్ళ ప్రయాణంలోనూ అవి విశ్రాంతి తీసుకున్నది అయిదురోజులు మాత్రమే. అవి స్కాగ్వే చేరేసరికి తమ కాళ్ళమీద నిలబడలేని స్థితిలో ఉన్నాయి. పగ్గాలు బిగలాగి ఉంచటానికి వాటిశక్తి చాలీచాలకుండా ఉన్నది. పల్లానికి దిగేటప్పుడు స్లెడ్ తమమీదిగా పోకుండా చూసుకోవడమే వాటికి కష్టమయింది.

"ఎలాగో ఈ కాస్త లాగెయ్యండి. ఆ తరవాత కావాలిసినంతకాలం విశ్రాంతి తీసుకుందురు గాని," అని డ్రయివర్లు కుక్కలను ప్రోత్సహించారు.

తమకు చాలారోజులు విశ్రాంతి దొరుకుతుందని డ్రయివర్లుకూడా నమ్మారు. వాళ్లుకూడా పన్నెండువందల మైళ్ళ ప్రయాణంలో రెండురోజులే విశ్రాంతి తీసుకున్నారు. న్యాయంగా వాళ్లు నిష్పూచీగా, తిరిగేటందుకు కొన్ని రోజులు విశ్రాంతి ఉండాలి. కాని అదిఎలా సాధ్యమవుతుంది. క్లాండైక్‌లో బంగారం వేటగాళ్లు చాలామంది చేరారు, వారి భార్యలూ, ప్రియురాళ్ళూ, బంధువులూ

అంతులేని సంఖ్యలో ఉన్నచ్చోటనే ఉండిపోయారు. టపా పాపం పెరిగినట్టు పెరిగిరేది. ఇప్పిగాక ప్రభుత్వ వర్తమానాలు కూడా ఉన్నాయి. ఇక లాగలేని కుక్కలు స్థానం ఆక్రమించటానికి హడ్సన్‌బే (Hudson Bay) నుంచి కొత్త కుక్కలు వచ్చాయి. పనికిమాలిన కుక్కలను అమ్మేసేవారు.

మూడురోజులు గడిచాయి. తాము ఎంతగా నీరసించి పోయినదీ బక్ మొదలైన కుక్కలు తెలుసుకున్నాయి. నాలుగోరోజు ఉదయం ఇద్దరు అమెరికనులు వచ్చి కుక్కలనూ, జీనులనూ చాల చౌకగా కొనేశారు. కొన్నవాళ్ళ పేర్లు "హాల్", చాల్స్". చాల్స్ నడివయసువాడు, తెల్లి రంగుమనిషి: అతనికళ్లు బలహీనంగా ఉండి, ఎప్పుడూ చెమ్మగిల్లేవి అతనిపెదవి వేళ్ళాడబడి ఉండి, మనిషి మెతక వాడనిపించినా, అతనిమీసాలు భీకరంగా పైకి మెలిదిప్పి ఉండేవి. హాల్ పంధొమ్మిది, ఇరవై ఏళ్ళ యువకుడు. అతని బెల్టులో ఒకపెద్ద కోల్టు (Colt) రివాల్వరూ, వేటకత్తీ, తూటాలూ ఉండేవి. అతనిలో కొట్టవచ్చినట్టు కనబడేది ఆ బెల్టే. వాడు వట్టి "పిల్లకాకి" అని ఆ బెల్టుచూస్తే తెలిసి పోయేది. ఆ యిద్దరుకూడా ఆ ప్రాంతంలో ఉండవలిసిన మనుషులు కారని తెలుస్తూనే ఉన్నది. అలాటివాళ్లు ఈ ఉత్తరానికి ఎందుకువచ్చారో ఎవరూ ఊహించలేరు.

బేరం జరగటమూ, డబ్బు చేతులు మారటమూ బక్ గ్రహించింది. పెరాల్ట్, ఫ్రాన్సోయిస్‌లలాగే స్కాచ్ సంకర జాతివాడుకూడా తన జీవితంలోనుంచి నిష్క్రమించు తున్నాడని దానికి అర్థమయింది. బక్‌నూ, మిగిలిన కుక్కలనూ

కొత్త మజిలీస్థలానికి తీసుకుపోయారు. ఈ విడిది బక్‌కు అడ్డ గోలుగా కనబండింది. డేరా సగమే ఎత్తిఉన్నది. తిండిపళ్లాలు ఎంగిలిగా పడిఉన్నాయి. ఎక్కడా శుభ్రమూ క్రమమూ లేదు. అక్కడ ఒక ఆడదికూడా ఉన్నది. ఆమెను మొగవాళ్లు "మర్సిడిస్" (Mercedes) అని పిలిచారు. ఆమె చార్ల్సుకు భార్య, హాల్‌కు అక్క – ఒక చిన్న కుటుంబం.

వాళ్ళు డేరా దించేసి, స్లెడ్ మీద సామాన్లు ఎక్కిస్తుంటే బక్ సంకోచంతో చూసింది. వాళ్ళు ఆ చేసే పని చేతనై చేస్తున్నట్టు లేదు, అందులో వ్యర్థశ్రమ చాలా ఉన్నది. డేరాను వాళ్లు చిన్న చుట్టగా చుట్టలేకపోయారు; ఆ చుట్ట ఉండవలసినదానికి మూడింతలున్నది. పళ్లాలను కడగకుండానే పేర్చిపెట్టేశారు. మర్సిడిస్ మగవాళ్ళకు అడ్డం వస్తూ, "విడవకుండా మాట్లాడుతూ, తప్పులు పడుతున్నది, సలహాలిస్తున్నది. వాళ్ళు బట్టలు సంచీని స్లెడ్ ముందు భాగంలో పెడితే, వెనక పెట్టటం మంచిదన్నది. వాళ్ళు సంచీని తీరా వెనకపెట్టి, దానిపై మరి రెండు మూటలుకూడా ఎక్కించినాక, ఆమె కొన్ని వస్తువులు దిగబడి ఉండటం గమనించి, వాటిని బట్టల సంచీలో తప్ప ఇంకెక్కడా పెట్టటానికి లేదన్నది, చేసేది లేక ఎక్కించిన మూటలు దించారు.

సమీపంలో మరొక డేరాలో ఉంటున్న ముగ్గురు మనుషులు బయటికి వచ్చి వింత చూస్తూ, పళ్ళికిలించి, ఒకరి నొకరు కన్ను మలుపుకున్నారు.

"సామాను చాలా పేర్చారే, మీకు తెలియదని కాదు గాని, నేనైతే ఆ డేరా వెంట మోసుకుపోను" అన్నాడు వారిలో ఒకడు.

"ఇంకా నయం! డేరా లేకుండా ఎలా జరుగుతుంది?" అన్నది మర్సిడిస్, చేతులు నాజూకుగా పైకి ఎరగవేస్తూ.

"వసంతకాలం వచ్చింది. ఇక శీతగాలి కొట్టదు" అన్నాడా మనిషి.

ఆమె తల అడ్డంగా తిప్పింది. చాల్స్, హాల్ కలిసి స్లెడ్‌పై సామాను పేర్చటం పూర్తిచేశారు. అదొక గుట్ట లాగా తయారయింది.

"అది నిలుస్తుందా?" అన్నాడు ముగ్గురిలో ఒకడు.

"నిలవకేం?" అన్నాడు చాల్స్ పౌరుషంగా.

"అంతేలే, అంతేలే!" అన్నాడా మనిషి మంచిగా. "సామాను చాలా ఎత్తుగా పేర్చారేమోననిపించి నాకు సందేహమయింది. అంతకన్న మరేమీ లేదు.

చాల్స్ సామానుతాళ్ళు తనకు చాతనయినట్టుకట్టాడు. అతనికి చేతకాదు.

"ఆ టోపారాన్ని వేసుకుని కుక్కలు హాయిగా రోజల్లా నడుస్తాయి!" అన్నాడు ముగ్గురిలో మరొకడు.

"కాక?" అన్నాడు హాల్ బెట్టుగా. అతను స్లెడ్‌పోలు ఒక చేతపట్టుకుని రెండోచేత్తో కొరడా ఆడిస్తూ, "పదండి పదండి!" అని కుక్కలను అదిలించాడు.

కుక్కలు తమ రొమ్ములపట్టీకేసి బలంగా తోసి, కొద్ది క్షణాల అనంతరం మామూలుగా నిలబడ్డాయి. స్లెడ్‌ను అవి కదల్చలేకపోయాయి.

"సోమరిపోతులు, మీ సంగతి చెబుతానుండండి" అంటూ అతను వాటిని కొరడాతో కొట్టబోయాడు.

"ఊరుకో, హాల్!" అని కేకపెడుతూ, మర్సిడిస్ అడ్డువచ్చి అతని చేతిలోని కొరడా లాగేసుకున్నది. "పాపం, కన్నముండలు! వాటిని ఏమీ చెయ్యనని మాట ఇస్తేతప్ప నే నిక్కడినుంచి కదలనే కదలను!" అన్నదామె.

"నీకు కుక్కల సంగతి ఏమీ తెలీదు, ఊరుకో. అవి వట్టి సోమరిపోతులు, కమ్చీ దెబ్బ తగిలితేగాని చెప్పిన మాట వినవు. వాటి నైజమే అంత. ఎవరి నన్నా అడుగు. ఆ మనుషుల నడుగు" అన్నాడామె తమ్ముడు.

మర్సిడీస్‌కు బాధ అంటే ఉన్న ఏవగింపు యావత్తూ అందమైన ఆమె ముఖాన కనిపిస్తున్నది. ఆమె దీనంగా ఆ మనుషులకేసి చూసింది.

"వాటిలో శక్తి కొంచెంకూడా లేదు. చచ్చేట్టు అలిసిపోయాయి. అంతకంటే మరేమీ లేదు. వాటికి విశ్రాంతి అవసరం" అన్నాడు వారిలో ఒకడు.

"విశ్రాంతి కాదు—" అంటూ హాల్ తిట్టుమాట అన్నాడు. అతని అక్క విచారంతో, "అయ్యో!" అన్నది కాని అంతలోనే ఆమె తమ్ముడిపక్షమై, "ఆ మనిషి చెప్ప

టానికేం లే. కుక్కలనుతోలే పని నీదిగనక నీకు ఎలాతోస్తే అలాగే చెయ్యి" అన్నది.

కుక్కలపైన కొరడా దెబ్బ పడింది. కుక్కలు రొమ్ము పట్టీలకేసి బలంగా తోశాయి. మంచులో కాళ్ళు ఊన్చి ముందుకు వంగి తమ బలాన్నంతా వినియోగించాయి. కాని స్లెడ్ మాత్రం నేలలో కూరుకుపోయినట్టుగా ముందుకు కదలలేదు. ఇలా రెండు ప్రయత్నాలుచేసి తమవల్లకాక కుక్కలు రొప్పుతూ నిలబడ్డాయి. కొరడా ఛెళ్ళుమంటూనే ఉంది. మర్సిడిస్ మరొకసారి అడ్డుపడింది. ఆమె బక్ ముందు మోకరించి, కంట తడిపెట్టుకుంటూ దాని మెడను వాటేసుకున్నది.

"పాపం, కన్నముండలు! గట్టిగా లాగితే మీకు కొరడాదెబ్బ లుండవుగద!" అన్నదామె. బక్ కు ఆ ఆడమనిషి నచ్చలేదు, కాని తానున్న దీనస్థితిలో ఆమెను నిరోధించలేక, అదికూడా తమ బాధాకరమైన నిత్యకృత్యంగా స్వీకరించింది.

వింత చూసేవారిలో ఒకడు పొంగివచ్చే ఆవేశాన్ని ఇంతవరకూ అణిచిపెట్టుకుని ఉండి ఇప్పుడు పైకి అనేశాడు. మీరే గంగలో దూకినా నాకు ఒకటేగాని, కనీసం ఆ కుక్కలకోసం చెబుతున్నాను. మీ స్లెడ్ కమాన్లు మంచులో బిగుసుకుపోయాయి, స్లెడ్ పోలు అటూ ఇటూ గుంజి కమాన్లను మంచు పట్టునుంచి విడిపించండి."

హాల్ స్లెడ్ కమాన్లను మంచునుంచి విడిపించాక అంత సామానుతోనూ స్లెడ్ ముందుకు కదిలింది. కొరడా దెబ్బలవర్షం భరిస్తూ బక్, మిగిలిన కుక్కలూ ప్రయాసతో ముందుకు పోసాగాయి. నూరు గజాల అవతల దారిపక్కకు తిరిగి కిందికి వాలుగా దిగి పెద్ద వీధి చేరుతుంది. అంత ఎత్తున సామాను పేర్చిన ఆ స్లెడ్ పక్కకు పడిపోకుండా చూడటానికి అనుభవంగల మనిషి కావాలి. హాల్‌కు అలాటి అనుభవంలేదు. మలుపు తిరిగే సమయంలో స్లెడ్ పక్కకు పడిపోయింది. సామానులు కట్టిన తాళ్లు వదులుగా ఉండటం చేత సగం సామాన్లు కింద పడిపోయాయి. కుక్కలు ఆగనే లేదు. సగం బరువుతగ్గి పక్కకు ఒరిగిఉన్న స్లెడ్‌ను అవి జరజరా లాక్కుపోయాయి. అంతబరువు వేసినందుకూ, తమను అన్యాయంగా చూసినందుకూ అవి మండిపో తున్నాయి. బక్ కోపం చెప్పనలవికాదు. అది దౌడుతీయ సాగింది. మిగిలిన కుక్కలుకూడా దాని వేగంతో పరిగె త్తాయి. హాల్ "హూ, హూ!" అని అరుస్తున్నా అవి లక్ష్యపెట్టలేదు. అతను కాలు ఊతం తప్పి పడిపోయాడు. స్లెడ్ అతనిమీదిగా పోయింది. కుక్కలు పెద్దవీధి పట్టుకుని పరుగుతీశాయి. స్లెడ్‌లో మిగిలిఉన్న సామాన్లుకూడా వీధి వెంట పడిపోసాగాయి; ఇదంతా ఆరోజు స్కాగ్వే కొక వినోద మయింది.

దారే పొయ్యేవాళ్ళు దయదలిచి కుక్కలను ఆపి, చెదిరి పడిన సామాన్లు ఎత్తి పెట్టారు. వాళ్ళు హితవు కూడా చెప్పారు. ఈ స్లెడ్ సవ్యంగా డాసన్ చేరాలంటే

సామాను సగం తగ్గించాలి. కుక్కలను రెట్టింపు చెయ్యాలి. ఆమదం తాగిన మొహాలతో ఈ సలహా విని హాల్, అతని అక్కా, బావా డేరా దించి తమ సామానునంతా మళ్ళా సర్దారు. అందులో "డబ్బీ సరుకు" (Cannd goods) ఉన్నది. దాన్నిచూసి ప్రేక్షకులు నవ్వారు. ఈ ప్రయాణాలలో అటువంటి పదార్థాలు ఎవరూ తీసుకుపోరు. కంబళీలను చూసి కూడా నవ్వారు. "ఈ కంబళీలు అవతల పారెయ్యండి. ఇందులో సగంకూడా జాస్తే. ఈ డేరా పారెయ్యండి, పళ్ళాలు పారెయ్యండి—వాటి నెవరు కడుగుతారు గనక? మీరేమైనా రైలు ప్రయాణం చేస్తున్నా మనుకుంటున్నారా ఏమిటి?" అన్నాడొకాయన వారికి సహాయం చేస్తూ.

ఇంకేం పనికిమాలిన సామానంతా ఏరి అవతల పారెయ్య సాగారు. వాళ్ళు తన బట్టల సంచీలు కిందపడేసి వాటినుంచి ఒకొక్కక్క వస్తువే అవతల పారేస్తూంటే మర్సిడిస్ శోకాలు పెట్టింది. అన్నిటికీ కలిపి పెట్టే శోకం కాక పారేసే ప్రతి వస్తువుకూ ప్రత్యేకంగా ఒకొక్కక్క శోకం పెట్టింది. ఆమె తన మోకాళ్ళను చేతులతో వాటేసుకుని కొంపంతా పోయినట్టుగా వెనక్కూ, ముందుకూ ఊగింది. చాల్స్ కాదుగదా, అలాటివాళ్ళు డజనుమంది కోసమైనా తాను ఒక్క అడుగు ముందుకు వెయ్యనని శపథం చేసింది. అందరినీ ప్రాధేయపడింది. చివరకు కళ్ళు తుడుచుకుని తనకు అవసరంగా కావలసిన దుస్తులుకూడా తీసి అవతల పారేసింది. ఆ ఉత్సాహంలో తన వస్తువులన్నీ అవతల

పారేశాక తన భర్తనీ, తమ్ముడినీ కూడా గబగబా అవతల గిరవాటు వేసింది.

ఇంతాచేసి సగం సామాను తగ్గించినా ఇంకా బోలెడంత సామాను దిగబడిపోయింది. ఆ సాయంకాలం చార్ల్స్, హాల్ వెళ్ళి ఆరు కుక్కలను కొనుక్కొచ్చారు. జట్టుతో మొదటినుంచీ ఉంటున్న కుక్కలు ఆరూ, మధ్యదారిలో చేరిన టీక్, కూనా, ఇప్పుడు కొత్తగా కొన్న ఆరుకుక్కలూ చేరి పధ్నాలుగు కుక్కలయాయి. కాని కొత్తకుక్కలు ఆటే పనికివచ్చేవి కావు. వాటికేమీ తెలిసినట్టు కనబడ లేదు. వాటిల్లో మూడు కురుచ బొచ్చుగల "పాయింటర్" (Pointer) జాతికుక్కలు, ఒకటి న్యూ ఫౌండ్ లాండ్ (New foundland) కుక్క, మిగిలిన రెండూ సంకరజాతివి. బక్ మొదలైన జట్టు కుక్కలకు వాటిని చూస్తే అసహ్యం వేసింది. బక్ వాటిని అదుపులోకి తెచ్చి ఏంచెయ్యరాదో సులభంగానే నేర్పింది గాని, చెయ్యవలసినపని నేర్పలేక పోయింది. అవి ఒకంతట లాగుడుకు అలవాటు పడ లేదు. సంకరజాతి కుక్కలు రెండూ తప్ప మిగిలిన వాటికి ఆ వాతావరణమే గుబులుపుట్టించింది, మనుషులు పెట్టేకష్టాలు వాటి విచారాన్ని మరింత చేశాయి. సంకరజాతి కుక్కలకు ఏ విచారమూ లేదు. అవి ఎముకల పోగుల్లాగా ఉన్నాయి, అది ఒకటే వాటి విచారం.

కొత్త కుక్కలు బెంగపడి ఉన్నాయి, పాతకుక్కలు ఆగకుండా ఇరవై అయిదువందల మైళ్ళు ప్రయాణంచేసి చెడ బడలి ఉన్నాయి; అందుచేత పరిస్థితి అంత ఆశా జన

కంగా లేదు. అయినా మగవాళ్ళిద్దరూ మంచి ఉషారు మీద ఉన్నారు. దర్జాగా పధ్నాలుగు కుక్కలను లాగు డుకు పెట్టుకున్నామని వారికి గర్వంగాకూడా ఉంది. వారు డాసన్‌కు వచ్చేపోయే స్లెడ్‌లు చాలా చూశారు. ఒక్క దానికీ పధ్నాలుగు కుక్కలు లేవు. అయితే ఉత్తరధృవ ప్రాంతంలో ప్రయాణించేవారు ఒక్క స్లెడ్‌కు పధ్నాలుగు కుక్కలను ఎన్నడూ కట్టగూడదు. ఎందుచేతనంటే పధ్నా లుగు కుక్కల ఆహారం ఒక్క స్లెడ్‌లో పట్టదు. ఈ సంగతి చార్ల్స్‌కుగాని, హాల్‌కుగాని తెలియదు. ఒకరోజుకు ఒక కుక్కకు ఇంత ఆహారమైతే ఇన్ని కుక్కలకు ఇన్ని రోజు లకు ఇంత ఆహారం అని వారు కాగితంమీద చాలా సులువుగా గుణించుకున్నారు. మర్సిడీస్ వాళ్ళు వేసే లెక్కలను చూస్తూ అంతా అర్థమయినట్టు తల ఆడించింది.

మర్నాడు ఉదయం పొద్దెక్కి బక్ మిగిలిన కుక్కలకు దారిచూపుతూ వీధివెంట బయలుదేరింది. బక్‌లోగాని మిగిలిన కుక్కలలోగాని ఏమాత్రమూ చురుకు లేదు. బయలుదేరక ముందే అవి విసిగివేసారి ఉన్నాయి. బక్ ఆదారిన నాలుగు సార్లు తిరిగిఉన్నది. మళ్ళీ అయిదోసారి బయలుదేరటమంటే దానికి విసుగుగా తోచింది. దాని మనసులోగాని, మిగిలిన కుక్కల మనసుల్లోగాని కొంచెమైనా ఉత్సాహం లేదు. కొత్తకుక్కలు చూడబోతే పిరికివి, అవి బెదిరిఉన్నాయి; పాతవాటిని చూడబోతే వాటికి తమ యజమానులలో ఒకొంచెంకూడా నమ్మకం లేదు.

ఆ ఇద్దరు మగవారినీ, ఆడమనిషినీ నమ్ముకుని ప్రయోజనం లేదని బక్‌కు ఎందుకో అనిపించింది. వారికి ఏపని చెయ్యటమూ చాతకాదు, రోజులు గడిచేకొద్దీ వారికి నేర్చుకునే శక్తి లేదనికూడా స్పష్టమయింది. వారు లోల్లీ మనుషులు, క్రమశిక్షణ ఏమీ లేదు. వాళ్ళు రాత్రిళ్ళు ఝామున్నరసేపు శిబిరం ఏర్పాటుచేస్తే అంత అడ్డగోలుగా ఉండేది. ఆ శిబిరం ఎత్తటానికి మర్నాడు ఝామున్నర పట్టేది. వాళ్ళకు స్లెడ్‌పైన సామాను అమర్చటం చేతకాదు. దారిపొడుగునా దాన్ని ఇటూ అటూ సర్దుతూనే ఉండే వారు. ఒక్కొక్కరోజు పదిమైళ్ళకూడా ప్రయాణం సాగేది కాదు, ఒక్కొక్కరోజు అసలు ప్రయాణమే అయేదికాదు. కుక్కల ఆహారం అంచనా కట్టేటప్పుడు రోజుకు ఎన్నిమైళ్లు ప్రయాణం జరుగుతుందని వారు అనుకున్నారో అందులో సగంపైన వారు ఏనాడూ మించలేదు.

కుక్కల ఆహారం చాలకుండా పోవటానికిదే చాలు. దానికితోడు వాళ్ళు కుక్కలకు ఎక్కువ ఎక్కువగా తిండి పెడుతూ ఆహారం కొరత కొనితెచ్చుకున్నారు. కొత్త కుక్కలు తిండిపుష్టిగలవి, వాటికి డొక్కమాడటం అలవాటుకాలేదు. పాతకుక్కలు నీరసంగా లాగుతూండటంచూసి హాల్ వాటికి రెట్టింపుకొలతలు తిండిపెట్టాడు. మర్సిడిస్ కంటతడి పెట్టు కుంటూ తమ్ముడితో "కన్నముండలకు" మరికాస్త పెట్ట మన్నది; అతను వినకపోయేసరికి చేపల బస్తాలలోనుంచి ఆహారం దొంగిలించి చాటుగా కుక్కలకు పెట్టింది. కాని బక్‌కూ, మిగిలిన ఎస్కిమో కుక్కలకూ కావలిసినది తిండి

కాదు, విశ్రాంతి. అవి నింపాదిగానే ప్రయాణం చేస్తున్న ప్పటికీ వల్లమాలిన బరువు లాగుతూన్న కారణంచేత వాటి శక్తి యావత్తూ హరించుకుపోయింది.

ఆతరవాత కుక్కల డొక్కలుపూడే పరిస్థితివచ్చింది. ఒకనాడు హాల్ లెక్కచూచుకుంటే కుక్కల ఆహారం సగం అయిపోయింది. వెళ్ళవలసిన దారేమో నాలుగోవంతే గడిచింది, అందుచేత అతను కుక్కల ఆహారాన్ని తొలి అంచనాకన్న కూడా తక్కువచేసి, ప్రయాణ వేగం హెచ్చించ ప్రయత్నించాడు. అతని అక్కా, బావా ఈ నిర్ణయాన్ని బలపరిచారు. కాని వారివెంటఉన్న విపరీతమైన సామానూ, వారిఅసమర్థతా గొప్ప ప్రతిబంధకాలయాయి. కుక్కల ఆహారం తగ్గించటం చేతిలోఉన్నపనే. కాని వాటిని వేగంగా నడిపించటం వారివల్లకాలేదు. ఉదయం మరికాస్త పెందలాడే బయలుదేరితే ఎక్కువదూరం వెళ్ళవచ్చు, కాని ప్రయాణ సన్నాహం త్వరగా ముగించటం వారికి చచ్చినా చేతకాలేదు. కుక్కలను నిభాయించటం చేతకాకపోవ టానికి తోడు వారికి తమను నిభాయించుకోవటమే చేత కాలేదు.

తరవాత కుక్కలు ఒకటొకటిగా చావసాగాయి. మొదట పోయినది డబ్. అది దొంగతనాలుచేస్తూ, బయట పడుతూ, తన్నులు తింటూకూడా పని చక్కగా చేసేది. కాని జబ్బుచేసిన దాని భుజం కీలుకు చికిత్సగాని, విశ్రాంతి గాని లేక అది నానాటికీ దిగనాసిల్లసాగింది. చివరకు హాల్

దాన్ని తన రివాల్వరుతో కాల్చి చంపేవాడు. ఎస్కిమో కుక్కలు బతకటానికి చాలే ఆహారం బయటికుక్కలు చావటానికి సరిపోతుందని ఆ ప్రాంతాల ఒక సామెత ఉన్నది. ఎస్కిమోకుక్కలకు సరిపోయే ఆహారంలో సగమే తినటం మూలాన కొత్తకుక్కలు క్రమంగా చావసాగాయి. ముందు న్యూఫౌండ్‌లాండ్ కుక్క చచ్చింది. తరవాత పాయింటర్ కుక్కలు మూడూ చచ్చాయి చివరకు చచ్చినవి సంకర జాతివి.

ముగ్గురు మనుషులకూ ఈసరికి దక్షిణాది నాగరికత యావత్తూ తుడిచిపెట్టుకు పోయింది. ఉత్తరధృవ ప్రాంతంలో ప్రయాణించటంలో వారు ఊహించిన సౌందర్యంగాని ఆకర్షణగాని ఏమీ లేకపోగా వారికి చాలా కర్కశంగా కనిపించింది. మర్సిడిస్ కుక్కలకోసం ఏడవటం మానేసి, అచ్చగా తనకోసమే ఏడుస్తూ తమ్ముడితోను, భర్తతోను కీచులాడసాగింది. ఇప్పుడు వారు ముగ్గురికీ ఓపికమిగిలింది కీచులాడటానికే. వ్యధమూలంగా కలిగిన చిరాకు వ్యధతో పాటు పెరిగి, క్రమంగా ఆ వ్యధకుదాటి అందకుండా పెరిగి పోయింది. ఈ ప్రయాణాలు చేసేవారు అంతులేని శ్రమ పడతారు, కష్టాలు భరిస్తారు. అయినా దయగా, ఆర్తిగా మాట్లాడతారు; వారి ఓర్పు ఈ ముగ్గురిలో ఏకోశానా లేదు. అలాంటి సహనండుంటుందనికూడా వీరికి తెలియదు. బాధతో వారు బిగుసుకుపోయారు. వారి కండరాలూ, ఎముకలూ, హృదయాలూ తీపుపెట్టాయి. అందుకని వారు తీవ్రంగా

మాట్లాడుతూ ఉదయం లగాయతు రాత్రిదాక క్రూరమైన మాటలనే ఉచ్చరించసాగారు.

మర్సిడిస్ అవకాశం ఇచ్చినప్పుడల్లా చార్ల్స్, హాల్ కీచులాడుకునేవాళ్ళు. ఎవరిమటుకు వారికి తాను ఎక్కువగా శ్రమపడుతున్నానని గట్టి నమ్మకం. ఈ సంగతి ఇద్దరూ దాచ యత్నించలేదు. అవకాశం దొరికినప్పుడల్లా పైకి అంటూనే ఉండేవారు. మర్సిడిస్ ఒకసారి భర్తపక్షమూ, మరొకసారి తమ్ముడి పక్షమూ అయి, మంచి రక్తి అయిన కొట్లాటకలహానికి దోహదం చేసేది. వంటచెరుకు పేళ్లు వెయ్యటం హాల్ పనా, చార్ల్స్ పనా అన్న దానితో ఆరంభమైన తగాదా క్రమంగా పెరిగి, అందులోకి తల్లులూ, తండ్రులూ, పినతండ్రులూ, పెత్తండ్రులూ, వారి సంతానమూ, ఎక్కడో వెయ్యేసిమైళ్ళ దూరాన ఉన్న వాళ్ళూ, చచ్చిపోయినవాళ్ళూ సయితం వచ్చేవాళ్లు. కళలనుగురించి హాల్‌కుగల అభిప్రాయాలకూ, అతని మేనమామ రాసిన సాంఘిక నాటకాలకూ కట్టెలు పేళ్ళు వెయ్యటంతో ఏమి సంబంధమో ఎవరూ ఊహించలేరు. కాని పోట్లాట అలా పరిణమించేది. లేదాఅందులోకి చార్ల్స్ రాజకీయ ద్వేషాలు ప్రవేశించేవి. నిప్పుచెయ్యటంగురించి ఆరంభమైన చర్చలోకి మర్సిడిస్‌చార్ల్స్ చెల్లెలు తంపులమారితనాన్ని తెచ్చేది, ఆ విషయం తనకుగల అభిప్రాయాలన్నీ అప్పుడే వెళవుపెట్టేది, తన మొగుడివైపు బంధువుల నందరినీ ఒక్కసారి దులిపేసేది. ఈ తగాదా సాగుతున్నంతసేపూ నిప్పు తయారయేదికాదు, విడిది అమరేది కాదు, కుక్కలకు తిండి ఉండేది కాదు.

మర్సిడీస్ హృదయంలో ఒక అక్కసున్నది. దానికి కారణం ఆమె ఆడది కావటం. ఆమె అందమైన మనిషి, కోమలమైనది. ఆమెను అందరూ ప్రత్యేకమైన ఆదరంతో చూశారు. కాని ఇప్పుడామెకు భర్తగాని, తమ్ముడుగాని అలాటి ఆదరం చూపటంలేదు. అసహాయస్థితిలో ఉండటం ఆమె ఆచారం. కాని వారందుకు ఆమెను తప్పుపడు తున్నారు. తన స్త్రీత్వానికి జరిగిన ఈ అపచారానికి ప్రతి క్రియగా ఆమె వారిని కొరుక్కుతినసాగింది. ఆమెకిప్పుడు కుక్కలను గురించి విచారం ఏమీ లేదు. ఆమె అలసిపోయి ఉండటంచేత స్లెడ్ మీద సవారీ అవుతానని పట్టుపట్టింది. కావటానికామె అందగత్తె, కోమలమైనదీ అయినా ఆమె బరువు నూటఇరవై పౌనులు. తిండికూడా సరిగా లేకుండా వల్లమాలిన బరువులాగే కుక్కల ప్రాణానికి ఈ అదనపు బరువు చాలు. ఆమె రోజులతరబడి స్లెడ్‌నుంచి దిగలేదు. చివరకు కుక్కలు లాగలేక పడిపోయాయి. చార్ల్స్, హాల్ కూడా ఆమెను దిగి నడవమని బతిమాలారు, వేడుకున్నారు, నచ్చజెప్పారు. కాని ఆమె శోకాలుపెడుతూ వాళ్ళ క్రూరత్వాన్ని దుమ్మెత్తి పోసింది.

ఒకసారి వారామెను బలాత్కారంగా స్లెడ్‌నుంచి ఎత్తి దించారు. ఆ తరవాత వారు మళ్ళా అలాటిపని చేసి ఎరగరు. ఆమె గారాబంమరిగిన పిల్లలాగా కాళ్ళు ముడుచు కుని దారికి అడ్డంగా కూచున్నది. వారు కదిలివెళ్ళినా ఆమె అక్కడే ఉండిపోయింది. వారు మూడుమైళ్ళు వెళ్ళి సామా

నంతా దించి, ఆమెకోసం వెనక్కువచ్చి, ఆమెను ఎత్తి స్లెడ్‌లో కూచోబెట్టారు.

వాళ్ళ కష్టాలే వాళ్ళకు ఎక్కువనిపించటంవల్ల కుక్కలపట్ల కాఠిన్యం వహించారు. మనిషి కఠినంగానే తయారుకావాలని హాల్ సిద్ధాంతం. ఈ సిద్ధాంతాన్ని అతను ఇతరులపైన అమలు చేసేవాడు. ఈ సిద్ధాంతాన్ని అతను మొదట తన అక్కకూ బావకూ బోధించాడు. అది వాళ్ళకు ఎక్కకపోయేసరికి దుడ్డుకర్ర సహాయంతో కుక్కలకు బోధించసాగాడు. "అయిదు వేళ్ళు" (Five Fingers) చేరుకునేసరికి కుక్కల ఆహారం అయిపోయింది. ఒక బోసినోటి ఎర్రఇండియను ముసలవ్వ హాల్ రొండిని అలంకరించే రివాల్వరిస్తే తనవద్ద ఉన్న గుర్రపుతోలు, చలికి బిగుసుకుపోయినది, కొద్ది పౌనులిస్తానన్నది. తిండికిమాడి చచ్చిన గుర్రాలనుంచి ఆరుమాసాలక్రితం వొలిచిన చర్మం ఆహారంగా పనికిరాదు. బిగుసుకుపోయి ఉన్నదేమో ఇనప ముక్కల్లాగా తయారయినది. కష్టపడి కుక్కలు దాన్ని ఎలాగో దిగమింగితే వాటి కడుపుళ్లో అదినాని పలచని తోలు పట్టీలుగానూ, బొచ్చుఉండలుగానూ విడిపోయి అరగక చాలా హైరానపెట్టింది.

ఇలాటి అనుభవాలకు గురిఅవుతూ మిగిలిన కుక్కలకు పురోగామిగా ఉండి స్లెడ్ లాగుతున్న బక్ కు అంతా ఒక పీడకలలాగా ఉంది. అది ఓపిక ఉన్నంతసేపూ లాగేది. ఓపిక చావగానే పడిపోయి, తిరిగి కొరడాదెబ్బలకో, దుడ్డు

కర్ర దెబ్బలకో లేచేది. అందమైన దానిజూలుకు దార్ఢ్యమూ నిగనిగా లేకుండా పోయింది. అది వెలబడి చిందరవందరగా అయిపోయి, దుడ్డుకర్ర దెబ్బలకు రక్తంకారినచోట అట్ట గట్టుకు పోయింది. దాని కండరాలు కరిగి తాళ్ళలాగా అయి పోయాయి. చర్మం ముడతలుపడి వదులయింది. దానిలో నుంచి ప్రతి ఎముకా పొడుచుకు వస్తున్నది. గుండెల విసే పరిస్థితి. అయితే బక్ గుండెలకు చలనం లేదు ఎర్రస్వెటర్ వాడు ఆ సంగతి నిరూపించాడు.

బక్ సంగతి ఎలాఉన్నదో దాని సహచరుల సంగతీ అలాగే ఉన్నది, అన్నీ కదిలే అస్థిపంజరాలు. బక్ కూడా కలుపుకుని ఇప్పుడు ఏడుకుక్కలున్నాయి. అవి ఉన్న దుస్థితిలో వాటికి కొరడా దెబ్బగాని దుడ్డుకర్ర దెబ్బగాని తెలియటం లేదు. కనిపించేవీ వినిపించేవీ ఎక్కడోదూరంగా అస్పష్టంగాఉన్న వన్న వనిపించినట్టే దెబ్బలబాధకూడా వాటికి ఎక్కడో దూరాన ఉన్నట్టూ, అస్పష్టంగానూ తోచేది. అవి సగం ప్రాణాలతోను, కొన ప్రాణాలతోనూ ఉండటం కాదు; అవి ఎముకల సంచుల్లాగా ఉంటే వాటిలో ఎక్కడో ప్రాణం గుటగుట మంటున్నది. ఆగిన మరుక్షణం ఆవి పగ్గాలమధ్య చచ్చిన వాటిలాగా పడిపోయేవి; గుట గుట మంటున్న వాటి ప్రాణం సాంతం పోయినట్టే కనపడేది. మళ్ళీ దుడ్డుకర్ర దెబ్బగాని, కొరడా దెబ్బగాని తగలగానే ఆ ప్రాణంకాస్తా తిరిగి వచ్చినట్టయేది. అవి బలవంతాన లేచి నిలబడి కాళ్ళీడ్చుకుంటూ ముందుకు సాగేవి.

సాధువైన బిల్లీ ఒకనాడు పడిపోయి మళ్ళీ లేవలేక పోయింది. రివాల్వరును మారకంవేసి ఉండటంచేత హాల్ గొడ్డలి తీసుకొని బిల్లీ నెత్తిన ఒకటిపెట్టి, దాని శరీరం నుంచి కట్టుతాళ్ళు తెగగొట్టి, కళేబరాన్ని పక్కకు ఈడ్చేశాడు. ఇదంతా బక్ చూసింది. మిగిలిన కుక్కలూ చూశాయి. వాటికిది తమ సొంత అనుభవంలాగే తోచింది. మర్నాడు కూనా పోయింది, ఇక అయిదు కుక్కలు మిగిలాయి; జోకు వెర్రికోపమంతా అణగారి పోయింది. పైక్ కుంటుతున్నది. దానిమెడ సరిగా పనిచెయ్యక అది దొంగ వేషాలు వెయ్యలేని స్థితిలో ఉన్నది. ఒంటి కన్నుగల సోల్ లెక్స్‌కు లాగాలన్న ఉత్సాహం ఏమాత్రమూ తగ్గలేదు. గాని లాగేశక్తి నశించినందుకది బెంగపడి ఉన్నది; టీక్ ఎక్కువ ప్రయాణం చేసినదికాదు, కాని అనుభవంలేని కారణంచేత అది మిగిలిన అన్ని కుక్కలకన్నా ఎక్కువ దెబ్బలు తింటున్నది; బక్ ఇంకా నాయకత్వం నిర్వహిస్తూనే ఉన్నదిగాని మిగిలిన కుక్కలను అదుపు చెయ్యటానికి ప్రయత్నం కూడా చెయ్యటంలేదు. బలహీనతమూలాన దాని దృష్టికూడా సరిగా లేదు, అది తన కాళ్ళతాకిడి సహాయంతోనూ, సరిగా ఆనని చూపుతోనూ దారిని ఊహించి తెలుసుకునేది.

వాతావరణం ఇప్పుడు చాలా మనోహరంగా ఉంది. అయితే కుక్కలుగాని, మనుషులుగాని దాన్ని చూసి ఆనందించే స్థితిలో లేరు. ఆరోజు కారోజు సూర్యుడు మరింత పెందలాడి ఉదయించి, మరింత ఆలస్యంగా అస్తమిస్తున్నాడు. మూడుగంటలకల్లా తెల్లవారి రాత్రి తొమ్మిదింటి

దాకా మునిమాపు ఉంటున్నది. రోజల్లా ఎండ దేదీప్య మానంగా ప్రకాశిస్తున్నది. శీతాకాలపు నిశ్శబ్దం పోయి, ప్రకృతి వసంత చైతన్యం తాలూకు శబ్దాలు బయలుదేరు తున్నాయి. అంతటా కొత్త జీవితం పుట్టుకువచ్చి సందడి చేస్తున్నది; మంచుకప్పి ఉన్నంతకాలమూ చచ్చినవాటి లాగా పడిఉన్న జీవరాసులు పళ్ళాకు చైతన్యం పొందు తున్నాయి. దేవదారువృలు చేవ ఎక్కుతున్నాయి. "విల్లో" "ఆస్పెన్" చెట్లు చిగురుపడుతున్నాయి. పొదలూ, లతలూ ఆకుపచ్చని ఆకులతో నిండుతున్నాయి. రాత్రిళ్ళు ఇలకోళ్లు కీచుమని పాడుతున్నాయి. పగలు ఎండలో రకరకాల కీటకాలు కదులుతున్నాయి, పాకుతున్నాయి. బొంతపక్షులు అడవిలో అరుస్తున్నాయి. వడ్రంగిపిట్టలు టకటకా చెట్లను కొడుతున్నాయి. ఉడతలు కిచకిచలాడుతున్నాయి, పక్షులు పాడుతున్నాయి, ఆకాశాన అడవిపక్షులు గసిక (Wedge) ఆకారంలో దక్షిణంనుంచి అరుస్తూ వస్తున్నాయి.

ప్రతి కొండ బొరియ వెంబడీ చిన్నచిన్న ప్రవాహాలు శ్రావ్యంగా గలగలలాడుతూ బయలుదేరాయి. యూకాన్ నది తనను బంధించిన మంచును వదిలించుకోవటానికి ప్రయ త్నిస్తున్నది. మంచును నది అడుగునుంచి తొలుస్తుంటే, పైనుంచి ఎండ కరిగించేస్తున్నది. అందుచేత మంచులో అక్కడక్కడా నిలువునా కంత లేర్పడ్డాయి, కొన్నిచోట్ల బీటలు ఏర్పడి క్రమంగా పెద్దవయాయి. అరిగిపోయి పలచ బారినచోట్ల మంచు విరిగి ప్రవాహంలో పడసాగింది. ఇలా

ప్రకృతి పగిలి, బద్దలై, కంపించుతూ, ప్రకాశమానమైన సూర్యకాన్తిలో, చల్లని పిల్లవాయువులమధ్య నూతనజీవితం మొగ్గ తొడుగుతోంటే ఆ ఇద్దరు మనుష్యులూ, ఆడదీ, కుక్కలూ మృత్యుదేవతను చేరబోయేవారిలాగా నడవలేక నడనలేక ముందుకు సాగుతున్నారు.

కుక్కలు ఒకటే పడటం, మర్సిడిస్ ఒకవంక ఏడుస్తూనే స్లెడ్ నుంచి దిగకపోవటం, హాల్ ఊరికేనే తిడుతూండటం, చార్ల్స్ కళ్ళు ఒకేతీరున చెమ్మగిల్లటం — ఈ ధోరణిలో వారు తెల్ల నదీ ముఖాన ఉండే జాన్ తారన్టన్ శిబిరం (John Thornton's camp) చేరారు. వారుఆగిన మరుక్షణం కుక్కలన్నీ గుండేసి కొట్టినట్టు పడిపోయాయి. మర్సిడిస్ కళ్లు తుడుచుకుని జాన్ తారన్టన్ కేసి చూసింది. చార్ల్సవిశ్రాంతికోసం ఒక దుంగపైన కూచున్నాడు. అతని శరీరమంతా కొయ్యబారినట్టు కావటంచేత చాలా నింపాదిగా కూచోవలిసి వచ్చింది, హాల్ మాట్లాడాడు. తన గొడ్డలికి కర్ర చెక్కుకుంటున్న తారన్టన్ చెక్కటం ఆపకుండానే విన్నాడు. అన్ని ప్రశ్నలకూ అతను ఒకటి రెండక్షరాల జవాబులే ఇచ్చాడు. సలహా అడిగేసరికి ఘాటైన సలహా ఇచ్చాడు. ఈ మనుష్యు లెలాంటివారో అత నెరుగును, వారు తనసలహా వినరనికూడా అతనికి తెలుసు.

మంచు చాలా మోసంగా ఉన్నదనీ, దాన్ని నమ్ముకుని దానిపై ప్రయాణించటం అపాయకరమనీ తారన్టన్ హెచ్చరించాడు. అదివిని హాల్, "ఎగువనకూడా అలాగే

చెప్పారు. మంచు అడుగునుంచి కోసుకుపోయి ఉన్నదనీ, ముందుకు వెళ్ళటం క్షేమం కాదనీ అన్నారు. అసలు తెల్ల నదిని చేరలేమన్నారు. మరి చేరం!" అన్నాడు వెటకారంతో కూడిన విజయ గర్వం ధ్వనించేలాగా.

"వాళ్ళన్నది నిజం. మంచు ఎప్పుడు కుంగినా కుంగ వచ్చు. అదృష్టదేవత వరించిన మూర్ఖులు మాత్రమే ఈ దాటిన రాగలుగుతారు. ఒకటే సంగతి చెబుతా విను, అలాస్కాలో ఉన్న బంగారమంతా ఇచ్చినా నా కళేబరాన్ని ఆ మంచు పైకి తీసుకుపోను!" అన్నాడు జాన్ తార్నటన్.

"నీవు మూర్ఖుడివి కావుగనుకనా? అయినా మేం డాసన్‌కు బయలుదేరి పోతున్నాం చూసుకో!" అంటూ హాల్ కొరడా విప్పి, "ఏయ్, బక్! లే, లే! హెయ్, పదండి, పదండి! అంటూ అరిచాడు.

తార్నటన్ తనమానాన తాను కర్ర చెక్కసాగాడు. మూర్ఖుడికి, వాడి మూర్ఖత్వానికీ ఎడబాటు చెయ్యటం ఎవడివల్లాకాదు. ఇద్దరు ముగ్గురు మూర్ఖులు ఉన్నా ప్రపంచం సాగిపోవటానికి అభ్యంతరం ఏమీలేదు.

కాని కుక్కలు లేవనేలేదు. వాటిని లేపటానికి దెబ్బలు తప్ప మరొకమార్గం లేనిస్థితి ఎన్నడో దాటిపోయింది. కొరడా అక్కడా ఫెళ్ళుమన్నది. తార్నటన్ తన పెదిమలు బిగించాడు. మొట్టమొదటనే లేచి నిలబడినది సోల్‌లెక్స్. తరవాత టీక్, బాధతో ఏడుస్తూ వరసగా లేచాయి. పైక్ అతికష్టంమీద రెండుసార్లు సగం లేచి

మళ్ళీ పడి, మూడోసారి నిలబడ గలిగింది. బక్ లేవటానికి ప్రయత్నించనుకూడా లేదు. అది పడినచోటే ఉండిపోయి కొరడాదెబ్బలు తిన్నదేగాని బాధపడలేదు, వాటినితప్పించు కోవటానికి యత్నించలేదు. థార్నటన్ చాలాసార్లు ఏదో అనబోయి అంతలో మానేశాడు. అతనికళ్లు చెమ్మగిల్లాయి, అతను కూచున్న చోటినుంచి లేచి అటూ ఇటూ తొచని వాడిలాగా పచారు చేశాడు.

బక్ మోరాయించటం ఇదే మొదటిసారి. సగం అందుకే హాల్‌నుండి పడ్డాడు. అతను కొరడా అవతల పెట్టి దుడ్డుకర్ర తీసుకున్నాడు. దుడ్డుకర్ర దెబ్బలు బరువుగా పడు తున్నప్పటికి బక్ చలించలేదు. మిగిలిన కుక్కలులాగే అది నిజంగా లేవలేని స్థితిలో ఉంది; అయితే తేడాఏమంటే, అది వాటిలాగా లేవటానికి ప్రయత్నించదలచలేదు. పెద్ద ప్రమాదం జరగనున్నదని దానికేదో చెబుతున్నది. అది గట్టుమీదికి వచ్చినప్పుడే ఇలాటి భావం కలిగింది, కాని దాని కాళ్ళకింది మంచు అడుగుకు దిగిపోలేదు. ఆ రోజల్లా దాని కాళ్ళకింద మంచు ప్రమాదకరంగా ఉన్నట్టే దానికి అనిపించింది. ఇప్పుడే తన యజమాని తమను తోలుకు పోయే మంచుపైన ఘోరం జరగబోతున్నదని దానికి తోచింది. అందుచేత అది చలించలేదు. అప్పటికే అది చాలా బాధ అనుభవించి ఉండటంచేత ఈ క్రూరమైన దెబ్బలు బాధ దానికి అంతగా తెలియలేదు. ఒక్కొక్క దెబ్బ పడుతున్నకొద్దీ దాని ప్రాణం కొస్త కొస్త పోతు న్నది. ప్రాణం చాలావరకు పోనేపోయింది. దాని ఒళ్లంతా

మొద్దుబారిపోయింది. తనను ఎవరో కొడుతున్నారన్నది కూడా దానికి చాలా అస్పష్టంగా తెలుస్తున్నది. దానికి బాధ అంటే ఏమిటో తెలియని స్థితికూడా వచ్చేసింది. అయితే తన ఒంటిపైన పడే దెబ్బలచప్పుడు మాత్రం అస్ప ష్టంగా వినిపిస్తున్నది. ఆ శరీరంకూడా తనదిలాగా లేదు, ఎక్కడో తనకు దూరంగా ఉన్నట్టున్నది.

ఇంతలో ఆకస్మికంగా, పిడుగుపాటులాగా, జాన్ కాన్టన్ జంతువులాగా పెద్ద కేకపెట్టి దుడ్డుకర్ర వాడిపైకి లంఘించాడు. చెట్టు విరిగి మీద పడినట్టయి హాక్స్ శాస్త్రా వెనక్కు పడిపోయాడు. మర్సిడిస్ కెవ్వున అరిచింది. హాక్స్ ఆశగా చూసి కళ్ళు తుడుచుకున్నాడేగాని, శరీరం కొయ్యా బారి ఉండటం మూలాన లేవ లేదు.

జాన్ కాన్టన్ కోపంతో వణికిపోతున్నాడు. అతను బక్ ఎగువగా నిలబడి, మాట సరిగారాని కంఠంతో, "ఈ కుక్కను ఇంకొక దెబ్బ కొట్టావో, చస్తావ్!" అన్నాడు.

హాక్స్ లేచి నోటినుండి కారే రక్తం తుడుచుకుంటూ దగ్గిరికివస్తూ, "అది నా కుక్క. నాకు అడ్డం వచ్చావంటే నీపని చెబుతాను. నేనిప్పుడు డాసన్‌కు వెళ్ళాలి." అన్నాడు.

కాన్టన్ అతనికీ బక్‌కూ మధ్య అడ్డంగా నిలబడ్డాడు. అతనికి అడ్డం తొలిగే ఆలోచనేమీ ఉన్నట్టు కనబడ లేదు. హాక్స్ తన వేటకత్తిని పైకి లాగాడు. మర్సిడిస్ కెవ్వున అరిచి, ఏడిచి, నవ్వి, హిస్టీరియా వాతపడిపోయిన మనిషి లక్షణాలు ప్రదర్శించింది. కాన్టన్ తన గొడ్డలి పిడితో

హాక్ చేతివేళ్ళ కణుపులమీద ఒక్కటి పెట్టాడు. వేట కత్తి కిందపడింది. అతను దాన్ని మళ్ళా ఎత్తుకోబోతుంటే కణుపుల పైన మరొక దెబ్బ తగిలింది. తరువాత అతనే వంగి కత్తి తీసుకుని దానితో బక్ కళ్ళాలు తెగగోశాడు.

హాల్‌కు పోట్లాడే శక్తి లేదు. అతనికి అప్పగారిని సముదాయించటంతోనే సరిపోయింది. బక్‌ను చూడబోతే అది కొనప్రాణాలతో ఉన్నది. స్లెడ్‌ను లాగలేదు. మరి కాస్సేపటికి వాళ్ళు ఒడ్డునుంచి నదిమీదికి కదిలి వెళ్ళారు. చప్పుడు విని బక్ తల ఎత్తి చూసింది. పైక్ అన్ని కుక్కలకూ ముందున్నది. సోల్‌వెక్స్ స్లెడ్‌కు దగ్గిరిగా కట్టి ఉన్నది. రెంటికీ మధ్య జో, టీక్ ఉన్నాయి. అవి తూలుతూ, కుంటుతూ నడుస్తున్నాయి. మర్సిడిస్ సామానుతోబాటు స్లెడ్‌పైన సవారీ అయింది. స్లెడ్ పోలును హాక్ పట్టుకుని నడిపిస్తున్నాడు. వెనకగా చాల్స్ తడబడుతూ పోతున్నాడు.

బక్ అలా చూస్తూంటే కాన్టన్ దాని పక్కన కూచుని తన మొరటు చేతులతో ప్రేమగా దాని శరీరం తడివి ఎముకలేవైనా విరిగాయూ అని చూశాడు. అతని పరీక్ష ముగిసి, అది తిండికి మాడుతున్నదనీ, శరీరంపైన గాయాలు తప్ప మరేమీ లేవనీ తేలేలోపల స్లెడ్ రెండు ఫర్లాంగులు వెళ్ళిపోయింది. అది మంచుమీదుగా పాకిపోతూ ఉండటం కుక్కా, మనిషీ కూడా గమనించారు. అంతలోనే అది గుంటలో పడ్డట్టుగా ముందుకు వంగింది. దాని పోలు చివాలున గాలిలోకి లేచింది. హాక్ దాన్ని పట్టుకు వేళ్ళాడుతున్నాడు. మర్సిడిస్ కేకలుపెట్టటం వినపడుతున్నది.

హాక్స్ వెనక్కు తిరిగి ఒక్క అడుగు వేశాడు. అంతలోనే ఒక పెద్ద మంచుపెళ్ళ కాస్తా విరిగిపోయి, కుక్కలూ, మనుష్యులూ అడుగుకు వెళ్ళిపోయారు. వారు ఉండిన చోట ఒక పెద్దగొయ్యి మాత్రమే మిగిలింది.

జాన్ కార్టన్, బక్ ఒకరి నొకరు చూసుకున్నారు.

"పిచ్చిముండా!" అన్నాడు జాన్ కార్టన్, బక్ అతని చెయ్యినాకింది.

## 6

## మమకారం

గడిచిన డిసెంబరులో కార్టన్ పాదాలు చలికి కొయ్యబారిపోయాయి. డాసన్‌కు దుంగలు చేరవేసేటందుకు పోతున్న అతని అనుచరులు అతను కోలుకునేందుకు అవసరమైన సదుపాయాలు కలుగజేసి తాము ముందుకు సాగిపోయారు. అతను బక్‌ను కాపాడిన నాటికింకా కొద్దిగా కుంటుతూనే ఉన్నాడు. కాని వాతావరణం వెచ్చబడినకొద్దీ ఆ కాస్త కుంటూ పోయింది. ఇక్కడే నదిఒడ్డున పడుకునిని, నదీప్రవాహం కేసి చూస్తూ, పక్షుల పాటలు ఆలకిస్తూ, ప్రకృతి చైతన్యాన్ని గమనిస్తూ బక్ కూడా క్రమంగా తన బలాన్ని తిరిగి సంపాదించుకున్నది.

మూడు వేలమైళ్లు ప్రయాణం చేసిన ప్రాణికి విశ్రాంతిని మించినది ఉండదు. బక్ తన గాయాలను మాన్చ

కుంటూ, కండరాలను పెంచుకుంటూ, ఎముకలపైన మాంసం పేర్చుకుంటూ చాలా సోమరిజీవితం గడిపింది. ఆమాటకువస్తే జాన్ కాన్టన్‌కు గాని, "స్కీట్"కు గాని, "నిగ్"కు గాని చేసేపని అంటూ ఏమీలేదు — నదివెంట దుంగల తెప్ప ఎప్పుడువస్తుందా! దాని పైన ఎప్పుడు డాసన్ పోదామా అని ఎదురుచూడటమే. స్కీట్ ఐరిష్‌సెటర్ (irish setter) జాతికుక్క, బక్ చావుబతుకులలో ఉండి, తనను దూరంగా ఉంచే స్థితిలో లేని సమయంలో, అది బక్‌తో స్నేహం కలిపింది. కొన్ని కుక్కలలో చికిత్సా గుణం ఉంటుంది; స్కీట్‌లో అలాంటి గుణం ఉన్నది. తల్లి పిల్లికూనల శరీరాలను నాకి శుభ్రంచేసి నట్టుగా, అది బక్ శరీరంపైగల పుళ్ళను నాకి శుభ్రం చేసేది. క్రమం తప్పకుండా ప్రతిఉదయమూ, బక్ ఆహారం తినగానే స్కీట్ వచ్చి ఈపని చేసేది. కాన్టన్ చేసే చికిత్సకు అలవాటుపడ్డట్టే, బక్ ఈ చికిత్సకుకూడా అలవాటు పడిపోయింది. నిగ్‌కూడా చాలా స్నేహపాత్రమైన కుక్కే గాని, అది తన అపేక్షను ఇంతగా ప్రదర్శించేది కాదు. అది పెద్ద నల్లకుక్క, దాని శరీరంలో రెండురకాల వేటకుక్కల రక్తం ఉన్నది. దాని కళ్ళు నవ్వుతున్నట్లుండేవి. దాని స్వభావం అమిత మంచిది.

ఈ కుక్కలకు తనపై అసూయ లేకపోవటంచూసి బక్ ఆశ్చర్య పడింది. జాన్ కాన్టన్‌లో ఉండే ఔదార్యమూ దయా వీటిలోకూడా ఉన్నాయి. బక్‌కు శక్తి చేకూరుతూ వచ్చినకొద్దీ ఈకుక్కలు తనతో పిచ్చి పిచ్చి ఆటలన్నీ ఆడ

సాగాయి. అప్పుడప్పుడూ కాన్టన్ కూడా ఈ ఆటలలో పాల్గొనేవాడు. బక్ కోలుకోవటంతో బాటు ఇంకొక జీవితం కూడా ఆరంభమయింది. ప్రేమ, గాఢమైన ప్రేమ బక్‌కు మొట్టమొదటిసారిగా అనుభవమయింది. శాంటా క్లారా లోయలో జడ్జ్ మిలర్ ఇంట దానికిలాటి ప్రేమ తెలియదు. జడ్జ్ కొడుకులు వేటలోనూ, షికార్లలోనూ దానికి భాగస్వాములుగా ఉండేవారు; జడ్జ్ మనవలపట్ల అది ఒకవిధమైన గార్డియన్ హోదా నిర్వహించింది. జడ్జితో కూడా అది ఒకవిధమైన పెద్దమనిషితరహా స్నేహం మాత్రమే నెరపింది. కాని జాన్ కాన్టన్ బక్‌లో ఒక ఉద్వేగపూరితమైన ప్రేమ-ఆరాధనలాటిది, ఉన్మాదంలాటిది—రేకెత్తించాడు.

ఈ మనిషి తన ప్రాణాన్ని కాపాడటం అటుంచి, అతను ఆదర్శప్రాయుడైన యజమాని. తమ ధర్మం అనుకునీ, కేవలం స్వలాభం పాటించీ కుక్కల క్షేమాన్ని చూసుకునే వారున్నారు; కాని ఇతను తన కుక్కలను సొంత పిల్లలల్లాగా చూసుకునేవాడు, వాటిని కాపాడకుండా ఉండటం అతనికి సాధ్యంకాదు. అంతేకాదు, అతను వాటితో అంతులేకుండా మాట్లాడేవాడు. అతని దృష్టిలో అవి "పోచికోలు" కబుర్లు; కాని ఆమాట్లాడటం అతనికి ఎంత ఆనందంగా ఉండేదో వాటికీ అంత ఆనందంగా ఉండేది. అతను బక్ తలను తనచేతుల్లో మొరటుగా పట్టుకుని, తన తలను దానితలపై పెట్టి, వెనక్కూ ముందుకూ ఊపుతూ నానాతిట్లూ తిట్టేవాడు. ఆతిట్లు బక్ చెవులకు ముద్దు మాటల్లాగా వినిపించేవి. అతను ఇలా తనను ముద్దుచెయ్యటంకన్న

ఎక్కువ ఆనందం బక్ ఎరగదు. ఆనందోద్రేకంతో దాని గుండె శరీరంలోనుంచి బయటికి వెళ్ళుకుని వస్తుం దనిపించేది. అతను వదిలిపెట్టగానే అది లేచి బొమ్మలాగా చాలాసేపు నిలబడేది, దాని నోరు నవ్వుతున్నట్టుండేది, దానికళ్ళు ఏదో చెబుతున్నట్టుండేవి. దాని కంఠం ఏదో మాట్లాడుతున్నట్టుగా కంపించేది. దాన్నిచూసి జాన్ కాన్టన్ మెప్పుగా, "దుంప తెగ, నీకు మాట్లాడటం ఒకటే చేతకాదు!" అనేవాడు.

బక్ తన ప్రేమను చాలా మొరటుగా ప్రదర్శించేది. అది కాన్టన్ చేతిని తన నోట్లోపెట్టుకుని ఎంతసేపు గట్టిగా నొక్కేదంటే, అతని చర్మంపైన చాలాసేపు దాని కోరల గుర్తులుండేవి. కాన్టన్ తిట్లు ముద్దుమాటలని బక్ అర్థం చేసుకున్నట్టే, ఈ మోటుసరసం ప్రేమ అని అతను అర్థం చేసుకునేవాడు.

కాన్టన్ తనను ముద్దుచేసినప్పుడు తనకు ఎంత ఒళ్ళు తెలియని ఆనందం కలిగినా బక్ అతని స్పర్శకోసం మిగిలిన రెండుకుక్కల్లాగా దేబిరించేదికాదు. ముద్దు చేయించు కోవటం కోసం స్కీట్ తనముక్కు తెచ్చి కాన్టన్ చేతికింద పెట్టి తోసేది. నిగ్ కాన్టన్ కూచున్న చోటికివచ్చి తనపెద్ద తలను తెచ్చి అతని మోకాలిమీద పెట్టేది. బక్ మాత్రం తన యజమానిని ఎడంగా ఉండే ఆరాధించేది. అది గంటల తరబడి కాన్టన్ కాళ్ళవద్ద పడుకుని అతని మొహంకేసి చూసేది, దాన్ని గమనించేది, పరిశీలించేది. దానిలో జరిగే ప్రతి మార్పునూ ఆసక్తితోకనిపెట్టేది. ఒక్కొక్కసారి అది అతని వెనకగానో, పక్కగానో దూరానపడుకుని అతని శరీరాకృతినీ,

కదలికలనూ గమనించేది. మనిషికీ కుక్కకూ మధ్య ఉన్న గాఢ స్నేహబంధం మూలాన కాన్టన్ తరచు బక్ తనను చూస్తున్న సంగతి తెలుసుకుని, తలతిప్పి దానివేపు చూసే వాడు. అతను పైకి ఏమీ అనకపోయినా అతని ప్రేమకూడా అతని కళ్ళలో వ్యక్తమయేది.

కాన్టన్ తనను రక్షించినాక చాలాకాలంపాటు బక్ అతనిని తన కనుచూపుమేర దాటి పోనిచ్చేదికాదు. అతను డేరా దాటినది లగాయతు, మళ్ళీ తిరిగి వచ్చేదాకా అది అతని వెంటనే ఉండేది. అది ఈ ఉత్తరప్రాంతానికి వచ్చిన తర్వాత తన యజమానులు తెగ మారటంచూసి, యజమాని అన్నవాడు చాలా అశాశ్వతమైన వ్యక్తి అని తెలుసుకున్నది. పెరాల్ట్, ఫ్రాన్సోయ్, స్కాట్ సంకరజాతి వాడూ లాగే కాన్టన్‌కూడా ఉన్నట్టుండి తన జీవితంలో నుంచి నిష్క్రమిస్తాడని అది భయపడింది. రాత్రివేళ కలలలోకూడా ఈభయం దాన్ని వెంటాడేది. అటువంటప్పు డది నిద్రమేలుకుని, చలిలో డేరాద్వారందాకా పాకివచ్చి నిలబడి, లోపల తన యజమాని ఊపిరి పీల్చటం ఆలకించేది.

కాన్టన్‌పై దానికిగల ఈ ప్రగాఢప్రేమ నాగరిక లక్ష ణమే అయినా, ఈ ప్రాంతంలో అది అలవరచుకున్న ఆటవిక తత్వం దాన్ని వదిలిపెట్టలేదు దానిలో ఒకవంక విశ్వా సమూ, మమకారమూ ఉన్నాయి; మరొకవంక క్రౌర్యమూ, మోసబుద్ధీకూడా ఉన్నాయి; అది ఇప్పుడు కాన్టన్ పంచచేరిన

అడవికుక్కే-గాని, అనేకతరాలుగా మచ్చిక అయిన దక్షిణ దేశపు పెంపుడు కుక్క-కానేకాదు. ఈమనిషిమీద దానికి ప్రేమ గనక ఇతనివద్ద దొంగతనం చెయ్యదుగాని, మరొక చోట, మరొకమనిషి దగ్గర అయితే అవలీలగా దొంగతనం చేస్తుంది; పట్టుబడకుండా తప్పించు కుంటుంది కూడా.

దాని ముఖానా, శరీరానా చాలా కుక్క-లు చేసిన గాట్లున్నాయి. ఇప్పటికీ అది భయంకరంగా పోట్లాడుతుంది. అయితే స్కా-ట్, నిగ్ చాలా సాధువులయిపోయాయి. పై పెచ్చు అవి జాన్ కార్టన్‌వి. మరొకకుక్క- బక్ ఎదుట పడితే అది బక్ ఆధిక్యత ఆమోదించాలి, లేదా బక్ చేతిలో చచ్చిందే - అది ఏజాతిదిగానీ, ఎంత పౌరుషం గలది గానీ. బక్ వద్ద దయాదాక్షిణ్యాలు లేవు. కోర న్యాయమూ, దుడ్డుకర్ర న్యాయమూ అది నేర్చుకున్నది. అది తనకు దొరికిన అవకాశాన్ని పోగొట్టుకునేది కాదు, తనకు చిక్కి-న శత్రువును ప్రాణం తీయకుండా మధ్యలో విడిచి పుచ్చేదికాదు. ఈ విషయంలో మధ్యేమార్గమంటూ లేదన్న సంగతి స్పిట్జ్ నుంచీ, పోలీసు కుక్క-లనుంచీ, టపాకుక్క-ల నుంచీ అది తెలుసుకున్నది. అధికారం చెయ్యాలి, లేదా అణగిపడిఉండాలి. జాలిచూపటం దుర్బలత్వం. ఆటవిక జీవితంలో దయ అనేది లేదు. అది భయంగా పరిగణించ బడుతుంది, ఆ పరిగణన చావుకు దారితీస్తుంది. చంపు, లేదా చావు; చేతనైతే తిను, లేదా ఇతరులకు ఆహారం అయిపో—అదీ ధర్మం. అనాదిగా వస్తున్న ఈ ధర్మాన్ని బక్ శిరసావహించింది.

బక్ భూమిపై బడి బతికినకాలం కొద్దేఅయినా, దాని వయసు చాలా పెద్దది. దానిలో వర్తమానమూ, గతమూ కలుసుకున్నాయి. గడిచిన యుగాలన్నీ దానిలో స్పందించాయి. జాన్ కార్టన్ తాలూకు చలిమంటముందు కూచున్న పెద్ద రొమ్ముగల ఆ జూలు కుక్కలో అంతర్లీనమై అనేక రకాల కుక్కలు — అడవి కుక్కలూ, తోడేళ్ళలాటివీ — ఉండి, దాన్ని ప్రేరేపిస్తున్నాయి, దానితోబాటు తిండీ, నీరూ రుచిమాస్తున్నాయి. గాలిని పసికడుతున్నాయి, నైసర్గిక ప్రకృతినుంచివచ్చే శబ్దాలు ఆలకిస్తున్నాయి. దాని మానసిక స్థితులనూ, చర్యలనూ శాసిస్తున్నాయి. దానితోపాటు పడుకుని నిద్రపోయి కలలుగని, ఆ కలలరూపాలను స్వయంగా నిర్దేశిస్తున్నాయి.

ఆరోజుకారోజు బక్‌ను ఈ కుక్కభూతాలు సమీపంగా లాగేస్తూ దానిని మానవ ప్రపంచంనుంచి వేరు చేస్తున్నాయి. అటవీమధ్యంనుంచి దానికొక పిలుపు వినిపిస్తున్నది. అవ్యక్తమైన, ఉద్రేకపూరితమైన ఆ పిలుపు వినిపించినప్పుడు దానికి చలిమంటతోనూ, దానిచుట్టూ చదును చేసిఉన్న నేలతోనూ పనిలేదు. అది అరణ్యంలోపడి ఎక్కడికో ఎందుకో తెలియకుండా అదేపోత పోయేది. ఆపిలుపు ఎక్కడినుంచో ఎందుకో అని దానికి ఆశ్చర్యం కలిగేదికాదు. అయితే అది చెట్లమధ్యకు వెళ్ళగానే జాన్ కార్టన్‌పై గల మమకారం దాన్ని మళ్ళా చలిమంటకేసి ఈడ్చుకు వచ్చేది.

దాన్ని కట్టేసిన మనిషి జాన్‌కార్నర్ ఒక్కడే, మిగిలిన మానవులు దానిలెక్కలో లేరు. దాగేహామ్యే వాళ్లు దానిని మెచ్చుకున్నా, ముద్దుచేసినా దానికి లక్ష్యం ఉండేది కాదు. ఎవరన్నా తనను అతిగా ముద్దుచేస్తే అది లేచి వెళ్ళి పోయేది. ఎంతకాలంగానో ఎదురుచూచిన కాన్టన్ అను చరులు హాన్స్, పీట్ దుంగల తెప్ప వేసుకుని చేరితే మొదట బక్ వాళ్ళని ఖాతరు చెయ్యలేదు. అయితే వారు కాన్టన్‌కు ఆత్మీయులని తెలిసి వారిని ఒకవిధమైన సహన భావంతో చూస్తూ, వారిని ఉద్ధరించటాని కన్నట్టుగా వారు పెట్టేవి స్వీకరించ సాగింది. వాళ్ళుకూడా కాన్టన్‌లాగే విశాల స్వభావం గలిగి, భేషజంలేని జీవితం గడుపుతో, నిజాన్ని సులువుగా గుర్తించగలవారు. అందుచేత వారు డాసన్‌లో ఉన్న కలపకోసే మిల్లు చేరేలోపుగా బక్ తత్వం గ్రహించి స్కీట్‌నూ, నిగ్‌నూ ముద్దుచేసినట్లు దాన్ని చెయ్యటానికి ప్రయత్నించలేదు.

కాని కాన్టన్‌పైన బక్ మమకారం నానాటికీ ఎక్కువవు తున్నట్టు కనబడింది. ఆ వేసవిప్రయాణాలలో దాని వీపున బరువు ఎత్తగల మనిషి అతను ఒక్కడే కని పించాడు. కాన్టన్ అడిగితే అది ఎలాటి పని అయినా చేసేది.

దుంగలు అమ్మిన డబ్బుతో వారు బంగారం తవ్వ టానికి డాసన్ వదిలిపెట్టి టనానా (Tanana) నది ఎగువకు దుకున్నారు. ఒకరోజు మనుషులూ, కుక్కలూ ఒక కొండ

అంచున కూచుని ఉన్నారు. వారి కింది కొండ నిటారుగా మూడువందల అడుగుల లోతుకు దిగి ఉన్నది. ఆ లోతున రాతి ప్రదేశం ఉన్నది. జాన్ కాన్టన్ అంచుకు సమీపంలో కూచుని ఉన్నాడు. కొంచెం ఎత్తున అతని భుజం సమీపంలో బక్ కూచున్నది. కాన్టన్ బుర్రలోకి ఒక అర్థంలేని ఆలోచన వచ్చింది. తాను చేయబోయే పని గమనించమని హాన్సుకూ, పీట్‌కూ సైగచేసి, అతను, "దూకెయ్యి, బక్!" అన్నాడు. తన చేతితో పక్కనున్న అగాధాన్ని చూపిస్తూ, బక్ దూకింది! అతను దాన్ని సమయానికి పట్టుకున్నాడు, ఇద్దరూ కలిసి కింద పడిపోకుండా మిగిలిన ఇద్దరు మనుషులూ పట్టుకుని, అంచునుంచి ఇవతలికి ఈడ్చవలసి వచ్చింది.

గండం తప్పి నోట మాట వచ్చినాక పీట్, "ఇది నమ్మే విషయం కాదు!" అన్నాడు.

కాన్టన్ తల అడ్డంగా తిప్పి, "లేదు, ఇది అద్భుతం, దారుణంకూడా. ఒకొక్కప్పుడు నాకే భయం వేస్తుంది తెలుసా?" అన్నాడు.

పీట్ బక్ కేసితల ఊపుతూ, "అది నీపక్కన ఉండగా నేనైతే నీమీద చచ్చినా చెయ్యి వెయ్యను" అన్నాడు.

"నేనుమాత్రం వేస్తానా?" అన్నాడు హాన్సు తన పరంగా మాట్లాడుతూ.

పీట్ అన్నమాట ఆ సంవత్సరం ఆఖరులో "సర్కిల్ సిటీ (Circle City)లో అక్షరాలా రుజు వయింది. అక్కడి పానశాలలో బర్టన్ అనే ఒక పొగరుబోతు కొత్తగా ఆ

ప్రాంతాలకు వచ్చిన ఒక మనిషితో పనిపెట్టుకుని పోట్లాట పెట్టుకున్నాడు. కాన్టన్ మంచిగా వారిమధ్య రాజీ చేయ బోయాడు. బక్ దాని అలవాటు ప్రకారం ఒక మూల పడుకుని, ముందుకాళ్ళమీద తల ఆనించి పెట్టుకుని తన యజమానిని చూస్తున్నది. మాటా పలుకూ లేకుండా బర్టన్ కాన్టన్‌ను చాచి కొట్టాడు. ఆ దెబ్బకు కాన్టన్ తిరిగిపోయి, పడకుండా ఆపుకోవటానికి గాను కౌగేచోట ఉండే అడ్డ కమ్మీ పట్టుకోవలిసి వచ్చింది.

మరుక్షణం అక్కడ ఉన్నవారికి భయంకరమైన అరుపు వినిపించింది. అది మొరుగులాగా లేదు, గర్జనలాగా ఉన్నది. బక్ తాను పడుకుని ఉన్నచోటనుంచి గాలిలోకి ఎగిరి సూటిగా బర్టన్ మెడకేసి నోరుచాచి రావటం కన పడింది. బర్టన్ సమయానికి చేతులు ముందుకు చాచి తన కంఠాన్ని కాపాడుకున్నాడు గాని, బక్ తాకుడుకు వెల్లికిలా పడిపోయాడు, అది అతనిపైన పడింది. దాని కోరలు అతని చేతి కండరాలలో దిగబడిపోయాయి. అది చేతిని వదిలేసి అతని మెడ అందుకోవటానికి ప్రయత్నించింది. ఈసారి అతను తన కంఠాన్ని సరిగా కాపాడుకోలేక పోయాడు. బక్ అతని కంఠాన్ని పీకింది. ఇంతలో నలుగురూ వచ్చి బక్‌ను లాగేశారు. కాని వైద్యుడు వచ్చి బర్టన్ రక్తస్రావాన్ని నిలపటానికి చికిత్స చేస్తున్నంతసేపూ, బక్ గుర్రుపెడుతూ అటూ ఇటూ పచారుచేస్తూ, మళ్ళా కలియబడటానికి చూసింది. దానిని దూరంగా ఉంచటానికి చాలా దుడ్డు కర్రలు కావలిసి వచ్చాయి. అప్పటికప్పుడే గనిదార్ల

(Miners) మీటింగు జరిపి, కోపం రావటానికి బక్‌కు తగిన కారణం ఉన్నదని తీర్పు ఇచ్చారు. అయితే బక్‌కు చాలా ఖ్యాతి వచ్చింది. అది అలాస్కాలో ఉన్న ప్రతి కాంపుకూ పాకింది.

మరికొంత కాలం గడిచాక బక్ తన యజమాని ప్రాణాన్ని మరొకవిధంగా కాపాడింది. ఒకసారి కాన్టన్ అతని భాగస్వాములూ, ఒక సన్నని నిడుపాటి తెప్పను శిలలమధ్యగా ప్రవహించే ఒక ఉప్పుటేరు వెంట తెస్తు న్నారు. ఎత్తునుంచి దిగువకు పోయే ఆ ప్రవాహం శరవేగం గలది. హాన్స్ పీట్‌లు పడవతాళ్లను పట్టుకుని ఒడ్డుననడుస్తూ, ఒడ్డునఉన్న చెట్ల సహాయంతో పడవ వేగాన్ని అరికట్టు తున్నారు. కాన్టన్ పడవలోనే ఉండి గడవేస్తూ, తన అను చరులకు హెచ్చరికలు చేస్తూ ఉపాయంగా పడవను దిగువకు పట్టుకొస్తున్నాడు. బక్ ఆదుర్దాగా పడవను అంటిపెట్టుకుని ఒడ్డున నడుస్తూ, తన యజమానిని వెయ్యి కళ్ళతో కాస్తు న్నది.

ఒకచోట ఏటిఒడ్డున పెద్ద రాళ్ళగుట్ట ఉండి, అది నీటి లోపలికి చొచ్చుకు వచ్చింది. పడవ దానిచుట్టూ తిరిగిపో వాలి. అందుచేత హాన్స్ తన చేతిలోఉన్న పడవతాటిని కొంత వదిలి, దానిచివరమాత్రం తనచేతిలో ఉంచుకున్నాడు, పడవ రాతిచుట్టూ తిరిగి రాగానే పగ్గం బిగలాగుదామని అతని ఉద్దేశం. అంతా సవ్యంగానే జరిగింది. కాని ప్రవాహం అతివేగంగా ఉండటంచేతా, హాన్స్ పగ్గాన్ని అతితొందరలో బిగలాక్కోవటంవల్లా ఒడ్డుకు దగ్గిరిగా వచ్చే పడవకాస్తా

బోల్తా కొట్టింది. కాన్టన్ ప్రవాహంలో పడిపోయాడు. అతి ప్రమాదకరమైన ఆ ఝరిలో పడితే గజ ఈతగాడు కూడా ప్రాణాలతో బయటపడలేడు. కాన్టన్ అలాటి ఝరిలో పడి కొట్టుకు పోసాగాడు.

మరుక్షణమే బక్ ప్రవాహంలోకి దూకి మూడు వందల గజాల దూరాన కాన్టన్‌ను చేరుకున్నది. అతను తన తోకను పట్టుకున్నట్టు తెలియగానే తన శక్తికొద్దీ అది ఒడ్డుకేసి ఈదసాగింది. కాని ఆ ఇద్దరూ ప్రవాహంలోపడి కొట్టుకుపోయే వేగంతో పోలిస్తే వారు ఒడ్డుచేరే వేగం అతి కొద్ది. మరికొంత దూరంలో ఈ ప్రవాహం భీభత్సరూపం దాల్చి నురుగులు కక్కుతూ శిలలను ఢీకొంటుంది. ఆ చప్పుడు వారికి వినిపిస్తున్నది. ఆ శిలలను చేరేముందు ప్రవాహ వేగం వర్ణనాతీతం. ఒడ్డు చేరటం సాధ్యంకాదని కాన్టన్ గ్రహించాడు. అతను ఏదో ఒక రాతిని పట్టుకుందామని రెండు వ్యర్థ ప్రయత్నాలు చేసి మూడోసారి, బక్ తోక వదిలేసి రెండుచేతులా రాతినిపట్టుకుని, ప్రవాహం మోతను మించి అరుస్తూ, "వెళ్ళిపో, బక్! వెళ్ళిపో!" అన్నాడు. అతను పట్టుకున్నరాయి పాచిపట్టి జారుతున్నది.

ప్రవాహానికి ఎదురీది వెనక్కు రావటానికి బక్ విశ్వ ప్రయత్నం చేసిందిగాని, దానికది సాధ్యంకాలేదు. అతను పెట్టిన రెండో కేకకు బక్ తలఎత్తి తన యజమానిని ఆఖరు సారి చూసే దానిలాగా చూసి, అతను చెప్పిన ప్రకారం ఒడ్డుకేసి ఈదసాగింది. అది బలంకొద్దీ ఈది ఒడ్డుకుచేరింది.

పీట్, హాన్స్ కలిసి దానిని ప్రవాహంనుంచి బయటికి లాగారు. వెంట్రుకవాసిలో అది చావు తప్పించుకున్నది. ఎందుకంటే మరికొంచెం దూరం అది ప్రవాహం వెంబడి పోయి ఉంటే ఒడ్డుకు ఈదటం అసంభవ మయిపోయేది.

ప్రవాహం ఒకవంక బలంగా ఈడ్చేస్తూంటే మనిషి జారుడు రాళ్ళను ఎంతోసేపు పట్టుకో లేడు; ఆసంగతి వాళ్లకు తెలుసు. వారు గబగబా ఎగువకు పరిగెత్తి, కాన్టన్ రాతిని పట్టుకుని ఉన్న చోటును కూడా దాటి ఇంకా పైకి వెళ్ళారు. పడవతాళ్ళలో ఒకటి తీసి బక్ నడుముకూ, మెడకూ కట్టారు; ఆ తాడు దాని మెడకు ఉచ్చులాగా, బిగియకుండానూ, ఈదటానికి అడ్డం రాకుండానూ జాగ్రత్త పడ్డారు; తరవాత బక్‌ను ప్రవాహంలోకి వదిలారు. బక్ చొరవగానే ప్రవాహం మధ్యకు ఈదుకు పోయిందిగాని, తగినంత వేగంగా ప్రవాహ మధ్యాన్ని చేరకపోవటంచేత అది, కాన్టన్ అంత దూరంలో ఉండగానే అతన్ని దాటి ప్రవాహంవెంట కొట్టుకుపోయింది.

కాని హాన్స్ వెంటనే తాటిని లాగిపట్టి బక్‌ను పడవను ఆపినట్టు ఆపాడు. కాని ఆ తాడు దాన్ని నీటిఅడుక్కు లాగేసింది. అది ఒడ్డు చేరేనదాకా నీటిలో మునిగే ఉన్నది. అది నీటిలో బుటక వేసి నీరు మింగింది. అది చూసి హాన్స్, పీట్‌లు దానిపైనబడి శరీరమంతా మర్దించి, నీరు కక్కించారు. అది కాళ్ళమీద నిలబడబోయి కింద పడిపోయింది. ఇంతలో వారికి కాన్టన్ పెట్టే కేకలు అస్పష్టంగా వినిపించాయి. మాటలు తెలియరాలేదు గాని అతను ప్రమా

దంలో ఉన్నట్టు వారికి అర్థమయింది. తన యజమాని గొంతు వినగానే బక్ కు "ఎలెక్ట్రిక్ షాక్" తగిలినట్టయింది. అది చివాలున లేచి ఒడ్డువెంట ఎగువకు, మొదట తాను తాడుతో దిగినచోటికి, మనుషులకన్న వేగంగా పరిగెత్తింది.

మళ్ళీ దానికి తాడు అమర్చి నీటిలో వదిలారు. ఈసారి అది ప్రవాహం మధ్యకు అతివేగంగా ఈదుకు పోయింది. ఒకసారి చేసిన పొరపాటు అది రెండోసారి చేయ దలచలేదు. హాన్స్ దానికి కావలిసిన విధంగా తాడు విడి చాడు. విడిచే తాడు చుట్ట చుట్టుకుని ముడి పడకుండా పీట్ సరిచేస్తూ వచ్చాడు. ప్రవాహం వెంట అది కాన్టన్ చేరక మునుపే అతనికి సూటిగా వచ్చింది. తరవాత అది శర వేగంతో కాన్టన్ వేపు ఈదింది. కాన్టన్ తనమీదికి బలంగా వచ్చి పడే సమయానికి రాతినుంచి చేతులు వదిలేసి దాని మెడ వాటేసుకున్నాడు. హాన్స్ తాటిని ఒక్క చెట్టుకు మెలికవేసి బిగలాగాడు. వెంటనే కుక్కా, కాన్టన్ నీటి అడుగుకు వెళ్ళిపోయారు. నీటి అడుగున ఊపిరాడక కొట్టు కుంటూ, ఒకసారి కిందూ ఇంకొకసారి మీదూ అవుతూ, నీటి అడుగునఉన్న రాళ్ళను దోక్కుంటూ ఇద్దరూ ఎలా గైతేనేం ఒడ్డు చేరుకున్నారు.

కాన్టన్ కు స్పృహ తెలిసేసరికి తనను తన అను చరులు ఒక దుంగపై బోర్లా పడుకోబెట్టి అటూ ఇటూ దొర్లిస్తూ ఉండటం తెలిసింది. అతను బక్ కోసం చూశాడు. దాని ఆకారం శవంలాగా కనబడింది. నిగ్ దాని పక్కన కూచుని ఏడుస్తున్నది. స్కీట్ బక్ ముఖాన్నీ, మూసుకుని

టక్ ఒక్కసారి సీట్లో దూకింది....

ఉన్న కళ్ళనూ నాకుతున్నది. కాన్టన్ శరీరమంతా గాయా లయి, నలగగొట్టినట్టుగా ఉన్నది. బక్‌కు స్పృహ తెలిశాక, అతను దాని శరీరమంతా తడివి, దాని పక్క ఎముకలు మూడు విరిగిపోయా యని తెలుసుకున్నాడు.

"లాభం లేదు. మనం ఇక్కడ కాంపు వెయ్యవలి సిందే!" అన్నా డతను. బక్ ఎముకలు మళ్ళీ కలుసుకున్న దాకా వారా స్థలంలోనే మజిలీ చేశారు.

ఆయేడు శీతాకాలంలో డాసన్‌వద్ద బక్ మరొక "ఫీట్" చేసింది. అందులో ధైర్య సాహసాలు అట్టే లేక పోయినా దాని మూలంగా అలాస్కాలో దాని ఖ్యాతి చాలా పెరిగింది. అది అలా ఉంచి ఈ "ఫీట్"తో ముగ్గురు భాగస్వాములూ మంచి లాభంచేసి, దాని సహాయంతో వారు ఎంతకాలంగానో కలవరిస్తున్న తూర్పు ప్రయాణం చేసేటందుకు ఏర్పాట్లు చేసుకో గలిగారు. (బంగారం అన్వే షిస్తూ తూర్పుగా వెళ్ళినవారు అరుదు.)

ఈ సంఘటన ఎల్డొరాడో పానశాలలో ఆరంభ మయింది. అక్కడ చాలామంది చేరి తమ తమ కుక్కలను గురించి గొప్పలు చెప్పుకుంటున్నారు. బక్ అదివరకు అనేక ఘనకార్యాలు చేసి ఖ్యాతి సంపాదించి ఉండటంవల్ల అందరూ దానిపైకే పోటీకి వచ్చారు. కాన్టన్ దానిని సమర్థించవలసి వచ్చింది. ఒక అరగంటసేపు సంభాషణ జరిగాక ఒకడు తన కుక్క అయిదువందల పౌనుల బరువుగల స్లెడ్‌ను కదిలించి లాక్కుపోగల దన్నాడు. ఇంకొకడు తన

కుక్క ఆరువందల పౌనులు లాగుతుందనీ, మరొకరు ఏడు వందల పౌనులు లాగుతుందనీ అన్నారు.

"ఓస్, బక్ వెయ్యిపౌనులు లాగేస్తుంది!" అన్నాడు కాన్టన్.

"వెయ్యి పౌనులు బరువును కదిలించి, నూరుగజాలు ఈడుస్తుందా?" అన్నాడు మాత్యోసన్. ఇతను బంగారం తవ్వి చాలా డబ్బు చేసుకున్నవాడు. తన కుక్క ఏడువందల పౌనులు లాగుతుందన్నవాడుకూడా ఇతనే.

"అంత బరువూ కదిలించి, నూరు గజాలు ఈడుస్తుంది!" అన్నాడు కాన్టన్ నిబ్బరంగా.

మాత్యోసన్ అందరూ వినగలందులకు నింపాదిగా మాట్లాడుతూ, "సరే, లాగలేదని నేను వెయ్యి డాలర్లు పందెం వేస్తాను. ఇదుగో!" అంటూ అతను బల్లపైన ముడి బంగారం మూటను ఉంచాడు.

ఎవరూ మాట్లాడలేదు. కాన్టన్ గప్పాలు కొట్టిఉన్నట్లయితే అది బయటపడే పరిస్థితి వచ్చింది. అతని మొహం జేవురించింది. అతను నోరు జారి అనేశాడేగాని బక్ నిజంగా వెయ్యి పౌనుల బరువు లాగుతుందో, లేదో అతనికీ తెలీదు. అరటన్ను బరువు! తలుచుకుంటేనే అతనికి భయంవేసింది. అంత బరువు లాగే శక్తి బక్‌కు ఉన్నదని అతను చాలా సార్లు అనుకున్నాడేగాని, ఆ సంగతి ఇప్పుడు నిరూపించవలసి వచ్చింది. ఒక డజనుమంది మనుషులు అతనికేసి

మౌనంగా చూస్తున్నారు. అదీగాక అతనివద్ద పందెంకాయ టానికి వెయ్యి డాలర్లు లేవు; హాన్స్, పీట్‌లవద్దకూడా లేవు.

"వెయ్యి పౌనుల బరువు ఎక్కడ తెస్తామని అనుమానించకు. బయట నా స్లెడ్‌పైన యాభయ్యేసి పౌనుల పిండి బస్తాలు ఇరవై ఉన్నాయి!" అన్నాడు మాత్యోసన్, పుండుపైన కారం అద్దినట్టుగా.

కాన్టన్ జవాబివ్వలేదు. ఏమయినా అతనికి తోచ లేదు. ఆలోచనాశక్తి కోల్పోయి దాన్ని తిరిగి తనకెవ రైనా ప్రసాదిస్తారా అని చూసేవాడిలాగా అతను ఒక్కొక్క ముఖమే చూశాడు. అతనికి జిమ్ ఓబ్రాన్ ముఖం కనిపించింది. జిమ్ ధనికుడు, పాత స్నేహితుడు. ఆ ముఖం కన బడగానే కాన్టన్ జన్మలో ఎన్నడూ చెయ్యనిపని చేశాడు.

"ఒక వెయ్యి అప్పు పెట్టగలవా?" అని అతను దాదాపు రహస్యం అడిగినట్టు అడిగాడు.

"తీసుకో, కాని నీ కుక్క గెలుస్తుందని నాకేమీ నమ్మకంలేదు, జాన్," అంటూ జిమ్ ఓబ్రాన్ ఒక సంచీ ఎత్తి మాత్యోసన్ సంచీ పక్కనే పెట్టాడు,

పందెం చూడటానికి "ఎల్డొరాడో"లోని వాళ్ళంతా వీధిలోకి వచ్చారు. బల్లలన్నీ ఖాళీ అయాయి. అనేక వందలమంది చలిదుస్తులు ధరించినవాళ్లు బయటఉన్న స్లెడ్ చుట్టూ మూగారు. కొందరు పందాలు కాస్తున్నారు, కొందరు పుచ్చుకుంటున్నారు. మంచు చలికి అరవై డిగ్రీలు దిగువగా ఉన్న చలిలో మాత్యోసన్ స్లెడ్, వెయ్యిపౌనుల

పిండిని మోస్తూ రెండు గంటలనుంచీ మంచులో ఉన్నది. స్లెడ్ తాలూకు నిలువు కర్రలు మంచులో బిర్ర బిగుసుకు పోయాయి. బక్ స్లెడ్‌ను కదిలిస్తుందనేవారికి రెట్టింపు సొమ్ము ఇస్తామని కొందరు పందాలు ఇవ్వసాగారు. "స్లెడ్‌ను కదిలించటం" అంటే అర్థ మేమి టని ధర్మ సందేహం వచ్చింది. స్లెడ్ నిలువు కర్రలను మంచునుండి విడగొట్టినాక బక్ స్లెడ్‌ను కదిలించటం ధర్మమని జబ్రీన్ అన్నాడు. స్లెడ్‌ను మంచునుంచి విడగొట్టటం కూడా బక్ పనేనని మాత్యోసన్ వాదించాడు. ఎక్కువమంది మత్యోసన్‌ను బలపరిచారు. బక్‌కు ఎదురుగా పందాలు ఇస్తున్నవారు బక్ గెలిస్తే మూడింతలు ఇస్తామన్నారు. కాని పందెం కాసే వారు లేకపోయారు. కాన్టన్ ఈ పందెంలో తల దూర్చాడే గాని అతని మనస్సు సంశయాకులంగానే ఉన్నది. స్లెడ్‌నూ, మంచులో పడుకునిఉన్న పది కుక్కలనూ చూసేసరికి బక్ నెగ్గటం అసంభవంగా తోచింది. మాత్యోసన్ ఉత్సాహం పెరిగిపోతున్నది.

"ఒకటికి మూడిస్తాను. కావలిస్తే ఆ లెక్కన వెయ్యి డాకా కాస్తాను, ఏమంటావు కాన్టన్?" అన్నాడాయన.

కాన్టన్ సంశయం అతని ముఖంలో కనిపిస్తూనే ఉన్నది; కాని అతనికి మానుషం రెచ్చిపోయింది. మానుషం సాధ్యాసాధ్యాలను పాటించదు, దానికి పోరాడాలన్న ఆవే శమే తప్ప మరేమీ తోచదు. అతను హాన్స్‌నూ, పీట్‌నూ పిలిచాడు. ముగ్గురిదగ్గిరా కలిపి రెండువందల డాలర్లే

ఉన్నాయి. వారి పెట్టుబడి, భవిష్యత్తూ అదే అయినప్పటికీ వారు సంకోచించకుండా ఆ మొత్తాన్ని మాత్యోసన్ ఆరు వందల డాలర్లను ఎదురుపణంగా పెట్టేశారు.

స్లెడ్‌కు కట్టిఉన్న పది కుక్కలనూ విడదీసి బక్‌ను దాని జీనుతోనే కట్టారు. ఉద్రేకం దాన్నికూడా ఆవహించింది. తాను జాన్ కాన్టన్‌కు ఏదో మహత్తరమైన ఉపకారం చేసే అవకాశం వచ్చిందని దానికి అర్థమయింది. అద్భుతమైన దాని శరీరాన్ని చూడగానే జనంలో గుసగుసలు బయలుదేరాయి. దాని దేహస్థితి అద్భుతంగా ఉన్నది. నూటయాభై పౌనుల బరువుగల దాని శరీరంలో ప్రతికణమూ జవసత్వాలతో కూడిఉన్నది. దాని జూలు సిల్కులాగా నిగనిగ లాడుతున్నది. దాని మెడమీదా, జూలుమీదా ఉన్న రోమాలు అప్పుడే సగం లేచి ప్రతి రోమనూ శక్తితో కూడుకుని ఉన్నట్టుగా కనిపిస్తున్నది. విశాలమైన దాని రొమ్మూ, బలమైన ముందుకాళ్ళూ దాని శరీరానికి తగి ఉన్నాయి. దాని చర్మంలోనుంచి బలిష్ఠమైన దాని కండరాలు పొడుచుకు వస్తున్నాయి. కొందరు దాని కండరాలు పట్టి చూసి అవి ఉక్కుముక్కలు గాని కండరాలు కావని అన్నారు. పందాలిచ్చేవారి ఉత్సాహం కొంత తగ్గింది. బక్ మీద పందెం కాసేవారి సొమ్ముకు వారిప్పుడు రెట్టింపు ఇస్తామన సాగారు.

ఒక సరికొత్త రాజవంశానికి చెందిన "స్కూకమ్ బెంచెస్" (Skookum Benches) రాజుగారు, "బహు

బాగండి! ఆ కుక్కను ఎనిమిది వందలకు కొంటామండి! పందెంతో పని లేదండి! ఉన్నపళంగా దానికి ఎనిమిది వందలు ఇచ్చేస్తామండి!" అన్నాడు.

కాన్టన్ తల అడ్డంగా తిప్పి బక్ దగ్గరికి వెళ్ళాడు.

"నువ్వు ఎడంగా ఉండాలి" అని మత్త్యోసన్ అభ్యంతరం చెప్పాడు.

అందరూ మాట్లాడటం మానేశారు. జూదగాళ్లు బక్ గెలిస్తే రెట్టింపు ఇస్తామని కేకలు పెడుతూనే ఉన్నారు. గాని డబ్బు కాసేవాళ్లు లేకపోయారు. బక్ అద్భుతమైన కుక్క అని అందరూ ఒప్పుకున్నారు. కాని స్లెడ్ పైన ఉన్న పిండిబస్తాలు సామాన్యమైన బరువు కాదు. అందుచేత ఎవరూ చూస్తూ చూస్తూ బక్ పైన పందెం కాయలేకపోయారు.

కాన్టన్ బక్ పక్క మోకరించి, దాని తల తన చేతుల్లోకి తీసుకుని, దాని చెంపకు తన చెంప ఆనించాడు. అతను దాన్ని మామూలుగా ఊపినట్టు ఊపనూ లేదు, ప్రేమగా తిట్టనూ లేదు; కాని దాని చెవిలో రహస్యంగా, "నిజంగా నాపైన ప్రేమ ఉంటే...!" అన్నాడు. బక్ ఉద్రేకం అణుచుకొంటూ మూలిగింది.

జనం ఆత్రంగా చూస్తున్నారు. వారి కిదంతా ఒక గారడీ ప్రదర్శనంలాగా తోచసాగింది. కాన్టన్ లేచి నిలబడే టప్పుడు తొడుగుతో ఉన్న అతని చేతిని బక్ తన నోటితో పట్టుకుని నొక్కి, మెల్లిగా, అయిష్టంగా విడిచిపెట్టింది. అతని

ప్రేమకు అదే దాని జవాబు. కాన్టన్ ఎడంగా వచ్చేసి, "సిద్ధంగా ఉండు, బక్ !" అన్నాడు.

బక్ కళ్ళాలు లాగిపట్టి మళ్ళీ కొన్ని అంగుళాలు సడలించింది. అలా చేయటం అది నేర్చుకొన్నది.

"జీ"! అని కాన్టన్ గట్టిగా కేకపెట్టాడు.

బక్ కుడివైపుతిరిగి బలంకొద్దీ ఒక్కగుంజు గుంజింది. స్లెడ్‌పైన ఉన్న బరువు వణికింది. స్లెడ్ నిలువు కర్రల క్రింది మంచు పెళాపెళా మన్నది.

"హా !" అన్నాడు కాన్టన్ ఆజ్ఞాపిస్తూ.

బక్ ఎడమవైపుకు తిరిగి వెనకటిలాగే గుంజింది. ఈసారి పెళ్ళున ఏదో విరిగినట్టు చప్పుడయింది. స్లెడ్ పక్కకు తిరిగింది, అడ్డకర్రలు మంచుమీద గరగరలాడుతూ కొన్ని అంగుళాలు పక్కకు జరిగాయి. స్లెడ్ మంచుపట్టు నుంచి విడిపడింది. అందరూ ఊపిరి బిగపట్టి ఉన్నారు. ఆ సంగతి వారికి తెలియదు.

"ఇప్పుడు, మష్ !"

"మష్" అని కాన్టన్ పెట్టిన కేక పిస్తోలుపేలుడులాగా మారుమోగింది. బక్ తన శక్తినంతా ఒడ్డి ముందుకు దూకింది. దాని శరీరమంతా ఒక యంత్రంలాగా అయిపోయింది. దాని కండరాలు లాగే ప్రయత్నంలో ముడుచుకుంటూ, చాచుకొంటూ కనిపిస్తున్నాయి. దాని రోమాగ్రా,

జీ (Gee), హా (Haw), మష్ (Mush) అనేమాటలు స్లెడ్‌తోలేవారు కుక్కలకు తెలిపే సంకేతాలు.

తలా నేలకువంగి ఉన్నాయి. దానికాళ్ళు విపరీతమైన వేగంతో ఆడుతున్నాయి; వాటిగోళ్లు రాయిలాటి మంచులో గాట్లు చేస్తున్నాయి. స్లెడ్ ఊగి, కంపించి, కొంచెంగా ముందుకు జరిగింది. బక్ కాళ్ళలో ఒకటి జారింది, ప్రేక్షకు లలో ఒకడు గట్టిగా ఆర్తనాదం చేశాడు. ఆ తరవాత స్లెడ్ కొంచెం కొంచెంమే ముందుకు జరుగుతూ, ఆగుతూ రాసా గింది. కాని ఒక్కసారికూడా అది పూంతం ఆగలేదు. అది జరిగే దూరంకూడా అరంగుళం, అంగుళం, రెండంగుళాలు— అలా పెరిగి నడకలోకి మారింది. త్వరలోనే దానివేగం హెచ్చింది.

ప్రేక్షకులు ఒక్కసారి గాలిపీల్చి మళ్ళీ ఊపిరి తీయ సాగారు. థార్నటన్ వెనకగా పరిగెత్తుతూ చిన్న చిన్న మాట లతో బక్‌ను ప్రోత్సహిస్తున్నాడు. సరిగా నూరుగజాల దూరాన వంటచెరుకు పోగు ఉన్నది. బక్ దాన్ని సమీ పిస్తున్నకొద్దీ జనంలోనుంచి హర్షధ్వని బయలుదేరింది. బక్ ఆ గుట్టదాటి, ఆగమనేసరికి ఆగిపోగానే ఆ హర్షధ్వని పెద్ద కల్లోలంగా మారింది. ప్రతివాడికీ వెర్రి ఆవేశం వచ్చింది, మాథ్యూసన్‌కుకూడా. చేతి తొడుగులూ, టోపీలూ పైకి ఎగురుతున్నాయి. అందరూ ఒకరిచేతులు ఒకరు విచక్షణ లేకుండా పట్టుకుని అభినందించుకుంటున్నారు. ఎవరు మాట్లాడేదీ మరొకరికి తెలియటంలేదు.

థార్నటన్ మాత్రం బక్ పక్కన మోకరించాడు. రెండు తలలూ ఒకదానికొకటి చేరుకున్నాయి. అతను కుక్కను

ఎంతో అపేక్షతోనూ అనురాగంతోనూ అడ్డమైన తిట్లూ తిట్టుతూండటం అతని సమీపానికి వెళ్ళినవారికి వినిపిం చింది.

"మహా బాగండీ! దానికి వెయ్యి ఇస్తామండీ— పన్నెండు వందలండీ!" అని స్కూకమ్ బెంచి రాజావారు విల విల లాడుతున్నాడు.

కాన్టన్ లేచి నిలబడ్డాడు. అతని కళ్ళు తడిగా ఉన్నాయి. చెక్కిళ్ళ వెంబడి కన్నీటిధార లున్నాయి. అతను స్కూకమ్‌బెంచి రాజాతో, "అక్కర్లేదండి. తమరు వెళ్ళి ఎందు లోనైనా దూకండి-మీకు నేనంతకంటె ఏమీ చెప్ప టానికి లేదండి" అన్నాడు.

బక్ కాన్టన్ చేతిని నోటితో పట్టుకున్నది. కాన్టన్ దాన్ని వెనక్కూ, ముందుకూ ఆడించాడు. చుట్టూ మూగిన జనం కూడబలుక్కున్న వారిలాగా మర్యాదగా దూరంగా వెళ్ళారు. వాళ్ళు మళ్ళీ ఆ ఇద్దరిమధ్యకూ రావటానికి ప్రయ త్నించలేదు.

# 7

## పిలుపు

అయిదునిమిషాల కాలంలో బక్ కాన్టన్‌కు పదహారు వందల డాలర్లు సంపాదించి పెట్టింది. ఇందువల్ల అతను తన అప్పులు తీర్చి, తన భాగస్వాములతో సహా తూర్పు అల స్కాకు పోగలిగాడు. అక్కడ ఒకగని అజ్ఞాతంగా ఉన్నట్టు అనాదిగా ఒక ప్రతీతి ఉన్నది. దాన్ని వెతుక్కుంటూ అది

వరకు చాలామంది వెళ్లారు. కాని దానిజాడ తెలుసుకున్న వారు అరుదు. దానికోసం వెళ్ళి మళ్ళీ తిరిగిరానివారి సంఖ్య హెచ్చు. ఈ గని "మిస్టరీ"కీ, అపాయానికీ ఆటపట్టుగా ఉంటూ వస్తున్నది. దీనిని మొదట కనిపెట్టినవా డెవడో ఎవరికీ తెలియదు. దానిని అన్వేషించినవారి కథలే అమలులో ఉన్నాయి. అన్ని కథలలోనూ చెక్కల గుడిసె (Cabin) ఒకటి ఉన్నది. అది గనివద్దనే ఉన్నదని కొన ప్రాణాలతో ఉన్నవాళ్ళు ప్రమాణాలు చేశారు; ఆ మాట రుజువుచెయ్యటానికి వాళ్ళు బంగారు కణికలు చూపారు కూడా. ఉత్తరాన గల గనిలోనూ అలాటి కణికలు దొరకవు.

కాని ఈ నిక్షేపమైన గనిని బతికిఉన్న వారెవరూ చూసిన పాపానపోలేదు, చూశానన్న వారంతా చచ్చిపోయి నారు. అందుచేత జాన్ కార్టన్, పీటర్, హాన్స్‌లు బక్ తోనూ, మరి ఆరు ఇతర కుక్కలతోనూ తెలియని దారిన తూర్పుగా బయలుదేరారు. ఈ మనుషులకూ, ఈ కుక్కలకూ తీసిపోని మనుషులూ, కుక్కలూ లోగడ అదేదారిన వెళ్ళి అపజయాన్ని అనుభవించి ఉన్నారు. వారు యూకాన్ ఎగువకు డెబ్భైమైళ్ళు స్లెడ్‌తో ప్రయాణించి, ఎడమవైపుకు స్టూవర్ట్ నదిలోకి తిరిగి, మేయో, మాక్ క్వశ్చన్‌లు దాటి, ఖండానికి వెన్నుపూసలలాటి పర్వతశిఖరాల మధ్యగా స్టూవర్ట్ నది సన్నని వాగులాగా ప్రవహించే ప్రాంతానికి వెళ్ళారు.

జాన్ కాన్టన్ మనిషిపైనగాని, ప్రకృతి పైనగాని ఆట్టే ఆధారపడేవాడు కాదు. అతను గుప్పెడు ఉప్పూ, ఒక తుపాకీ వెంటబెట్టుకుని ఏ కీకారణ్యంలోకి అయినా ధైర్యంగా పోగలడు, అక్కడ ఎంతకాలమైనా ఉండగలడు. అతను ఏ మాత్రమూ ఆత్రపడకుండా, అమెరికన్ ఇండియన్లలాగా, రోజల్లా ప్రయాణం చేస్తూనే తన ఆహారాన్ని వేటాడుకునే వాడు. వేట చిక్కకపోయినా ఆగేవాడుకాడు, ఎప్పటికైనా దొరకకపోదని అతనికి తెలుసు. అందుచేత ఈ ప్రయాణంలో వారు స్లెడ్ పైన తుపాకులూ, తూటాలూ, గని పరికరాలూ తప్ప ఆహారమేమీ వేసుకోక, దారివెంబడి అచ్చగా మాంసాహారంపై ఆధారపడ్డారు. ఈ ప్రయాణానికి కాలావధి అంటూ ఏమీ లేదు.

బక్ కు మటుకు ఈ వేటాడటమూ, చేపలు పట్టటమూ, కొత్త ప్రదేశాలవెంట దారీ తెన్నూ లేకుండా తిరగటమూ మహా ఆనందంగా ఉంది. కొన్నివారాలపాటు క్రమబద్ధంగా ప్రయాణం సాగేది, ఆ తరవాత అనేకవారాలపాటు అక్కడా అక్కడా మజలీలు పడేవి. కుక్కలకు పనీ పాటూ ఉండేదికాదు. మనుషులు గోతులు తవ్వి మట్టితీసి అంతులేకుండా కడిగేవాళ్లు. ఒకప్పుడు వేట దొరకక తిండి ఉండేదికాదు, మరొకప్పుడు ఎక్కతొక్కినట్టు తినటం జరిగేది. వేసవి వచ్చింది. మనుషులూ, కుక్కలూ కూడా వీపులపైన బరువు నెత్తుకుని, తెప్పలమీది కొండ సరస్సులను దాటారు, అడివికలప కోసి తయారుచేసిన తేలిక పడవలపై

ఊరూ పేరూ లేని నదులలో ఎగువకూ, దిగువకూ ప్రయాణం చేశారు.

నెలలు గడుస్తున్నాయి. దారీ తెన్నూ లేని ఆ మహా ప్రదేశమంతటా వారు కలయదిరిగారు. అక్కడ మనుషు లెవరూ లేరు, కాని చెక్కలగుడిసె ఒకటి నిజమైతే అటుగా మనుషులు ఒకప్పుడు వచ్చిఉండాలి. వారు వేసవి వర్షాలకు తడుస్తూ తిరిగారు, సూర్యుడు అస్తమించని ఉత్తర ధృవ ప్రాంతపు ఎండలో గరికిపోచ మొలవని కొండలమీద చలికి వణికారు, వేసవిలో ఈగలు ముసిరే లోయలు ప్రవేశిం చారు, హిమానీ నదాల ప్రాంతాలలో కమ్మని పళ్ళూ, అందమైన పూలూ కోశారు. ఆయేడు శీతాకాలారంభంలో వారు సరస్సులుండే ఒక అయోమయ ప్రాంతంలో ప్రవేశిం చారు. అక్కడికి ఒక తరుణంలో అడవిపక్షులు వచ్చి వెళ్లాయిగాని, ఇప్పుడక్కడ ఏ ప్రాణికూడా లేదు—ఈదురు గాలీ, గాలికొట్టని ప్రాంతాల పేరుకుంటున్న మంచూ, నిర్జన సముద్ర తీరంలో అలలు చేసే విషాదకరమైన మోతా మాత్రమే ఉన్నాయి.

ఆ చలికాలమంతా వారు దారీ తెన్నూ లేకుండా తిరిగారు. అంతకు పూర్వం మనుషులు నడిచిన దార్లు ఏనాడో మాసిపోయాయి. ఒకసారి వారికి ఒక అరణ్యాం మధ్యగా ఒక పురాతనమైన దారి ఒకటి కనిపించి, చెక్కల గుడిసె సమీపంలోనే ఉన్నట్టు తోచింది. కాని తీరాచూస్తే అది ఎటూగానిచోట ఆరంభమై ఎటూగానిచోట అంత

మైంది. ఆ దారి వేసిన వాడెవడో, ఎందుకు వేశాడో తెలియరాలేదు. ఇంకొక సారి వారికి శిథిలమైపోయిన వేట గాడి మకాం ఒకటి కనిపించింది. చివికిపోయిన దుప్పట్ల మధ్య జాన్ కార్టన్‌కు ఒక పాతకాలపు తుపాకీ దొరికింది. అది హడ్సన్ బే కంపెనీ తయారుచేసిన దనీ, ఒకప్పుడా తుపాకీ కొనాలంటే దాని ఎత్తున తోళ్ళు పేర్చి ఇవ్వవలసి వచ్చేదనీ అతను ఎరుగును. అంతే, ఆ మకాం నిర్మించిన వాణ్ణి గురించి ఇంకేమీ తెలియరాలేదు.

మళ్ళీ వసంతకాలం వచ్చింది. వారు తిరిగి తిరిగి గమ్యస్థానం చేరుకున్నారు. అక్కడ చెక్కలగుడిసె లేదు గాని ఒక లోయమధ్య బంగారపు దొన్నె దొరికింది. ముడి పదార్థం కడిగే గుంటె అడుగున పసుపువన్నె వెన్నలాగా బంగారం కనిపిస్తున్నది. వారిక ముందుకుపో లేదు. వారికి పని చేసిన రోజునల్లా అనేక వేల డాలర్లు ఖరీదుచేసే ముడి బంగారమూ, బంగారు కణికలూ లభిస్తున్నాయి. వారు ప్రతి రోజూ విడకుండా పని చేస్తున్నారు. ఆ బంగారాన్ని తోలు సంచీలలో నింపి తమ కుటీరం వెలపల వంటచెరుకు పేర్చినట్టు పేర్చారు. ఒక్కొక్క సంచీలోనూ యాభై పౌనుల బంగారం ఉన్నది. వారు రాక్షసిబలంతో పనిచేస్తున్నారు. కలలో లాగా రోజులు అతివేగంగా గడిచిపోతున్నాయి, బంగారపు రాశి పెరిగిపోతున్నది.

అప్పుడప్పుడూ కార్టన్ వేటాడి చంపిన జంతువులను చేరవేయటం తప్ప కుక్కలకు వేరే పనిలేదు. బక్ గంటల

తరబడి చలిమంట వద్ద కూచుని ఏదో ఆలోచించేది. వంటి నిండా బొచ్చుగల కాలుపొట్టిమనిషి ఇప్పుడు దానికి తరుచు కనిపిస్తున్నాడు. దానికి పనిలేకపోవటమే ఇందుకు కారణం. తరుచు అది ఆ మనిషి వెంట గతించిపోయిన మరొక ప్రపంచంలో సంచరించినట్టు భావించేది.

ఈ మరొక ప్రపంచంలో అతి ప్రధానమైనది భయం. ఆ బొచ్చుమనిషి తన తలను మోకాళ్ళమధ్యా, తన చేతులను నెత్తిమీదా పెట్టుకొని, నిప్పు సమీపంలో నిద్రపోయే టప్పుడు, అతని నిద్ర సుఖంగా ఉండేది కాదు; తరుచు ఉలికి పడి లేచేవాడు, భయంగా చీకట్లోకి చూసి, మంటలో మరి కొన్ని కట్టెలు వేసేవాడు. సముద్ర తీరాన నడిచేటప్పుడు వాడు గుల్లచేపలు ఏరుకుని అలాగే తినేసేవాడు; అప్పుడు కూడా వాడి కళ్ళు అపాయం కోసం అటూ ఇటూ చూస్తూండేవి. అపాయం ఎదురైతే పరిగెత్తటానికి వాడి కాళ్లు సిద్ధంగా ఉండేవి. అరణ్యంగుండా వాడు పిల్లిలాగా నిశ్శబ్దంగా ముందుకు పోతూంటే బక్ వాడి వెనకాలే పోయేది. ఇద్దరూ చాలా హెచ్చరికమీదనే ఉండేవారు, వారి చెవులు రిక్కించి ఉండేవి. ముక్కులు పసికడుతూండేవి. పసికట్టటంలో బక్‌కు ఉన్నంత శక్తి వాడికీ ఉంది. ఆ బొచ్చు మనిషి అవలీలగా చెట్లెక్కి, నేలమీద నడిచినంత సులువుగా చెట్లమీదకూడా ఒక కొమ్మనించి పన్నెండడుగుల దూరంలో వున్న మరొక కొమ్మకు దూకగలడు, ఒక కొమ్మ వదలి రెండోదాన్ని పట్టుకునేటప్పుడు ఎన్నడూ కిందపడడు. వాడికి

పట్టు తప్పటమంటూ లేదు. వాడికి నేలపైని నివసించటం చేతనయినంత బాగా చెట్లమీద నివసించటమూ చేతనవును. ఆ బొచ్చుమనిషి చెట్టుమీదచేరి నిద్రపోతుంటే అనేక రాత్రులు తాను కింద కాపలా కాయటం బక్ కు జ్ఞాపకం ఉన్నది.

ఈ బొచ్చుమనిషి స్మరణలతో బాటే దానికి అరణ్య మధ్యంనుంచి పిలుపుకూడా వినిపించేది. ఆ పిలుపు మూలాన దానిలో ఏదో అస్థిమితమూ, వింతకోరికలూ ఏర్పడేవి. దానికి ఒక అస్పష్టమైన ఆనందం కలిగి, ఏదో చెయ్యాలన్న వెర్రి ఆవేశం పుట్టుకొచ్చేది. ఆ పిలుపు వెతికితే కనిపించే వస్తువన్నట్టుగా అది దాన్ని వెతుక్కుంటూ అరణ్యంలోకి వెళ్ళి, ఒకప్పుడు చిన్నగాను, మరొకప్పుడు గట్టిగానూ మొరిగేది. అది తన రొట్టెను చల్లని అడవి నాచులోకీ, నేలమీది గడ్డిలోకి దూర్చి మట్టి వాసనలకు పారవశ్యం చెందేది. లేదా అది పడిపోయి పాచిపట్టిన చెట్టు బోదెల వెనక గంటలతరబడి ముడుచుకు కూర్చుని, దాగిఉన్నట్టు నటిస్తూ, కళ్ళూ చెవులూ విప్పి చుట్టూ జరిగేదంతా గమనించేది. అలా పొంచిఉంటే తనకు అర్థంగాని ఆ పిలుపు ప్రత్యక్ష మవుతుందని దాని ఆశ అయి ఉండవచ్చు. కాని తాను ఈ పనులన్నీ ఎందుకుచేస్తున్నదీ దానికి తెలియదు. దానికి అలా చెయ్యాలనిపించి చేసేసేది.

అణగని ఆవేశాలు కొన్ని ఆవహించాయి. అది ఎండవేళ తమ శిబిరంలో బద్ధకంగా పడుకుని జోగుతూ, అక

స్మాత్తుగా తలఎత్తి చెవులు రిక్కించేది, శ్రద్ధగా ఆలకించేది, చివాలున లేచి పరిగెత్తుతూ, అలా గంటలతరబడి అడవిచెట్ల మధ్యగా, మైదానాలమీద తిరిగేది. ఎండిపోయిన వాగుల వెంబడి పరిగెత్తటమూ, అడవిలో నివసించే పక్షులకు సమీపంగా పాకిపోయి వాటి బతుకులు గమనించటమూ దానికి ఇష్టం. ఒక్కొకసారి ఒక రోజల్లా పొదలలో పడుకుని అది పక్షులను గమనించేది. వేసవికాలపు అర్ధరాత్రులలో ఆ ప్రాంతంలో ఉండే సంధ్యాకాంతిలో పరిగెత్తుతూ, అరణ్యంలో వినవచ్చే అస్పష్టమైన మోతలను వింటూ, మనుషులు పుస్తకం చదివి అవగాహనచేసుకున్నట్టుగా ఆ మోతలను, లక్షణాలనూ అవగాహనచేసుకుంటూ, తనను అస్తమానమూ నిద్రావస్థలోనూ, జాగ్రదావస్థలోనుకూడా, పిలిచేది ఏమిటో అన్వేషించటం వాటికి మరీ ఇష్టంగా ఉండేది.

ఒకరాత్రి అది నిద్రనుంచి ఉలికిపాటుతో లేచింది. దాని కళ్లు ఆత్రంగా ఉన్నాయి, ముక్కులు కంపిస్తూ వాసన ఆరా తీస్తున్నాయి. దాని జూలు అలలు అలలుగా లేచి పడుచున్నది. అరణ్యంలోనుంచి దానికి పిలుపు వినపడేది. ఆ పిలుపు అంత స్పష్టంగానూ, స్ఫుటంగానూ అదివరకెన్నడూ వినిపించిఉండ లేదు. అది ఎస్కిమో కుక్క కూతను పోలిఉన్నది. అయితే అచ్చగా అలాకూడా లేదు. ఇదికూడా దానికి ఏ జన్మలోనో విన్న కేకలాగే ఉన్నది. అది నిశ్శబ్దంగాఉన్న శిబిరాన్ని దాటి అరణ్యంగుండా పరుగుతీసింది, కూతకు సమీపం అవుతున్నకొద్దీ దానివేగం తగ్గింది. దాని ప్రవర్తనలో హెచ్చరిక జాస్తి అయింది. చివరకది చెట్ల

తోడేలు, బక్కూ అరణ్యంలో స్నేహంగా వుండసాగాయి

మధ్య ఉన్న ఒక ఖాళీస్థలాన్ని చేరుకున్నది. అక్కడ ఒక తోడేలు నిటారుగా కూచుని, మోరపైకెత్తి ఆకాశాన్ని చూస్తూ కూతపెట్టటం దానికి కనబడింది. ఆ తోడేలు పొడుగుగా సన్నగా ఉన్నది.

బక్ ఏమీ చప్పుడు చేయకపోయినప్పటికి తోడేలు కూయటంమాని దానిజాడ తెలుసుకోవటానికి యత్నించింది. బక్ తన శరీరమంతా కుదించుకుని, తోకనిక్కించి, అతి జాగ్రత్తగా అడుగులువేస్తూ ఆ ఖాళీస్థలం ప్రవేశించింది. దాని ప్రతి కదలికలోనూ స్నేహభావంతోపాటు బెదిరింపు కూడా కలిసి ఉన్నది. వేటాడి పొట్టపోసుకునే అడవి జంతువులమధ్య ఏర్పడే ప్రమాదంతో కూడిన సామరస్యం ఇలాగేవుంటుంది. అయితే బక్‌ను చూసి తోడేలు కంగారుగా పరిగెత్తింది. బక్ దానిని వెంటాడి అందుకోవటానికి యత్నించింది. కొంతదూరం పోయాక తోడేలుమార్గం బందయింది. తప్పించుకుపోలేని ఎస్కిమోకుక్క చేసినట్టుగా తోడేలు వెనకకాళ్ళపై గిరుక్కున తిరిగి, రోమాలు నిక్కబెట్టి గుర్రుపెడుతూ, తననోటితో గబగబా గాలిని కొరకసాగింది.

బక్ దానిపై పడలేదు, దాన్ని వెంబడించి గుండ్రంగా తిప్పుతూ స్నేహం కోరేదానిలాగా ప్రవర్తించింది. తోడేలు బక్‌ను నమ్మక భయపడింది. ఏమంటే బక్ దానికన్న మూడింతలు బరువున్నది. ఆ తోడేలు తల గట్టిగా బక్ భుజాలదాకా రావటంలేదు. సమయంకోసం పొంచిఉండి అది తప్పించుకుని పారిపోసాగింది. బక్ మళ్ళీ దాన్ని వెంబ

డించింది. దారి కట్టయి ఎన్నోసార్లు తోడేలు ఆగిపోవలసి వచ్చింది. ప్రతిసారీ బక్ దానిస్నేహంకోసం యత్నించింది. తోడేలు దుస్థితిలో ఉండబట్టిగాని, లేకపోతే అది బక్‌కు అంత సులువుగా చిక్కి ఉండదు. బక్ తల తన భుజంతో సమానంగా వచ్చేదాకా అది పరుగుతీసి గిరుక్కున వెనక్కి తిరిగేది మళ్ళీ అవకాశం దొరకగానే పారిపోయేది.

చిట్టచివరకు బక్ పంతమే నెగ్గింది. అది తనకు అపాయం చేయదని తోడేలు రూఢిచేసుకుని స్నేహానికి సిద్ధపడింది. రెండూ మూతులు మూచూసుకున్నాయి. తరవాత అవి స్నేహంగా ఆడుకోసాగాయి. కాని ఆ ఆటలలో సంకోచం ఉన్నది. తమ ఘాతుకత్వాన్ని కప్పిపుచ్చ యత్నించే ఘాతుకమృగాలు అలాగే ఆడుతాయి. కొంత సేపు ఆటలాడాక తోడేలు ఎక్కడికో పనిపెట్టుకుపోయే దానిలాగా బయలుదేరింది. అది బక్‌ను తనవెంట రమ్మని ఆహ్వానించింది. అవిరెండూ పక్కపక్కనే పరిగెత్తుతూ వాగుదాటి, అది ప్రవహించే గండిదాటి ముందుకు వెళ్ళాయి.

వాగు దిగివచ్చే కొండ అవతలివేపున సమతల ప్రదేశం ఉంది. అక్కడ అంతులేని అరణ్యంఉన్నది. ఎన్నో ప్రవాహాలున్నాయి. ఆ అరణ్యం మధ్యగా అవి గంటల తరబడి పరుగెత్తాయి. సూర్యుడు క్రమంగా పైకిలేస్తు న్నాడు. వాతావరణం వెచ్చబడుతున్నది. బక్ పరమానందం చెందింది. ఇంతకాలానికి తాను పిలుపుకు పలికి, తన ఆటవిక

సోదరుడి వెంట పిలుపువచ్చిన చోటికి పోతున్నది. పాత యుగపు జ్ఞాపకాలు తోగిడీలుగా వచ్చి బక్‌ను కదులుస్తున్నాయి. ఒకప్పుడు ఏనాడో తాను ఇలాగే విశాలాకాశం కింద నిసర్గమైన భూమిపై స్వేచ్ఛగా సంచరించింది. తిరిగి ఇప్పుడు ఆపనే చేస్తున్నది.

ఒక ప్రవాహం దగ్గర నీరు తాగటానికి ఆ రెండూ ఆగాయి. ఆగుతూనే బక్‌కు జాన్ కార్టన్ జ్ఞాపకంవచ్చాడు. అది కూర్చుండిపోయింది. తోడేలు పిలుపువచ్చిన చోటికేసి బయలుదేరి, మళ్లా వెనక్కువచ్చి బక్‌ను మూచూస్తూ, దానికి ప్రోత్సాహంకలిగే చర్యలు చేయసాగింది. కాని బక్ వెనక్కుతిరిగి మెల్లిగా వచ్చినదారి పట్టింది. తోడేలు దాదాపు ఒకగంటపాటు మూలుగుతూ దాని వెంబడి పరిగెత్తి తరవాత కూచుని మోకఎత్తి దీనంగా కూతపెట్టింది. బక్ వెనుదిరిగిచూడకుండా ముందుకు సాగిపోతున్నకొద్దీ ఆకూత క్రమంగా వినిపించకుండా పోయింది.

అది శిబిరానికి తిరిగి చేరుకునేసరికి జాన్ కార్టన్ భోజనం చేస్తున్నాడు. అది అతనిపై పొంగిపొర్లే ప్రేమతో మీదదూకి పడేసి, మీద ఎక్కి, అతని ముఖమంతా నాకి చెయ్యికొరికింది. అతను బక్‌ను ముందుకూ వెనక్కూ ఊపుతూ ముద్దుకొద్దీ తిట్టాడు.

రెండు పగళ్ళూ, రెండురాత్రులూ బక్ శిబిరాన్ని అంటిపెట్టుకుని ఉన్నది. అది కార్టన్‌ను తన చూపుమేరదాటి పోనివ్వలేదు. అతను పనిచేస్తున్నంతసేపూ అతని వెనకాలే

ఉండేది. అతను తిండితిన్నప్పుడూ, రాత్రి పడుకున్నప్పుడూ, మళ్ళీ తెల్లవారి లేచినప్పుడూ దానికళ్లు అతనిమీదే ఉండేవి. కాని రెండురోజులూ గడిచాక అరణ్యంలో నుంచి పిలుపు మరింత దాష్టీకంగా వినిపించింది. బక్ కు తిరిగి ఆరాటం పట్టుకున్నది. దానికి తన ఆటవిక సోదరుడు జ్ఞాపకంవచ్చాడు. కొండ అవతలఉన్న ఆహ్లాదకరమైన ప్రాంతమూ, అరణ్యంలో పడి పక్క-పక్క-నే పరిగెత్తటమూ జ్ఞాపకంవచ్చాయి. అదిమళ్ళీ చెట్లమధ్య సంచరించసాగింది. కాని దాని ఆటవికసోదరుడు మళ్ళీ కనిపించలేదు. ఎంతశ్రద్ధగా విన్నప్పటికీ దాని కూత మళ్ళీ వినిపించలేదు.

అది రోజులతరబడి శిబిరాన్ని వదిలిపెట్టి బయటనే నిద్రపోతూ వచ్చింది. ఒకసారి అది కొండదాటిపోయి అరణ్యంలో సంచరించుతూ తన ఆటవిక సోదరుడికోసం ఒకవారంపాటు వెతికింది. అది జంతువులను వేటాడి కడుపు నించుకున్నది. అది ఒక ప్రవాహంలో చేపలు పట్టుతుండగా దానిలాగే అక్క-డ చేపలు పట్టవచ్చిన ఒకపెద్ద నల్ల ఎలుగు బంటిని దోమలు ముసిరి దానికళ్ళు కనిపించకుండా చేశాయి. అది రొదచేస్తూ అడవివెంట పరిగెత్తసాగింది. ఆ ఎలుగు బంటిని బక్ చంపింది. ఎలుగుబంటి అసహాయ స్థితిలో ఉన్నప్పటికీ దానిని చంపటానికి బక్ చాలా శ్రమపడింది. దానిలో అంతకుపూర్వం ఎన్నడూ లేనంత క్రౌర్యం ఇప్పుడు ప్రకోపించింది. మరి రెండురోజుల అవతల బక్ తాను చంపిన ఎలుగుబంటి ఉన్నచోటికి వచ్చేసరికి, కళేబరంకోసం

పోట్లాడుకుంటూ ఒకరకం తోడేళ్ళు ఒకడజను కనిపించాయి. బక్ వాటిని అవలీలగా చెదరగొట్టింది, వాటిలో రెంటిని చంపింది కూడా.

దాని రక్తదాహం వెనకటికన్న చాలా రెచ్చిపోయింది. అది ఇప్పుడు ఇతర ప్రాణులను చంపితినే ప్రాణి, ఒంటరిగా, ఇతరసహాయం ఏమీ లేకుండా, బలంగల ప్రాణులు మాత్రమే బతకటానికి అర్హతగల నిర్దాక్షిణ్య వాతావరణంలో తన శక్తిసామర్థ్యాల ఆధారంతో బతికే జీవి. ఇందువల్ల దానిలో ఒక అతిశయం ప్రవేశించి, అంటువ్యాధిలాగా దాని శారీరక ప్రవృత్తిలోకూడా వ్యాపించింది. ఆ అతిశయం దాని ప్రతి కదిలికలోనూ, దాని కండరాల కదలికలోనూ, దాని నడకలోనూ వ్యక్తమవుతూ, అందమైన దాని జూలు మరింత అందంగా కనపడేలాగా చేసింది. దాని ముట్టెపైనా, కళ్ళపైనా కపిలవర్ణపు మచ్చలూ, దాని పొట్టమీదుగా తెల్లని చారా ఉండకపోతే అది ఒక బ్రహ్మాండమయిన, అపూర్వమైన తోడేలు అనిపించేదే. దానికి బరువూ, సైజూ తండ్రినుంచి వచ్చాయి. ఆకారం తల్లినుంచి వచ్చింది. దాని ముట్టె తోడేలుముట్టె; అయితే ఏ తోడేలుకూ అంతపెద్ద ముట్టె ఉండదు. దాని తలకూడా పెద్దసైజు తోడేలు తలే.

తోడేళ్ళకుండే జిత్తులమారితనంకూడా దానిలో ఉన్నది. దాని తెలివితేటలు దాని తలిదండ్రులవి. వీటన్నిటికీ తోడు అది దుర్భరమైన జీవితంద్వారా అనుభవం

గడించింది. అందుచేత అది వన్యమృగాలలోకల్లా ఘాతుక మృగంగా తయారయింది. జంతువులనుచంపి పచ్చిమాంసం తినే జంతువుగా అది మంచి వయసులో ఉండి, శక్తి సామ ర్థ్యాలతో పొంగిపొర్లుతున్నది. కాన్టన్ దాని వీపుమీద చెయ్యివేసి అపేక్షగాదువ్వితే దానిజూలు మిరమిరలాడుతూ విద్యుత్తును ప్రసరించేది. దాని మెదడూ, శరీరమూ, ప్రతి నరమూ కండరమూ మంచి పదునుపెట్టి ఉండి, పారస్పర్యం కలిగి ఉన్నాయి. కార్యాచరణ పాత్రమైన ఒక దృశ్యం గాని, శబ్దంగాని, సంఘటనగాని కలగగానే అది శరవేగంతో దానికి తగినపని సాగించేది. దెబ్బతీయటానికిగాని, తప్పుకోవ టానికిగాని ఎస్కిమో కుక్కలు ఎంత చలాకీగా ఉంటాయో బక్ అంతకు రెట్టింపు చలాకీగా ఉండేది. మరొక కుక్క ఒక కదలికనుగాని, ఒక శబ్దాన్నిగాని అర్థంచేసుకునేలోపుగా బక్ ప్రతిక్రియ ప్రారంభించేది. అది గమనించటమూ, చర్య నిర్ణయించటమూ చేయటమూ అంతా ఒకేక్షణంలో జరిగిపోయేది. దాని కండరాలు ఉక్కు స్ప్రింగులలాగా ఉండి క్షణంలో కదిలేవి. దానిలో పెల్లుబికి ప్రవహించేజీవశక్తి ఆనందోద్రేకంలో తెంచుకొని బయటపడి ప్రపంచమంతా కమ్మేస్తుందా అన్నట్టుండేది.

ఒకనాడు బక్ శిబిరంనుంచి ఎటో వెళ్ళిపోతూంటే చూసి కాన్టన్ "ఇలాటి కుక్క మరొకటిలేదు" అన్నాడు.

అతని అనుచరు లిద్దరూ అతనితో ఏకీభవించారు. కాని అడవి ప్రవేశించగానే దానిలోవచ్చిన భయంకరమైన

మార్పు వారికి తెలియరాదు. అది వన్యమృగమైపోయి, మామూలుగా నడవటంమానేసి, పిల్లిలాగా చప్పుడు చెయ్యకుండా పొంచినడుస్తూ, చెట్లమధ్యగా నీడలాగా పోసాగింది. దానికి ఎలా దాక్కోవాలో తెలుసు, పాములాగా పొట్టమీాద దేకటం తెలుసు, పాములాగే ఒక్కదూకుమూకి దెబ్బకొట్టటం తెలుసు. అది గూటిలోఉండే పక్షినీ, నిద్రపోయే చెవులపిల్లులనుకూడా పట్టేది! ఎగిరే ఉడతలను గాలిలోనే పట్టేది. గుంటలలోఉండే చేపలూ, నీటికి అడ్డాలుకట్టే "బావర్" (Beaver) మృగాలూ దానికి అందకుండా తప్పుకోలేకపోయేవి. అది తన పొట్టకోసమే చంపేదిగాని వేడుకకు చంపేదికాదు. అయితే తానుచంపిన మృగాలనే తినేది. అందుచేత అది ఒక్కొక్కప్పుడు ఆటలోపడి తనకు చిక్కబోయిన ఉడతలను వదిలిపెట్టేసేది, అవి భయంతో కిచకిచలాడుతూ చెట్లపైకి పరిగెత్తేవి.

చలికాలం సమీాపిస్తున్నకొద్దీ కొండలపైన చలికి తట్టుకోలేక "మూస్" (Moose) దుప్పులు లోయలలోకి అధికసంఖ్యలో దిగిరాసాగాయి. మందనుంచి చీలిపోయిన ఒక "మూస్"దూడను బక్ అదివరకే చంపింది. పెద్ద దుప్పిని చంపాలని దానికి తీవ్రమైన కోరికకలిగింది. ఒకనాడు దానికి బ్రహ్మాండమైన దుప్పి కొండఅంచున తటస్థపడింది. ఇరవై దుప్పులు అరణ్యాన్ని దాటివస్తున్నాయి. వాటి కిది నాయకుడు. అది బాగా ఆరడుగుల ఎత్తుండి, తీవ్రమైన కోపంలో తేరిచూడరాకుండా ఉంది. చిలవలూ పలవలూ వేసిన

దానికొమ్ములకు పథ్నాలుగు మొనలున్నాయి. కొమ్ముల చివరలమధ్య ఏడడుగుల దూరంఉన్నది. దాని చిన్న చిన్న కళ్లు రోషంతో మెరుస్తున్నాయి. బక్‌నుచూసి అది భీకరంగా అరిచింది.

దాని డొక్కలో గుచ్చుకుని ఒకబాణమూ దానిచివర ఈకలూ కనిపిస్తున్నాయి. దాని రోషానికదే కారణం. తన పూర్వీకులు వేటాడిననాటి అనుభవపు ప్రేమతో బక్ ఈ దుప్పిని మందనుంచి వేరుచేయ యత్నించింది. అది అంత తేలికపనికాదు. దుప్పి తలఊపితే దాని కొమ్ములకు అందకుండా, అది తనచీలుగిట్టలతో ఒక్కతొక్కుతొక్కితే పచ్చడి అయిపోకుండా తగినంత దూరంలో ఉండి బక్ దాన్నిచూసి మొరుగుతూ అటూ ఇటూ గెంతసాగింది. తాను తనదారిన సాగిపోతే బక్ వెనకపాటునపడి, కోరలతో తనను చీల్చేస్తుందని తెలిసి దుప్పికి రోషం హెచ్చిపోయింది. అందుచేత అది బక్ మీదకు వెళ్ళింది. బక్ యుక్తిగా వెనకకుతగ్గి, పారిపోవటం చేతగానిదానిలాగా నటిస్తూ, దుప్పిని మంద నుంచి ఎడంచేయసాగింది. ఇంతలో రెండుమూడు దుప్పులు బక్‌పైకి వచ్చి, గాయపడిన దుప్పితిరిగి మందను కలుసుకునే అవకాశం కలిగించాయి.

జీవితంలాగే అడవి జంతువులుకూడా పట్టుదలా, ఓపికా, కార్యదీక్షా కలిగి ఉంటాయి. సాలీడు తన గూడులో గంటలతరబడి కదలకుండా ఉంటుంది; పాము చుట్టుచుట్టుకునీ చిరుతపులి మాటున ఉంటే కదలవు. బతికున్న జీవాలను

రెడ్ ఇండియన్లు నాట్యం చేయడం బకీ చూసింది

వేటాడే జంతువుల కన్నిటికీ ముఖ్యంగా ఈ ఓర్పుఉంటుంది. అలాటి ఓర్పు బక్ కుకూడా ఉన్నది. మందను ముందుకు రాకుండా అటకాయించి, మగదుప్పులను కవ్విస్తూ, దూడలతో ఉన్న ఆడదుప్పులను వేధిస్తూ, గాయపడిన దుప్పికి అది పట్టరాని ఆగ్రహం తెప్పించింది. ఒకపూటల్లా ఇలా జరిగింది. ఒక్క బక్ అనేక బక్ లలాగా ప్రవర్తించింది అది మందను అన్ని వేపులనుంచీ అటకాయించింది, సుడిగాలి లాగా చుట్టూ తిరిగి మందను భయపెట్టింది. దెబ్బ తిన్న దుప్పి మందను చేరుకున్నప్పుడల్లా మళ్ళీ వేరుచెయ్యటానికి ఉపక్రమించి దాని ఓర్పును హరించసాగింది. ఎప్పుడూ చంపే ప్రాణికుండే ఓర్పు చంపబడే ప్రాణికి ఉండదు.

సాయంకాల మయింది. వాయువ్య మూలగా సూర్యుడు అస్తమించి చీకటి వచ్చేసింది. ఆచీకటి ఆరుగంటలుంటుంది. ముందు సాగిపోయే అవకాశంగల మగదుప్పులు తమ నాయకుడి రక్షణకోసం మళ్ళా మళ్ళా వెనక్కుపోవటం వాటికే విసుగెత్తుతున్నది. చలినుంచి తప్పుకుని ఎప్పుడు లోయలో చేరుకుందామా అని వాటికి ఆత్రంగా ఉన్నది. తమను దాపరించిన ఈ కుక్క వదిలేలాగలేదు. అదీగాక ప్రాణాపాయం ఉన్నది ఒక్క దుప్పికే. అందుకు ఒప్పుకుంటే మిగిలిన మంద తమ దారిన తాము పోవచ్చు. చివరి కవి తమ నాయకుణ్ణి త్యాగం చెయ్యటానికి తీర్మానించుకున్నాయి.

చీకటి పడుతూండే సమయంలో మంద ముందుకు వేగంగా సాగిపోవటం తల ముందుకు వంచి ఉన్న పెద్దదుప్పికి

కనబడింది. ఆ మందలో దాని భార్యలున్నాయి, దాని సంతానం ఉన్నాయి. అది వాటివెంట వెళ్ళలేదు. తన ముందుకోరలు చాచి ఎగిరే కుక్క తనను పోనివ్వదు. దాని బరువు అరటన్నుపై చిల్లర ఉన్నది. అది చాలాకాలం దృఢంగా బతికి, పోరాడే శక్తికూడా కలిగి ఉండీ, నిలబడితే తన మోకాలిదాకా రాని ఒక అల్పప్రాణి కోరలకు ఆహుతి అయ్యే స్థితిలో పడింది.

అది లగాయతు బక్ రాత్రిం బగళ్లు ఆ దుప్పిని క్షణం పాటు వదలలేదు, క్షణం విశ్రాంతి ఇవ్వలేదు, చెట్లచిగుళ్లు కూడా అంటనివ్వలేదు. వాటి దారిలో తగిలిన ప్రవాహా లలో ఆ గాయపడిన దుప్పి దహించే దాహాన్ని తీర్చుకునే టందుకైనా అవకాశం ఇవ్వలేదు. అప్పుడప్పుడూ దుప్పి వెనుతిరిగి పారిపోవటానికి యత్నించింది. బక్ దానికి అడ్డం తగలటానికి మారుగా, వెంటాడింది. అది దానికి సక్రమ మైన వేట లక్షణంగా కనబడింది. దుప్పి ఆగినప్పుడు అది పడుకునేది. అది తినటానికిగాని తాగటానికిగాని ప్రయ త్నించినప్పుడు మాత్రం భయకంరంగా మీదికి వచ్చేది.

అంతకంతకూ దుప్పితల చెట్లలాంటి కొమ్ములతోసహా కిందికి వాలిపోతున్నది. దాని నడక బలహీన మవుతున్నది. అది పరిగెత్తుతూ పరిగెత్తుతూ చాలాసేపు ఆగి నిలబడ సాగింది. అప్పుడు దానిముక్కు నేలకు వంగేది, దాని చెవులు నిర్జీవంగా వాలిపోయేవి. బక్ విశ్రాంతి తీసుకోవటానికి, నీరు తాగటానికి ఎక్కువ వ్యవధి లభించసాగింది. అలాంటి

సమయాలలో బక్ తన కళ్ళను దుప్పిపైనే ఉంచి, ఎర్రని నాలుక బయటికిచాచి రొప్పుతూ ప్రపంచం మారిపోతున్నట్లు భావించేది. భూమిపైన కొత్త సంచలనం కనిపిస్తున్నది. ఈ దుప్పులు వస్తున్నట్టుగానే ఇతర ప్రాణులుకూడా వస్తున్నాయి. వాటి సందడి అరణ్యంలోనూ, ప్రవాహాలలోనూ, గాలిలోనూ తెలియవస్తున్నది. ఈ సంగతి బక్ గ్రహించగలిగినది. కంటితోనూ, చెవితోనూ, ముక్కుతోనూ కాదు, ఇంకా సునిశితమైన మరొక జ్ఞానేంద్రియంతో ఏమీ చూడకుండానే, వినకుండానే అది భూమిమీద జరిగే మార్పును గ్రహించగలిగింది. ఈ మార్పు ఫలితంగా కొన్ని విచిత్ర పరిణామాలు జరుగుతాయి. చేతిలో ఉన్న పని ముగిశాక వాటిని గురించి అన్వేషించాలని అది నిశ్చయించుకున్నది.

చిట్టచివరకు నాలుగోరోజున అది దుప్పిని చంపేసింది. దాన్ని తింటూ, నిద్రపోతూ, మళ్ళీతింటూ, మళ్ళీ నిద్రపోతూ ఒక పగలూ, రాత్రీ కళేబరం చెంతనే గడిపింది. తగినంత విశ్రాంతీ, బలమూ చేకూర్చుకుని అది జాన్ కార్టన్ కోసం శిబిరానికి బయలుదేరింది. అది తేలికగా పరిగెత్తుతూ దారి వెతుక్కోకలిగిన అవసరం లేకుండా, కొత్త ప్రదేశాలకు సయితం అడ్డంపడి సూటిగా ఇంటిదారి పట్టింది. దిక్సూచి వెంట ఉన్న మనిషికూడా తన గమ్యానికి అంత సూటిగా పోలేదు.

అది దారిన పోతున్నకొద్దీ భూమిపై కలిగే మార్పు మరింత స్పష్టంగా తెలియవచ్చింది. వేసవిలో అక్కడ

ఉండిన ప్రాణులూ, ఇప్పుడున్న ప్రాణులూ ఒకటికావు. ఈ సంగతి ప్రత్యక్షంగానే తెలుస్తున్నది. ఈ మార్పునుగురించి పక్షులు పాడుతున్నాయి, ఉడతలు వాగుతున్నాయి, గాలి రహస్యాలు చెబుతున్నది.

అనేకసార్లు అది ఆగి స్వచ్ఛమైన ఉదయపుగాలిని దీర్ఘంగా పీల్చి, దానినుంచి ఏదో గ్రహించినదానిలాగా వేగం హెచ్చించి పరిగెత్తసాగింది. ఏదో ప్రమాదం జరగబోతున్నది, లేదా జరిగిపోయింది అన్న భావం దాన్ని వేధించుచున్నది. అది జలపాతాలన్నిటినీ దాటి లోయలో ప్రవేశించి, శిబిరం చేరుకునేటప్పుడు చాలా హెచ్చరికగా మసులుకున్నది.

శిబిరానికి మూడు మైళ్ళ దూరాన కొత్తగా మనుషులు నడిచిన దారి కనబడి దాని మెడమీది జూలు నిక్కబొడుచుకున్నది. ఈ దారి సూటిగా జాన్ కాన్టన్ శిబిరానికే పోతున్నది. వేగంగా జాగ్రత్తగా బక్ ముందుకు సాగింది, దాని నరాలన్నీ బిగలాగినట్టున్నాయి. అనేక వివరాలనుంచి అది ఒక కథను అవగాహనచేసుకుంటున్నది... కథ ముగింపు మాత్రం తెలియటంలేదు. అంతకుముందు అటుగా వెళ్ళిన వారిని గురించి అనేక సంగతులు అది తనముక్కుతో గ్రహిస్తున్నది. చుట్టూ అంతా నిశ్శబ్దంగా ఉంది. పక్షులు పరారీ అయిపోయాయి. ఉడతలు దాక్కున్నాయి. ఒక్క ఉడత మాత్రమే దానికి కనిపించింది. అది ఒక ఎండుకొమ్మకు

అప్పచ్చిలాగా అంటుకుపోయి, దానిలో ఒక భాగంగా ఉన్నది.

బక్ నీడలాగా నిశ్శబ్దంగా ముందుకు సాగిపోతుంటే పక్కనుంచి ఏదో వాసనతగిలి అటు కేసి మొహం తిప్పింది. ఆ వాసనను బట్టి ఒక పొదదగ్గరకి పోయిచూస్తే అందులో నిగ్ కనిపించింది. దాని శరీరంలో ఒక బాణం గుచ్చుకున్నది. బాణం ములికి ఒకవైపునుంచీ, ఈకలు మరొకవైపునుంచీ పొడుచుకు వస్తున్నాయి. నిగ్ దెబ్బతిని తన శరీరాన్ని అక్కడికి ఈడ్చుకువచ్చి చనిపోయింది.

మరొక వందగజాల దూరం పోయేసరికి దారికి అడ్డంగాపడి మృత్యువుతో పోరాడుతూ ఇంకొక కుక్క కనిపించింది. దాన్ని కార్టన్ డాసన్‌లో కొన్నాడు. బక్ ఆగకుండా ఆ కుక్కనుచుట్టి ముందుకు వెళ్ళింది. శిబిరంలో నుంచి మనుషులు మాట్లాడే అలికిడి వినవస్తున్నది. వాళ్ళ గొంతులు పైకి కిందికీ ఊపుతూ మంత్రాలు చదువుతున్నట్టుగా ఉన్నాయి. బక్ పొట్టమీద దేకుతూ తమ శిబిరం చుట్టూ ఉన్న ఖాళీస్థలాన్ని చేరుకుని అక్కడ బోర్లాపడి ఉన్న హాన్స్‌ను చూసింది. ముళ్ళపందిలాగా అతని శరీరం నిండా బాణాలు గుచ్చుకుని ఉన్నాయి. బక్ దృష్టి తమ కుటీరంవేపు వెళ్ళింది. ఆ దృశ్యం చూసేసరికి దాని మెడమీదా, భుజాలమీదా జూలు లేచి నిలబడింది. దాని రక్తం ఉడికిపోయింది. అది భీకరంగా గుర్రుపెట్టింది. గుర్రుపెడు

తున్నానని దానికి తెలియదు. జాన్ కార్టన్‌పై దానికిగల ప్రేమమూలాన దానికి మతిపోయినట్టయి, తన జన్మలో ఆఖరుసారి ఉద్రేకానికి లొంగిపోయి తన క్షేమమూ, జిత్తులూ మరిచిపోయింది.

ధ్వంసమైపోయిన కుటీరంచుట్టూ "యీహాట్" (Yeehat) ఇండియను జాతివాళ్లు నృత్యాలు చేస్తున్నారు. వారికి భయంకరమైన గర్జన వినిపించింది; తమపైకివస్తూ ఒక వింత జంతువు కనిపించింది. అలాటిదాన్ని వారు ఎన్నడూ చూసి ఉండలేదు. వారిని విధ్వంసం చెయ్యాలన్న ఆవేశంతో బక్ తుఫానులాగా వారిపై దూకింది. అది అందరికన్నా దగ్గిరగా ఉన్న యీహాట్ నాయకుడిపై దూకి అతని కంఠాన్ని చీల్చివేసింది. అతని కంఠసిర చీలి రక్తం దొణ దొణ కారసాగింది. అది ఈ మనిషిని వదిలేసి ఇంకొకడిపైన దూకి వాడిగొంతు చీల్చింది. దాని ధాటిని ఆపేవారు లేక పోయారు. అది ఆ మనుషులమధ్యను వెళ్ళిపడి ఎడాపెడా విధ్వంసం చెయ్యసాగింది. క్షణంపాటైనా అది నిలిచి ఉండనందువలన దాన్ని బాణాలతో కొట్టడం ఆ మనుషులకు అసాధ్యమయింది. బక్ మెరుపులాగా కదులుతుండటంవల్లనూ, ఇండియనులు గుమిగూడి ఉండటంవల్లనూ వారు విసిరిన బాణాలు వాళ్ళలో వాళ్ళకే తగిలాయి. ఒక యువకుడు బక్‌పైకి బలంగా విసిరిన ఈటె మరొకడి రొమ్ముకు తగిలి వాడివీపులోనుంచి దాని ములికి తోసుకువచ్చింది

అంతలో ఆ మనుషులను భయం ఆవేశించింది. ఏదో భూతం వచ్చిందని అరుస్తూ వారు చుట్టుపక్కల ఉన్న వనంలోకి పారిపోయారు.

బక్ నిజంగా బ్రహ్మరాక్షసే. అది వారిని చెట్ల మధ్యగా వెంటాడి అనేకమందిని మడమలు పట్టుకుని లాగి పడగొట్టింది. యీహాట్‌లకు అది దుర్దినం. వారు చెల్లా చెదురుగా అన్నివైపులా పారిపోయారు. తిరిగి వారంతా ఒకచోటకూడి ఎవరుపోయారో, ఎవరు మిగిలారో తెలుసుకో వటానికి ఒకవారం పట్టింది. బక్ వాళ్ళని తరమటం విసుగెత్తగానే పాడుబడిన శిబిరానికి తిరిగివచ్చింది. దానికి పీట్ శవం పక్కమీదనే కనిపించింది. ఇండియనులదాడిలో మొదటగా బలిఅయినది అతనే. కార్టన్ ఇండియనులతో సాగించిన తీవ్రపోరాటం తాలూకు "వాసన" బక్‌కు అంతటా తెలుస్తున్నది. అది ఆ వాసనను అనుసరించి ప్రతి వివరమూ తెలుసుకుంటూ ఒక లోతైన నీటిమడుగుదాకా వెళ్ళింది. దాని ఒడ్డున స్కీట్ పడి ఉన్నది. దాని తలా ముందుకాళ్ళూ నీటిలోకి ఉన్నాయి. చివరిదాకా అది తన విశ్వాసాన్ని దక్కించుకున్నది. ఆ మడుగులోని నీళ్ళు మురికిగా, రాగులు కలిసినట్లుండి దానిలో ఏమున్నదీ తెలియరావటంలేదు. జాన్ కార్టన్ అందులో ఉన్నాడు. అతని జాడ మడుగులోకి వెళ్ళటం బక్ పసిగట్టింది గాని, తిరిగి రావటం పసిగట్టలేదు.

రోజల్లా బక్ మడుగుదగ్గిరా, శిబిరంచుట్టూతా కారాడింది. చావుమూలాన చైతన్యమంతా పోవటమూ, చచ్చినవాళ్ళు బతికున్నవారి జీవితాలనుంచి ఎడంగా పోవటమూ దానికి తెలుసు. జాన్ కార్టన్ చనిపోయాడనికూడా దానికి తెలుసు. కాని దానిలోపల ఏదో డొల్లఅయిపోయినట్టు కనిపించింది. అది ఆకలి అయినప్పుడు కలిగే భావంలాంటిదే. అయితే తింటే అకలిపోతుంది, ఈడొల్ల తిండితో పూడ్చేది కాదు. ఒక్కొక్కసారి యీహోట్ల కళేబరాలు చూస్తే ఆ బాధ మరుపుకువచ్చేది; అలాంటప్పుడు అది తనను చూసి తానే గర్వపడేది—అలాటి గర్వం దానికి అదివరకెన్నడూ అనుభవం కాలేదు. వేటాడదగిన జంతువులన్నిటికన్నా గొప్పవాడైన మనిషిని తాను చంపింది. చంపటంలోకూడా కోరన్యాయాన్నీ, దుడ్డుకర్రన్యాయాన్నీ ధిక్కరించి మరీ చంపింది. అది ఆ శవాలు ఎలాఉంటాయో అని వాసన చూసింది వాళ్ళు అమిత సులభంగా చచ్చారు. ఎస్కిమో కుక్కలైతే అంత సులభంగా చావవు. వాళ్ళదగ్గిర ఆ బాణాలూ, ఈటెలూ, దుడ్డుకర్రలూ లేకపోతే అసలెందుకూ పనికిరారు: ఇకముందు వాళ్ళచేతిలో ఆ బాణాలూ, ఈటెలూ, దుడ్డుకర్రలూ ఉంటే తప్ప అది వాళ్ళను ఖాతరు చెయ్యదలచలేదు.

రాత్రి పడింది. చెట్లమీదుగా పూర్ణచంద్రుడు వచ్చి భూమిని కాంతితో నింపాడు. మడుగు దగ్గిర విచారంగా

భీష్ముడు — అక్కడ శరాఘాతంతో పడివున్నాడు.

ఉన్న బక్‌లో హఠాత్తుగా ఒక కొత్త చైతన్యం వచ్చింది. అరణ్యంలో కొత్త ప్రాణులు కదుల్తూవుండటం దానికి తెలుస్తున్నది. అది లేచినిలబడి ఆలకిస్తూ వాసన పట్టసాగింది. దూరాన్నుంచి అస్పష్టంగా ఒక మొరుగు గాలిమీద తేలి వచ్చింది. దానివెంబడి ఇంకా అనేక మొరుగులు విన వచ్చాయి. క్రమంగా ఈ మొరుగులు దగ్గరగా వచ్చి, మరింత దగ్గరగా వినపడసాగాయి. అది ఈ చప్పుళ్ళను గతయుగంలో తాను వినిఉన్నవిగా స్మరణకు తెచ్చుకున్నది. అది శిబిరం దగ్గరగా ఉన్న ఖాళీస్థలం మధ్యకు వెళ్ళి ఆలకించింది. ఇది పిలుపే. పూర్వంకన్నా కూడా ఆకర్షవంతమైన, బలీయమైన పిలుపు. ఈ పిలుపులో చాలా గొంతుకలున్నాయి. అది ఈపిలుపును పాటించటానికి పూర్వంకన్నా కూడా సంసిద్ధంగా ఉన్నది. జాన్ థార్టన్ పోయాడు. ఆఖరు బంధం తెగిపోయింది. ఇక దానికి మనిషి బాధ్యత లేదు.

వలసపోయే "మూస్" దుప్పులను మాంసాహారం కోసం వెంటాడుతూవచ్చిన "యీహాట్" ఇండియన్లలాగే తోడేళ్ళమందకూడా అరణ్యమూ, ప్రవాహాలూ గల ప్రాంతంనుంచి బక్ ఉండే లోయలోకి దిగివచ్చింది. అవి వెన్నెలలో ప్రవహించే పాదరసములాగా కనిపిస్తూ ఖాళీ జాగాలోకి జొరబడ్డాయి. వాటి రాకకు ఎదురు చూస్తూ విగ్రహంలాగా బక్ నిశ్చలంగా ఖాళీజాగామధ్య నిలబడింది.

నిశ్చలమైన ఆ పెద్ద ఆకారాన్నిచూసి నిర్ఘాంతపోయి ఒక్క క్షణం నిలిచిపోయాయి. చివరకు ఆ తోడేళ్ళలో కల్లా ఎక్కువ ధైర్యంగలది సూటిగా బక్ పైకి దూకింది. మెరుపు లాగా బక్ ఎదురుదెబ్బకొట్టి దాని మెడ విరిచేసింది. అది మళ్ళీ వెనకటిలాగే నిశ్చలంగా నిలబడింది. దెబ్బతిన్న తోడేలు దాని వెనక బాధతో పొర్లుచున్నది. ఒకటితరవాత ఒకటిగా మూడు తోడేళ్లు బక్ పైకి వెళ్ళి, చీలినగొంతుల నుంచీ, భుజాలనుంచీ రక్తం కారుతూ వెనక్కు తగ్గాయి.

ఇదిచూసి తోడేళ్ళన్నీ దొమ్మిగా, ఒకదాన్ని ఒకటి ఆత్రంగా తోసుకుంటూ బక్ పైన బడ్డాయి. బక్ ను దాని వేగమూ, చురుకుతనమూ కాపాడాయి. అది తన వెనక కాళ్ళపై బొంగరంలాగా తిరుగుతూ, ఒకేసారి అన్నివైపుల నుంచీ తనను తాను రక్షించుకుంటూ ఎడాపెడా చీల్చి చెండాడసాగింది. కాని ఆ తోడేళ్ళు తనను వెనకనుంచి దెబ్బతీయకుండా చూసుకోవలసి రావటంచేత అది మెల్లిగా వెనక్కు జరుగుతూ, నీటి మడుగుపక్కగా, గండిలో ప్రవేశించి, గులకరాతిగట్టు చేరుకుని, బంగారంకోసం మను షులు తవ్విన ఒక కందకంలో చేరింది. ఇక్కడ దానికి వెనకనుంచీ, పక్కనుంచీ రక్షణ ఉన్నది. అందుచేత అది తోడేళ్ళను ఎదట ఉంచుకుని సులువుగా పోరాడగలిగింది.

ఒక అరగంట గడిచాక తోడేళ్ళు ఏమీ చెయ్య లేక వెనక్కు తగ్గాయి. వాటి నాలుకలు బయటికి వేళ్ళాడు

తున్నాయి, వెన్నెలలో వాటి కోరలు తెల్లగా, క్రూరంగా మెరుస్తున్నాయి. కొన్ని పడుకుని తలలు ఎత్తి, చెవులు నిక్కబెట్టుకుని ఉన్నాయి. కొన్ని నిలబడి బక్‌ను గమనిస్తున్నాయి. కొన్ని మడుగులో నీళ్ళు తాగుతున్నాయి. ఒక బక్కచిక్కిన పొడుగుపాటి తోడేలు అతి జాగ్రత్తగా స్నేహభావంతో బక్‌ను సమీపించింది. బక్ తన ఆటవిక సోదరుణ్ణి గుర్తించింది. రెండూ సన్నగా మూలుగుతూ ముట్టెలు ఆనించుకున్నాయి.

తరవాత ఒక ముసలితోడేలు, చాలా పోట్లాడటంలో గాయపడినది. ముందుకు వచ్చినది. బక్ దానికి ముందు కోరలు చూపి తరవాత దాన్నికూడా మూచూసింది. తరవాత ముసలి తోడేలు కూచుని, చంద్రుడికేసి మోర ఎత్తి దీర్ఘంగా కూసింది. మిగిలిన తోడళ్ళుకూడా కూచుని కూశాయి, ఇదే అసలు పిలుపు. బక్ కూడా కూచుని వాటితోపాటు కూసింది. ఆ తరవాత అది తానున్న చోటి నుంచి ఇవతలికి వచ్చేసింది. తోడేళ్ళు దాని చుట్టూ మూగి సగం స్నేహంతోనూ, సగం మొరటుతనంతోనూ దాన్ని వాసన చూశాయి. తోడేళ్ళ గుంపునాయకులు గట్టిగా అరుస్తూ అరణ్యానికి దారితీశాయి. మిగిలిన తోడేళ్ళు వాటితో కలిసి అరుస్తూ వెనకాతలే బయలుదేరాయి. తన ఆటవిక సోదరుడి పక్కన పరుగెత్తుతూ, తాను కూడా అరుస్తూ, బక్ వాటివెంట బయలుదేరింది.

న్యాయంగా బక్ కథ ఇక్కడితో ముగియవచ్చు. కొద్ది సంవత్సరాలు గడిచాక యీహాట్ ఇండియనులు కలప అడవులలో ఉండే తోడేళ్ళలో మార్పులు గమనించారు. కొన్ని తోడేళ్ళనెత్తినా, ముట్టెమీదా కపిలవర్ణం మచ్చలు కనిపించాయి. వాటి ఛాతిలమీదిగా తెల్లటిచారలున్నాయి. ఇంతకంటే వింత ఏమిటంటే తోడేళ్ళ గుంపును వెంట వేసుకుని ఒక దయ్యం కుక్క పరిగెత్తుతూ ఉండటం తాము చూశామని యీహాట్లు అన్నారు. వారికి ఆ దయ్యం కుక్కను చూస్తే చాలా భయం. ఎందుకంటే జిత్తులలో అది వారిని మించినది. నడి శీతాకాలంలో అది వారి శిబిరాలను దోస్తుంది, వారి బోనులను కాజేస్తుంది, వారి కుక్కలను చంపేస్తుంది, వారిలో అతి ధైర్యశాలులను కూడా అది లక్ష్యపెట్టదు.

ఇంతేకాదు శిబిరంనుంచి బయటికివెళ్ళే కొందరు వేటగాళ్ళు మళ్ళీ శిబిరం చేరారు. కొందరి శవాలు గొంతులు చీలి కనిపించాయి. ఆ శవాల పక్కన్న ఉన్న తోడేలు కాళ్ళగుర్తులు మామూలు తోడేళ్ళకాళ్ళ గుర్తులకన్న చాలా పెద్దవి. శీతాకాలారంభంలో మూస్ దుప్పుల వెనకాలే వలసవచ్చే యీహాట్లు ఒక ప్రత్యేకమైన లోయలోకి ఎన్నడూ అడుగుపెట్టరు. ఆ లోయలోకి ఒక భూతం ప్రవేశించి ఏవిధంగా అక్కడ తిష్ఠవేసిందో వారు

చలిమంటచుట్టూ చేరి కథలు చెప్పుకునేటప్పుడు కొందరు స్త్రీలు విచారంలో మునుగుతారు.

ప్రతి వేసవిలోనూ ఆ లోయలోకి ఒక ప్రాణి వస్తుంది. దాన్ని గురించి యీహాట్‌లకు తెలియదు. అది అద్భుతమైన జూలుగల తోడేలు. అది కొన్ని విషయాలలో మిగిలిన తోడేళ్ళలాగా ఉంటుంది గాని మరికొన్ని విష యాలలో చాలా భిన్నంగా ఉంటుంది. అది అరణ్యప్రాంతం నుంచి ఒంటరిగా బయలుదేరి చెట్లమధ్యగల ఖాళీ స్థలానికి వస్తుంది. ఇక్కడ చీకిపోయిన తోలుసంచుల్లోనుంచి పచ్చటి పదార్థం కారి భూమిలోకి ఇంకిపోయి కనిపిస్తుంది. ఈపచ్చని పదార్థం సందులనుంచి పొడుగుపాటి గడ్డి మొలిచింది. ఆ పదార్థంపైన పాకుడు కట్టింది. ఆ జంతువు ఇక్కడికి వచ్చి కొంతసేపు ఏదో జ్ఞాపకం చేసుకుని, చివరకు ఒక్కసారి దీర్ఘంగా ఏడ్చి, వెళ్ళిపోయింది.

కాని అది ఎల్లప్పుడూ ఒంటరిగా సంచరించదు. దీర్ఘ మైన శీతకాలపు రాత్రులు ఆరంభమై, తోడేళ్ళు తమ ఆహారాన్ని వెన్నంటి లోయలోకి వచ్చేటప్పుడు, అది గుంపుకు ముందుండి నడుస్తుంది. వెలవెలపోయే వెన్నెలలో గాని, బోరియాలిస్ కాంతిలోగాని దాని శరీరం మిగిలిన తోడేళ్ళకన్న ఎత్తుగా కనిపిస్తుంది, దాని గొంతునుంచి అనాదిగా వస్తున్న తోడేళ్ళ పాట వినవస్తుంది.



